# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి,
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్ని అందించండి.

**పోషకాహార లాభం :** సెరిలాక్ ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు, కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు, విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి. అన్నీ సమ పాళల్లో వున్నాయి.

**రుచి లాభం :** పాపాయిలకు సెరిలాక్ రుచి ఇష్టం.

**సమయం ఆదా లాభం :** సెరిలాక్ ముందుగా వండినది. దానిలో పాలూ, పంచదార వున్నాయి. దానిని వెచ్చటి నీటితో కలిపితే చాలు.

**ఎంపిక లాభం :** ఎంచుకునేందుకు మూడు రకాల సెరిలాక్ వుంది.

మీ పాపాయికి సమతూకంలో పోషకాహారాన్ని అందించేందుకూ, తయారుచేయటంలో పరిశుభ్రతను పాటించేందుకూ, డబ్బా మీద సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు ని

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




## సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం

# క్షణ మాత్రంలో...



## ఐటెక్స్

### కాజల్ సుప్రీం

మీ కళ్ళ అందాన్ని ఇనుమడింపే
కాజల్ సుప్రీం. ఆధునిక వనితల
కళ్ళను చక్కగా అలంకరించ
డానికి, ఆరోగ్య సూత్రాలనను
సరించి తయారుచేయబడిన
కాజల్ సుప్రీం మీ చేతిలో
సులభంగా ఇమిడేది.




అరవింద్ లాబొరేటరీస్
కళ్ళను సంరక్షించే శ్రేష్ఠ
వస్తువుల తయారీలో
దాదాపు 50 సంవత్సరా
లకు పైగా అనుభవం వున్నవారు.

గరిష్ఠ వెల (MRP)
రూ. 6.00
(స్థానిక పన్నులు అదనం)

**అరవింద్ లాబొరేటరీస్** మదరాసు **600 033.**

Imageads 2788 Tel



# అమృతహస్తాలు పై సమీక్షలు

**జూన్ 'చతుర'లో ప్రచురితమైన 'జె.వి.బాబు'గారి నవల 'అమృతహస్తాలు'పై మాకు అసంఖ్యాకంగా అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న అరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.**

## పెళ్లి స్నేహం కోసమే

(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)

'అమృతహస్తాలు'లో రచయిత జె.వి.బాబుగారు చాలా ఆసక్తికరమైన, ప్రతివ్యక్తీ ఆలోచించాల్సిన అవసరమున్న అంశం గురించి చర్చించారు! "మగవాడికి పెళ్ళి అవసరమా? అయితే ఎందుకు?" అన్న సమస్యకు రచయిత ముగింపు— "భార్యవల్ల కలిగే ఓదార్పు, సానునయం కోసం మగవాడు పెళ్ళిచేసుకోవాలి". అది నిజమే అయినా కేవలం 'ఓదార్పు' మాత్రమే పరమప్రయోజనమా?

రచయిత అభిప్రాయంప్రకారం మగాడు సెక్స్‌కోసంగాని, పిల్లలకోసంగాని, డబ్బుకోసంగాని, పెద్దవాళ్ళ తృప్తికోసంగాని పెళ్ళిచేసుకోవాల్సిన అవసరం లేదు. వీటిల్లో చివరి రెండింటి విషయంలో ఎవరైనా ఒప్పుకుంటారు. కాని పెళ్ళి చేసుకోవడంవెనక సెక్స్, పిల్లల్నికనడం అనేవి ముఖ్యమైన అవసరాలే మనిషికుండే భౌతికావసరాలు, సహజసిద్ధమైన కోరికలు సామాజికంగా ఎంతో ముఖ్యమైనవి. కేవలం డబ్బుతో తీర్చుకునే 'క్షణికావేశం' సమాజానికి తండ్రి తెలీని వ్యక్తుల్ని బహుమానంగా ఇస్తుంది. దీనివల్ల ఎన్నో దుష్పరిణామాలు ఉత్పన్నమౌతాయి.

పిల్లలకోసం పెళ్ళిచేసుకోవాలా? అని రచయిత ప్రశ్న. పిల్లలు లేకపోతే రేపటితరం ఉండదు. అప్పుడు ఈ ప్రపంచంమే ఉండదు. అందరూ పెళ్ళిళ్ళుచేసుకునికూడా సంతానాన్ని కనడంమానేస్తే ఆ పరిస్థితి ఊహాకందదు. పైగా పిల్లలవల్ల వ్యక్తికి చివరిదశలో కొంతఆధారంఉంటుంది. రచయిత ఈ విషయాల్ని చర్చించలేదు.

వీటన్నిటినీ మించి 'పెళ్ళి'లో అతి ముఖ్యమైన ఈ విషయం జీవితాంతం తనకు తోడుగాఉంటూ, కష్టసుఖాల్ని తనతోబాటు అనుభవిస్తూ తన అభివృద్ధిని, అయుష్షును మనసారా కోరుకుంటూ, తన కోపతాపాల్ని భరించే ఒక మంచి 'స్నేహితురాలు' దొరకడం. 'భార్య' అనే ఈ స్నేహితురాలు కేవలం 'పెళ్ళి' ద్వారా మాత్రమే దొరుకుతుంది. భార్యాభర్తల స్నేహం ఒక్కనాటిదికాదు. ఇద్దరూ చనిపోయేంతవరకు కలిసి జీవిస్తారు. ఈ స్నేహాన్నే మనం 'కాపురం' అంటున్నాం. దీనివల్ల మనిషికి మానసిక విశ్రాంతి, సమాజానికి సరికొత్త జవం, జీవం వస్తాయి. భార్యాభర్తల స్నేహంలో ముఖ్యంగా ఉండేది శ్రమ విభజన. సంపా

దించడం భర్తవంతు, సముదాయించడం భార్యవంతు. ఇంటిపన్లు భార్యవి, బయటిపన్లు భర్తవి. అయితే ఇంటిపన్లు చెయ్యడానికి 'పనిమనిషి' చాలదా? అని అనుకుంటే? పనిమనిషి శాశ్వతంకాదు, ఆ చేతల్లో 'బాధ్యత' ఉంటుందేగాని ప్రేమ, అభిమానం, ఆప్యాయత ఉండవు. ఇవన్నీ కేవలం 'భార్య' వల్లనే వస్తాయి. ఆ భార్య 'వివాహం'ద్వారానే వస్తుంది. వివాహజీవితంలో భర్తకు భార్యద్వారాకలిగే 'ఓదార్పు' ఒక అంశంమాత్రమే!

మనిషికి ఎంత సంపదవున్నా 'ఆప్యాయత' కరువైనప్పుడు అదంతా వ్యర్థం. మగాడు జీవితంలో సంపాదించే ఒకేఒక్క 'ప్రాణస్నేహితురాలు' భార్య మాత్రమే.

అసలు 'పెళ్ళి ఎందుకు చేసుకోవాలి' అన్న ప్రశ్నకు స్థూలసమాధానం ఇవ్వాలంటే— "జీవితాంతం తనతో స్నేహంచేసే ఒక వ్యక్తిని సంపాదించుకోవడం కోసం పెళ్ళిచేసుకోవాలి" ఇంటా బయటా పనుల్ని పంచుకోవడం, పిల్లల్ని కనడం, భౌతికావసరాలు తీర్చుకోవడం, ఒకరినొకరు ఓదార్చుకోవడం... మిగిలినవన్నీ ఆ 'స్నేహం'లోనే వస్తాయి.

'అమృతహస్తాలు'లో రచయిత ఈ విషయాల్నికూడా చర్చించివుంటే నవలవిలువ మరింత పెరిగివుండేది. ఈ చర్చకు ఎక్కువ ప్రాధాన్యంఇచ్చివుంటే పాఠకులు చాలా సంతోషించేవారు. ప్రారంభంలోనే ఈ సమస్యని చర్చించి పాఠకులలో ఉత్సాహాన్ని రేకెత్తించి, చివరికి చిన్నముగింపుతో నవలని పూర్తిచెయ్యడం, పిండివంటల రుచిచూపించి, ఆఖరున చప్పిడి మెతుకులు పెట్టినట్టుంది.

జె.వి.బాబుగారి నవలలో మెచ్చుకోదగ్గ అంశాలు— ఏమాత్రం ఆగకుండా, చక్కని శైలిలోసాగే కథాకథనం; పాత్రోచిత సంభాషణలు. అన్నిటినీమించి ప్రకృతి వర్ణన. ముఖ్యంగా పల్లెప్రాంతాల వర్ణన కొత్తరకంగా వుంది.

సగటుమనిషికి సంబంధించిన ఆలోచనలకి స్థానంలేకుండాపోతున్న నేటి నవలాసాహిత్యంలో, అన్నివర్గాలవారూ ఆలోచించదగిన సమస్యపై నవలరాసిన రచయిత అభినందనీయులు.

—సి.ఎ.బాబు, తిరుపతి.

## నాణానికి మరో వైపేదీ?

(ద్వితీయ బహుమతి రు. 75/- పొందిన సమీక్ష)

"మగాడు పెళ్లెందుకు చేసుకోవాలి?" అన్న ప్రశ్నకు చక్కటి సమాధానాన్ని "భార్య"కు సరైన నిర్వచనాన్నీ చెప్పిన నవల 'అమృతహస్తాలు'.

అయితే 'పెళ్లి' అనే ఒప్పందానికి ఇద్దరు వేర్వేరు రకాల (ఆడ, మగ) మనుషుల అంగీకారం కావాలి. శరీర నిర్మాణాన్ని బట్టి మాత్రమే కాక సాంఘికప్రయోజనాలను బట్టీ, మానసిక స్థితినిబట్టీ ఇద్దరిపై ఒకరినుండి వేరొకరు ఆశించేది ఆధారపడి ఉంటుంది. భార్యనుండి భర్త పొందదగినది 'ఓదార్పు' మాత్రమే అయితే, దానిపై పరిస్థితుల ప్రభావం తప్పకుండా ఉంటుంది. రమేష్ ఆశించినట్టు దొరకాలంటే అమ్మాయిలందరూ శ్వేతలు కాలేరు. అలాంటి శ్వేతయే తమ భార్య కావాలనుకునే వారికి మన ప్రస్తుత వివాహ వ్యవస్థలో రమేష్‌కు దొరికిన అవకాశాలవంటివి అందరికీ దొరకవు. ఒక భార్య తన భర్తకు ఓదార్పును అందించాలంటే, ఆమె అతడినుండి తను ఆశించినది పొందగలిగినదయి ఉండాలి. ఈ 'పరస్పరత్వం' అన్నది వైవాహిక జీవితంలో చాలా అవసరం.

పోతే పెళ్లి ఇద్దరు మనుషులకు సంబంధించిన విషయమైనప్పుడు కేవలం భర్త భార్యనుండి ఆశించదగ్గది మాత్రమే గణనలోకి తీసుకుంటే అది సమగ్రపరిశీలనకాదు. 'స్వార్థం' మాత్రమే అవుతుంది. భార్యకూడా మనిషే, ఆమెకూ స్పందనలో,సమస్యలో ఉంటాయి! ఒక భర్తకు భార్యనుండి ఓదార్పు కావలసివస్తే, మరొక భర్తకి ప్రోత్సాహం కావాలి. ఇంకొక భర్తకి మరొకటి కావాలి. అయితే ఈ భర్తలందరికీ తాము భార్యలనుండి ఆశిస్తున్నది సమంజసమే అనేది నిరూపించుకోవడానికి ఒక 'వాదన' ఉంటుంది. ఈ వాదనప్రతి ఒక్కరి విషయంలో పూర్తిగా వ్యక్తిగతంకాబట్టి దాన్ని కొట్టిపారేసే అధికారం ఇంకొకరికి ఉండదు. కనుక రచయిత నాణానికి అవతల వైపును కూడా కొంత చూపించి శ్వేతమనసును మరికొంత విశ్లేషించినట్టయితే నవల మరింత

సంపూర్ణంగా ఉండేది.

అయినప్పటికీ చక్కటి కథాంశంతో హాయిగా చదివించేశైలిలో ఆసక్తికరంగా రాసిన 'అమృతహస్తాలు' నవల నేటి యువ తరం, ముఖ్యంగా కాబోయే భార్యభర్తలు తప్పకుండా చదవదగినది.

—జి.భవానీ రమణ, సికింద్రాబాద్

## ఎన్నో విషయాలుండగా...?

(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)

నవల రాయటానికి ఈనాడు మనకు ఎన్నో విషయాలు వున్నాయి. మనం నిత్యం గమనిస్తున్న కోటి సమస్యల మీద నవలలు రాయవచ్చు. దేశాన్ని దెయ్యంలా పీడిస్తున్న సమస్యలు కోకొల్లలు. ఆహారసమస్య, అనారోగ్యం, నిరక్షరాస్యత, నిరుద్యోగం, మూఢనమ్మకాలు, వరకట్నాలు, పిల్లల కాన్వెంట్‌చదువులు, వర్కింగ్‌వుమెన్, ఆకలిచావులు, మానభంగాలు, పెళ్ళికాని తల్లులు, పెళ్ళికాని మహిళలు యిలా ఎన్నో విషయాలుండగా మరీ అన్యాయంగా "మగాడు ఎందుకు పెళ్లి చేసుకోవాలి?" అనేదాన్ని నవలావిషయంగా ఎన్నుకోవటంబాగాలేదు. నవల చదివింతరువాత "అయ్యారే! మనకు తెలీని విషయాన్ని తెలిపాడే!" అనే అనుభూతి పాఠకులకు కలగదు. "ఇంతేనా?" అనే తేలిక సమాధానంతో నవలలో కథఅంతమౌతుంది. అందుకే రచయితలు మంచి సబ్జెక్ట్స్ ఎన్నుకోవాలి. ఎన్నుకునే ముందు బాగా ఆలోచించుకోవాలి.

ఈ నవల 'చతుర' సంపాదకుల చేతుల్లో పడింది, గనుక అద్భుతమైన పబ్లిసిటీదొరికింది. అందమైన అట్టమీదబొమ్మకుదిర్చారు. ఆపైన కథకు రంగులబొమ్మలు స్టేటస్ ఏర్పరిచాయి. మినీ స్కర్ట్ తొడిగిన పల్లెపిల్లలా తయారైంది నవల.

నవల, కథానిక, మినీకథ ఈ ప్రక్రియల్ని ఎప్పుడెప్పుడు ఎలా? ఎందుకు ఉపయోగించుకోవాలో మన రచయితకు తెలియదా? కథానికకు పనికొచ్చే వస్తువును తీసుకొని నవలగా రాయటంవల్ల జరిగే లోపం అర్థం కాదా?

మానవజీవితాన్ని లేదా జీవితభాగాన్ని రాయాలనుకున్నప్పుడే నవలాప్రక్రియను యెంచుకోవాలి. సమాజాన్ని వాతావరణంగా వాడుకోవాలి. పాత్రలకు క్రమవికాసం కల్పించటానికి 'విపుల' వర్ణనలు చేయాల్సివచ్చినప్పుడే నవలా ప్రక్రియను ఎన్నుకోవాలి.

—టి.జగదాంబ, తిరుపతి.

## ఏం సబబు?

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

నవల పేరు 'అమృతహస్తాలు' చూడగానే ఇదేదో సెంటిమెంటల్ నవల అనిపించింది, కానీ చదువుతూపోతే ముగింపు మరొకరకంగా వుంది. రచయిత ఇతివృత్తం ఎన్నుకోవటంలో చక్కని నైపుణ్యం ప్రదర్శించారు. ముఖ్యంగా ఏగాలివాటుకి అటుకొట్టుకుపోయే ఈనాటి యువతరానికి, ఒకమాటకి కట్టుబడి ఉండాలనే విషయాన్ని చక్కగా చెప్పారు. ఎన్ని అవాంతరాలొచ్చినా, ఎంత క్లిష్టపరిస్థితి ఎదురైనా, తన ధ్యేయాన్ని విడిచిపెట్టకూడదన్న నియమపాలన బాగున్నది. అయితే చక్కని ఇతివృత్తాన్ని ఎన్నుకున్న రచయితకి, దాన్ని మలచటానికి అనువైన భాషాసంపద, లోపించింది. ముఖ్యంగా 'రమేష్ లేచాడు, బట్టలు తొడిగాడు, స్కూటర్ ఎక్కాడు, స్కూటర్ పార్క్‌చేసి ఇంటిలో దూరాడు' ఇటువంటి పదాలు పానకంలో పుడకలుగా, పాఠకులకు అనిపించకమానవు. కొన్నిచోట్ల అయితే ఇలాంటి మాటలతోనే కొన్నిపేజీలు నిండిపోయాయా? అనిపించింది. అయితే కథాకథనంలోగల వాడి వీటన్నిటిని తోసేస్తూ పాఠకుడిని లాక్కువెడుతుంది. రమేష్ వంటి ఆదర్శ యువకుడు మాటిమాటికీ నేటి ఆడవాళ్లు భర్తలను నిరాదరిస్తున్నారు. తమ ఆధిక్యాన్ని నిరూపించటానికి ప్రయత్నిస్తున్నారు అనటం బాగా లేదు. ఆ లోపం స్త్రీ పురుషులిద్దరిలో ఉన్నప్పుడు ప్రత్యేకించి ఒక్క ఆడవాళ్ళనే ఎత్తిచూపటం ఏంసబబు? పైగా అమ్మ తనని




అర్థం చేసుకోలేదే! అని బాధఒకటి. మూడు వంతుల జీవితాన్ని కాచివడబోసిన ఆతల్లి అంతకంటే ఎక్కువ ఏం అర్థంచేసుకుంటుంది. రమేష్ అలా అనుకోవటం అనేది యువరక్తంలోగల ఆవేశం, తొందరపాటుతనం అనిపిస్తుంది.

ఇట్లా కొన్ని లోపాలున్నా 'అమృతహస్తాలు' మొత్తంమీద చక్కని నవల. రచయిత మరింత సాధనచేస్తే చక్కని శిల్పంతో కథలను అల్లగలరు.

—టి.ప్రభావతి, గుడివాడ

## అభినందనలు

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

'పెళ్ళి' అన్నది యువతజీవితంలో అతిముఖ్యమైనమలుపు. సరిగ్గా అక్కడే యువకులు సరిఅయిన రీతిలో ఆలోచించలేకపోతున్నారు. 'అసలుమగాడికి పెళ్ళెందుకు' అన్న ప్రశ్న యువకుల్లో వచ్చే బహుఅరుదైన ఆలోచన. దాని ఇతివృత్తంగా తీసుకొని రాసిన 'అమృతహస్తాలు' యువకుల కొరకు ప్రయోజనకరమైన ఓ చర్చ. అశ్లీలసాహిత్యం విరివిగా వస్తున్న రోజుల్లో ఈ నవల పాఠకులకు ఓ చక్కని ఉపశమనం. మధ్యలో పెళ్లి కేవలం ఓదార్పుకోసం అనేజవాబు లభించేలా ఉన్నా 'అనుభవపూర్వకంగా తప్ప ఎవ్వరుకూడా మరే విధంగానూ ఆ ప్రశ్నకు సమాధానం పొందలేరు' అన్న పాయింటుతో చివరివరకూరానిచ్చి సమధానాన్ని రాబట్టారు రచయిత.

ఈ దేశంలో మగాడు ముసలాడయినా ఫర్వాలేదు, పెళ్లవుతుంది "అన్నచురక", "ఎందుకిలా ప్రతిమనిషీ పెళ్ళిదగ్గర అడ్జెస్ట్ అవుతాడు" అన్న వాదన, "ఎందుకో తెలియకనే ఏ ప్రయోజనం ఆశించో అర్థంకాకనే రెండు జీవితాలు ఒకదానితో ఒకటిపెనవేసుకున్నాయి" అన్నవర్ణన రచయిత ప్రతిభను చాటాయి. అర్థం చేస్కుంటే అమ్మకూడా ఓదార్పునిస్తుంది. కాని జనరేషన్ గ్యాప్‌వల్ల అది జరగడం లేదన్నది యదార్థం. ఓ ప్రయోజనకరమైన ఇతివృత్తాన్ని తీస్కొని, చక్కని మలుపులతో వల్లెవాతావరణపు రంగులద్ది, ఎక్కడా పాఠకులకు విసుగు కల్గించకుండా రాసి, చదివించిన రచయిత అభినందనీయుడు.

—ఖదీర్ బాషా, ఎర్రగొండపాలెం

## హృద్యంగా వుంది

(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)

"నిన్ను నిన్నుగా ప్రేమించుటకు, నీకోసమె కన్నీరు నింపుటకు నేనున్నానని నిండుగవలికే, తోడొకరుండిన అదేభాగ్యమూ, అదేస్వర్గమూ" అన్న కవిపలుకుల్ని గుర్తుకు తెచ్చింది. జె.వి.బాబుగారి "అమృతహస్తాలు" పవిత్రమైన వివాహబంధానికి అర్థం తెలియకుండానే యాంత్రికంగా వైవాహిక జీవితాన్ని సాగిస్తున్న చాలామందికి, వారి అంతరాంతరాల్లో కదలాడే ప్రశ్నకు ఈనవల ద్వారా సమాధానం దొరుకుతుందనిపించింది. లాలించే తల్లిగా ఓదార్పునిచ్చే జీవనసహచరిగా, మనసును రంజింపజేసే ప్రియురాలిగా, తప్పుని క్షమించటంలో భూదేవంత సహనశీలిగా అన్ని పాత్రలను సమర్థవంతంగా నిర్వహిస్తుంది స్త్రీ. అటువంటి స్త్రీ సాహచర్యం పొందటం మగవాడి అదృష్టం.

'పెళ్ళి'కి రచయిత చెప్పిన భాష్యం ఎంతో అర్థవంతంగా ఉంది. కాని రచయిత పూర్తిగా మగవారి వైపునుంచే ఆలోచించారనిపించింది. భార్యసాధింపులు, ఎత్తిపొడుపులతో భర్త నలిగిపోతున్నాడని బాధపడ్డ రచయిత, ఆ సాధింపులకి మగవాడి ప్రవర్తనకూడ కొంత కారణం కావచ్చన్న విషయం గమనించలేదు. కాని తోడుకోసం అలమటించే మగవాడి పరిస్థితిని ఎంతోహృద్యంగా చిత్రించారు రచయిత. స్త్రీ ప్రేమ పురుమణ్ణి ఎంత ఉత్తేజితుడ్ని, కార్యోన్ముఖుడ్ని చేస్తుందో తెలియజేసి, స్త్రీని ఉన్నతశిఖరాల్లో నిలపడానికి రచయిత చేసిన ప్రయత్నానికి నా అభినందనలు.

— ఎ. రాధ, కోదాడ

ముఖచిత్రం: వాసు

# చతుర

సంపుటి: 12 ఆగస్టు: 1989 సంచిక: 7

ఆమె అద్భుత సౌందర్యాన్ని చూసి ముచ్చటపడి తన హృదయం అర్పించుకున్నాడా అమాయక హరిశ్చంద్రుడు. కానీ... ఆమె అతని ప్రేమకు పరీక్షంటూ కఠినమైన ఓ షరతు విధించింది. దాన్నో వ్రతంలా ఆచరించి ప్రేమ పరీక్షలో నెగ్గే ప్రయత్నంలో అతనికెన్నో అవమానాలూ, ఆపదలూ ఎదురయ్యాయి. అయినా చలించక తన లక్ష్యం వైపుకు దూసుకుపోయాడతను. విజయం చేరువైన తరుణంలో మానవతా దృక్పథంతో మాటసాయం చేసి వ్రతభంగం చేశాడతను. "సత్యవ్రతం"లో ఉన్న

## హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే?

ఏం జరుగుతుంది? ఆ మంచితనం గుర్తింపుకువచ్చి బండరాయి లాంటి ప్రేయసి గుండెకాయను కరిగించగలుగుతుందా? ఈ సత్య హరిశ్చంద్రుని ప్రేమ ఫలిస్తుందా?

కడుపుబ్బ నవ్విస్తూ ఆద్యంతం ఆసక్తికరంగా చదివించే

కోలపల్లి ఈశ్వరరావు ఎం.ఐ. కిషన్‌ల సంయుక్త రచన

హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే?

ఈనెల చతుర సమర్పిస్తున్న సమగ్ర హాస్యనవల.

"ఆహా... నేనెంత అదృష్టవంతుడిని"

ఆరోజే ఆ రూమ్‌లో అద్దెకు దిగిన హరిశ్చంద్ర పన్నెండోసారి కూడా అలా అనుకున్నాడు.

అప్పటికా అమ్మాయి ఆ కిటికీగుండా అతని కళ్లబడింది పన్నెండుసార్లే కాబట్టి అతనలా కేవలం పన్నెండుసార్లు మాత్రమే అనుకున్నాడు. పదమూడుసార్లుగాని కళ్లబడి వుంటే పదమూడోసారీ అనుకునేవాడే!

హరిశ్చంద్రే కాదు... అతని ప్లేస్‌లో అతని లాంటి ఏ బ్రహ్మచారి వున్నా అంతేనేమో!

ఆ అమ్మాయి గులాబీమొక్కలకి నీళ్ళు పోస్తోంది.

ఈ ప్రపంచంలో ఎన్ని జాతుల గులాబీలైతే వున్నాయో అన్ని జాతుల గులాబీమొక్కలూ ఆ పెరటితోటలో వున్నాయేమో అనిపించింది హరిశ్చంద్రకి.

ఆమెకు గులాబీలంటే ప్రాణం కాబోలు! అంత శ్రద్ధగా అన్నిజాతుల గులాబీలను పెంచుతోందీ అంటే- అంతే అయ్యుండాలి మరి!

ఎంత మురిపెంగా చూస్తోందా పువ్వుల కేసి? ఏముందని వాటిలో? నిజానికామె అందంతో పోలిస్తే వాటి అందమూ ఓ అందమేనా?

తను రచయిత కాదు. తనకి వర్ణించడం రాదు. అయినా తన పిచ్చిగాని... ఎంత కొమ్ములు తిరిగిన రచయితైనా వర్ణించగలడా ఆమె అందాన్ని. ఒకవేళ వర్ణింప సాహసించినా వేలకొద్దీ లక్షలకొద్దీ పేజీలనైతే నింపగలడేమో గాని... ఆమె అందానికి న్యాయం చేకూర్చగలడా? ఇంపాసిబుల్... హైలీ ఇంపాసిబుల్!!

ఈ జగన్మోహిని... ఛఛ... అదేంటి విఠలాచార్య సినిమాలాగ? ఈ అతిలోక సౌందర్యవతి... అదుగో మళ్ళీ అదే పొరపాటు. ఎందుకొచ్చిన గొడవలే - ఈ అందమైన అమ్మాయి పేరు ఏమైవుంటుంది చెప్మా?

సుందరి... వసంత... మంజుల... లావణ్య... కిన్నెర... కోమలి...





తనకు తెలిసిన అందమైన పేర్లన్నిట్నీ మనసులో మననంచేసుకున్నాడు హరిశ్చంద్ర.

ఏమో... మనిషి అందంగా వున్నంత మాత్రాన పేరు కూడా అందంగా వుండి తీరాలని రూలేం లేదుగా?

పుల్లమ్మ... నరసమ్మ... పెంటమ్మ... వెంకుమాంబ... సుబ్బులు...

తనకు తెలిసిన అందవిహీనమైన పేర్లన్నిట్నీ మనసులో మననంచేసుకోబోయి మధ్యలోనే ఆగిపోయాడు హరిశ్చంద్ర.

నో... వీల్లేదు - ఇంత అందమైన అమ్మాయికి అందవిహీనమైన పేరుండటానికి వీల్లేదు... వీల్లేదుగాక వీల్లేదు! ఒకవేళ వున్నా తను వుండనివ్వడు!

ఆ ఆలోచనకి హరిశ్చంద్ర పెదవులపై అప్రయత్నంగా చిరునవ్వు విరిసింది. ఏమిటి తనింత పిచ్చిగా అయిపోతున్నాడు? ఒకవైపు ఆమెకి ఏ ఛండాలపు పేరో వుంటే మాత్రం... తనెవరు దాన్ని మార్చడానికి.

అప్పుడే కిటికీవైపు చూసిన ఆమె- హరిశ్చంద్ర నవ్వడంచూసి పలకరింపుగా నవ్వాడేమోననుకుని... తనూ నవ్వింది- నవ్వీనవ్వనట్లుగా.

హరిశ్చంద్ర గుండె ఝల్లుమంది. మనసు మారుమూలల్లో... ఎక్కడో... ఏదో తెలియని వింత అలజడి.

ఎంత మనోహరమైన నవ్వు!

ఎంత అద్భుతమైన నవ్వు!!

బాప్‌రే బాప్! చిరునగవుకే ఈమె అందం ఉన్నట్టుండి వేయిరెట్లయిపోయింది కదా! అదేగనుక పలువరున తళుక్కుమనేలా ఫకాలున నవ్వితే?!

ఆమె అందమూ ఇంటూ లక్ష! — స్పృహ తప్పుతుందేమో అనిపించి ఆ ఊహకి అంతటితో ఫుల్‌స్టాప్ పెట్టేశాడు హరిశ్చంద్ర.

"హ్యరీ! ఈ భూప్రపంచంలో నిన్ను మించిన అదృష్టవంతుడు లేడురా"

తనను తానే అభినందించుకుంటూ క్షణకాలంపాటు కళ్లు మూసిన హరిశ్చంద్ర తిరిగి కళ్లు తెరిచేసరికి...

ఆమె లేదక్కడ!

గుండెనెవరో గుల్లచేసి వ్యాక్యూమ్‌తో నింపినట్టనిపించి గిజగిజలాడిపోయాడు.

మళ్ళీ ఆమె పెరట్లోకి రాకపోతుందా అన్న ఆశతో ఓ అరగంటసేపు అక్కడే అలాగే నిలబడిపోయాడుగానీ పాపం అతని ఆశ అడియాసే అయింది.

సంధ్య చీకట్లు అలుముకు రావడంతో ఇహ లాభం లేదనుకుని..... కదల్లేక కదల్లేక కదిలాడక్కణ్నుంచి.

కాళ్లు పీకుతున్నట్టనిపించి కాసేపు రిలాక్సవుదామన్న ఉద్దేశంతో మంచంమీద ఒరిగిన హరిశ్చంద్రకి — ఇలా కళ్లుమూశాడో లేదో అలా ప్రత్యక్షమైపోయింది.... మూసిన కళ్లెదుట.... మనోహరంగా నవ్వుతూ ఆ కుసుమకోమల సుందరాంగి!

బ్రహ్మచారులందరికీ వుండే జబ్బే అది! సామాన్యులంతా కళ్లు తెరుచుకుని మాత్రమే చూడగలుగుతారు. కాని వీళ్లు మాత్రం తమ కంటికి నచ్చిన అమ్మాయిని కళ్లు మూసుకుని కూడా చూడగలుగుతారు!

"హాయ్ డార్లింగ్" సుతారంగా చెయ్యూపుతూ విష్‌చేశాడు హరిశ్చంద్ర.

"ఆఁయ్ఁ...." అంటూ ఎర్రగా చూసింది సుందరాంగి.

"అరెరెఁ.... ఎందుకా కోపం? ఇపుడు నేనేవన్నాననీ?" అమాయకంగా ముఖం పెట్టాడు హరిశ్చంద్ర.

సుందరాంగి కళ్లు మంకెనపూలయ్యాయి. "హుఁ.... ఏమన్నారా? అమాయకత్వం నటించబోకండి!"

"అరె... కారణం చెప్పకుండా అలా చిరచిరలాడిపోతే ఎలాగండీ? నా తప్పేంటో చెప్తే సరిదిద్దుకుంటాగా?"

కొంటెగా నవ్వుతున్న హరిశ్చంద్ర కేసి తీక్షణంగా చూసి- "ముఖాలు చూసుకోవడమే తప్పు... మీకు నాకూ ఇంతవరకూ మాట పరిచయమైనా లేదు. అలాంటిది... అప్పుడే నన్నువట్టుకుని డాళింగేంటి-డాళింగ్?" అంది సుందరాంగి.

"అయామ్ సారీ అండీ! దానికి మీకింత కోపమొస్తుందనుకోలేదు. ఎందుకో మిమ్మల్నిలా పిలవాలనిపించింది... మిమ్మల్ని మొదటిసారి చూసినపుడే నాలో ఏదో ఆత్మీయతా భా..."

"టక్ టక్... టక్ టక్..."

ఎవరో తలుపు తట్టడంతో ఊహలు చెదిరి సుందరాంగి రూపం అదృశ్యమైపోగా "ఛీఛీ దరిద్రుడు..." అని గొణుక్కుంటూ మంచంమీంచిలేచాడు హరిశ్చంద్ర.

వచ్చింది ఊతప్పంగాడే అయ్యుంటాడన్న బలీయమైన నమ్మకంతో అతనలా గొణుక్కున్నాడు. కాని తీరాతలుపు తెరిచి చూస్తే అక్కడున్న శాల్తీ ఊతప్పంగాడు కాదు... ఓ ఏడెనిమిదేళ్ల బుడతడు.

"ఎవరు బాబు నువ్వు?"

" ఈఇల్లు మాదేనండీ! నాపేరు కమల్! బంటూ అంటారంతా!" తొణుకూ బెణుకూ లేకుండా సమాధానమిచ్చాడు బుడతడు.

అంటే... ఇల్లుగలవాళ్ల అబ్బాయన్నమాట! సుందరాంగి తమ్ముడన్నమాట!

"లాలీ!" అనుకున్నాడు హరిశ్చంద్ర. కుర్రాడు ముద్దుగా ఉన్నాడన్న ఉద్దేశంతో కాదు. ఫ్యూచర్‌లో ఎందుకైనా ఉపయోగపడతాడన్న ముందుచూపుతో.

అందమైన అమ్మాయిల తమ్ముళ్లను మంచి చేసుకోవడంలో గల లాభాలేంటో ఎన్నెన్నో కథల్లో అప్పటికే చదివి వున్నందున... "రా బాబు! రా!" అంటూ ఆప్యాయంగా ఆహ్వానిస్తూ పక్కకి తొలగి బుడతడికి దారిచ్చాడు.

బుడతడు లోపలి కొచ్చాక వాడికి మంచంచూపిస్తూ "కూచోబాబూ" అన్నాడు.

"వద్దులెండి..." అదోలా తలెగరేసి... "మా అక్కయ్య మీ దగ్గరేమైనా పుస్తకాలుంటే అడిగ పట్రమ్మంది..." అంటూ తను వచ్చిన విషయం చెప్పాడు బుడతడు.

"అక్కయ్యంటే ఆ కుసుమకోమల సుందరాంగేనా?"

ఆత్రంగా అడిగేసి చప్పున నాలుక కరుచుకున్నాడు హరిశ్చంద్ర.

"ఏ కుసుమకోమల సుందరాంగి? అలాంటి పేరుగల వాళ్లు మాయింట్లో ఎవరూ లేరే?"

బంటూ మాటలు చాలా స్పష్టంగా ఉన్నాయ్. వాడి చూపుల్లో ఏదో అనుమానం!

హరిశ్చంద్ర కంగారు పడ్డాడు. "అబ్బే ఏంలేదుబాబు... ఏంలేదు... నాకొక్కోసారి మైండ్ సరిగ్గా పన్జేయదు. ఏంటేంటో పిచ్చి పిచ్చిగా వాగేస్తుంటాను..." అనేశాడా కంగార్లో ఏంచెప్పాలో తోచక.

"పాపం!" జాలిగా ముఖంపెట్టాడు బంటూ.

"పాపమా" ఆశ్చర్యంగా చూశాడు హరిశ్చంద్ర.

"అవునండీ! మైండ్ పనిచేయకపోవటం అంటే పిచ్చి అనే కదా అర్థం? కాని మీరు చూడ్డానికి పిచ్చోడిలా లేరు సుమండీ!" చేతులు గమ్మత్తుగా తిప్పాడు బంటూ.

హరిశ్చంద్రకి ఏడుపొచ్చినంత పనైంది! ఏదో పసివాడు తెలియక అన్నదాన్ని పట్టుకుని ఏడ్చేసేటంత దౌర్బల్యుడు కాడతను. అయినా సరే అతడికి ఏడుపొచ్చినంత పనైంది! దానికి కారణం-

ఎక్కడ ఈ కుర్రకుంక వెళ్లి వాళ్లక్కయ్యతో- "అక్కా! ఇకనుంచి నన్నా పిచ్చోడి గదికి పుస్తకాల కోసం పంపకే" అంటాడేమోనన్న భయం!

ఫస్ట్ ఇంప్రెషన్ ఈజ్‌ది బెస్ట్ ఇంప్రెషన్ అంటారు. అట్లాంటిది... ఆ కుసుమ కోమల సుందరాంగి దృష్టిలో మొదటే తనొక పిచ్చివాడిలా ముద్రపడిపోతే ఇంకేమైనా వుందా?

పొద్దుట్నుంచి ఎన్నెన్ని ఆశలు పెంచుకున్నాడు తను?

కొన్నివేల సెకండ్ల సుదీర్ఘ కాలం నుండి ఎంతగా ఆరాధిస్తున్నాడామెను?

అట్లాంటిది... ఆమె దృష్టిలో... తనొక పిచ్చివాడిగా...

ఆ ఊహనే భరించలేకపోయాడు హరిశ్చంద్ర.

"నో... నో... నో..." అప్రయత్నంగా అరిచేశాడు.

తన రెండుకళ్ళనీ విచిత్రంగా మూసి... మళ్ళీ విచిత్రంగా తెరిచాడు బంటూ. "మీరు పిచ్చి ఎక్కువగా వచ్చినప్పుడు ఇలా అరుస్తుంటారా అండీ?!"

గోడకేసి తలబద్దలు కొట్టుకొని ప్రాణాలు విడిచేయాలన్నంత ఆవేశమూ, ఆవేదనా కలిగాయి హరిశ్చంద్రలో.

లాభంలేదు... వీడిలోంచి ఈ అనుమానాన్ని మొగ్గగా వున్నప్పుడే తుంచేయకపోతే... బాప్‌రే బాప్... కొంపలంటుకుపోతాయ్! చూడ్డానికి బుడతడేగాని మహాగట్టిపిండంలా వున్నాడు వీడు. లేకపోతే ఏంటా ముదురు మాటలు?

"అబ్బే అదేంలేదుబంటూ! నువ్ కేవలం అపార్థంచేసుకుంటున్నావంతే! అసల్నాకు పిచ్చి అని ఎవరు చెప్పారునీకు? ఏదో మాటవరసకి మైండ్ పన్చేయదని అన్నానంతే! జస్ట్ మాట వరసకి... కేవలం మాటవరసకి... ఆఁ... అంతే! జస్ట్ అంతే!" లాలనగా వాడి శిరసు నిమురుతూ అన్నాడు హరిశ్చంద్ర.

అలాగా అన్నట్టు తల పంకించాడు బంటూ. "పోన్లెండైతే పాపం!"

వాడి భావమేంటో సరిగ్గా అర్థంకాలేదు హరిశ్చంద్రకి.

"అయితే నాకు పిచ్చిలేదని నువ్వొప్పుకున్నట్టే కదూ?" ఆత్రంగా అడిగాడు.

వాడు "ఓఁ" అంటూ నిలువుగానూ అడ్డంగానూ కూడా తల ఊపడంతో కళ్ళనీళ్ళ పర్యంతమైంది హరిశ్చంద్రకి. "సరిగ్గా చెప్పు బంటూ! ప్లీజ్... సరిగ్గా చెప్పు... ఒప్పుకున్నట్టేనా కాదా?" అంటూ ఈసారి మరింత లాలనగా వాడి బుగ్గలు పుణికాడు.

"ఒప్పుకోక పోతే మీదపడి రక్కుతారా అండీ?" బితుకు బితుగ్గా చూశాడు బంటూ.

లాభంలేదు... వ్యవహారం ముదిరిపోయేలా వుంది!

ఇంక ఆ టాపిక్ ఛేంజ్ చేసేయడం మేలనిపించింది హరిశ్చంద్రకి. దాంతో- "ఏంటిబాబూ అడిగావ్? పుస్తకాలా? చూపిస్తానుండు... అలా కూర్చో..." అన్నాడు హడావుడి నభినయిస్తూ.

"వద్దులెండి... నిలబడే వుంటా..."

బతుకుజీవుడా అనుకున్నాడు హరిశ్చంద్ర వాడు మళ్ళీ తన పిచ్చి ప్రసక్తి తేనందుకు.

అల్మారాలో ఉన్న పాత వీక్లీలూ అవీ కలబెడుతూ అడిగాడు బంటూని-

"మీ అక్కయ్యకి ఎలాంటి పుస్తకాలంటే ఇష్టం?"

"ఏమో నాకు తెలీదు. పుస్తకాలు తెమ్మందంతే!"

"మీ అక్కయ్యకి పుస్తకాలు చదవడం అంటే బాగా ఇష్టమా?"

"ఏమో నాకు తెలీదు... పుస్తకాలు తెమ్మందంతే!"

అక్షరం పొల్లుపోకుండా మళ్ళీ అదే సమాధానం చెప్పి చిరాగ్గా చూశాడు బంటూ.

"ఓరి నీచిరాకు తగలెయ్యా!" అనుకున్నాడు హరిశ్చంద్ర. కాని అదే మాటను పైకనలేక పోయాడు. ఎంతైనా వాడు కుసుమకోమల సుందరాంగికి తమ్ముడాయె!

ఆమె టేస్టేంటో నెమ్మదిమీద తెలుసుకోవచ్చు... ప్రస్తుతానికి ఏవో రెండు వీక్లీలు ఇచ్చి పంపిస్తే సరి! అదీగాక ఈ కుర్రకుంక చాలా ప్రమాదభరితమైన వ్యక్తిలా వున్నాడు. వీణ్ణింకా సేపు ఇక్కడే వుండనిస్తే వీడు మళ్ళీ తన పిచ్చి ప్రసక్తి తెచ్చినా తేవచ్చు... ఈ విధంగా ఆలోచించి... చేతికందిన ఏవో రెండు వీక్లీలు తీసి బంటూ చేతికిచ్చాడు హరిశ్చంద్ర.

వాటిని అటూ యిటూ తిప్పి చూసి... "ఇంక నేను వెళ్ళొచ్చా?" అన్నట్టు చూశాడు బంటూ.

"అన్నట్టు నువ్వు మీ అక్కయ్యపేరు చెప్పనే లేదు..."

"మీరడిగితే కదా చెప్పడానికి?"

వయసుకి మించిన తెలివితేటల్రా నీవి అనుకున్నాడు హరిశ్చంద్ర- వాడలా ఎదురుప్రశ్నవేసేసరికి.

"పోనీ ఇప్పుడడుగుతున్నాగా? ప్లీజ్... మీ అక్కయ్య పేరేంటో చెప్పవూ... ప్లీజ్..."

"దానికిలా అడుక్కునేవాడిలా... అయ్యా బాబూ అన్నట్టు అంతిదిగా అడగటందేనికంతి? మా అక్కయ్య పేరు..."

చెవులు రిక్కించాడు హరిశ్చంద్ర.

"...గూనమ్మ" పూర్తిచేశాడు బంటూ.

నెత్తిమీద చలిపిడుగు పడినట్టు బిర్రబిగుసుకుపోయాడు హరిశ్చంద్ర. ఒళ్ళంతా తేళ్ళూ జెర్రులూ పాకుతున్నట్టూ... చందమామ కథల్లోని తోకదయ్యాలో అరడజను తన చుట్టూ మూగి 'హిహీహీ' అనరుస్తున్నట్టు... పరమ చెత్త సినిమాని పన్నెండోసారి చూస్తున్నట్టూ... ఏవేవో వికారమైన ఫీలింగ్స్...

గూ... న... మ్మ...

ఛీ...

ఎంత ఛండాలపు పేరు?

అంత అందమైన అమ్మాయికి ఇంత వికారమైన పేరా? వాళ్ళ అమ్మానాన్నలకి ఎలా మనసొప్పిందో ఇంత ఛండాలమైన పేరుపెట్టడానికి?! బిడ్డల్ని కనగానే సరిపోయిందా? కామన్సెన్స్ ఉండక్కర్లేదా? అంత అందమైన అమ్మాయికి ఇంత మొరటుపేరా పెట్టుకుంటారు?

ఛీఛీ... ఏం మనుమలో ఏంపాడో!!

అయినా మనుమల్ని అనుకుని ఏంలాభం?!- ఆ భగవంతుణ్ణనుకోవాలి. మనుమల్ని సృష్టించగానే సరిపోయిందా? అందరికీ మెదళ్ళు కూడా పెట్టాలన్న జ్ఞానం వుండద్దూ?

హుఁ... ఏం భగవంతుడో ఏంపాడో!!

వ్యాకుల మనస్కుడైపోయిన హరిశ్చంద్ర మనసు కుదుటపడటం కోసం మాడు మీద గట్టిగా చరుచుకున్నాడు.

మాడు మీద చరుచుకుంటే మనసు కుదుటపడ్తుందని పసివాళ్ళకేం తెల్సు?

ఆ చేష్టని విభ్రాంతుడై చూసిన బంటూ జాలిగా అడిగాడు- "ఏంటండీ? ఏం... మళ్ళీ వచ్చేసిందా పిచ్చి?"

"నరుకుతానొరేయ్!"

నాలుక చివరిదాకా వచ్చిన పొలికేకని బలవంతాన్నే గొంతులోకి దిగమింగుకున్నాడు హరిశ్చంద్ర.

"నీకిదితగదు బాబూ! నాకు పిచ్చీలేదు పాడూలేదని ఇందాకోసారి చెప్పేగా...? ఇంకెప్పుడూ అలా అనకు"
అన్నాడు దీనంగా చూస్తూ.

"అవునవును... చెప్పేరు చెప్పేరు... కాని




మీరు నెత్తిమీద బాదుకుంటుంటే నేనా సంగతే మర్చిపోయాను''

ఈ పిచ్చిమాలోకంతో ఇంక నాకెందుకులే అనుకున్నాడో ఏమో... ఇంకేం మాట్లాడకుండా వెళ్ళిపోయాడు బంటూ.

హరిశ్చంద్ర తలుపు మూసొచ్చి మళ్ళీ మంచం మీద ఒరిగిపోయాడు.

గూ... న... మ్మ...

ఆ సుందరాంగి పేరు గూనమ్మ అనుకుంటుంటే గుండెల్లో గునపం గుచ్చుకుంటున్నట్టుగా అనిపించి విలవిల్లాడిపోయాడు హరిశ్చంద్ర.

కొన్నిపేర్లు వుండడానికి వికారంగావున్నా షార్ట్‌కట్‌లో అందంగా మలచి పిలుచుకోవడానికి వీలుగా వుంటాయ్. కాని ఇది అలాంటిది కూడా కాదే?!

గూనా - ఛఛ!

గూనీ - ఛఛఛ!

గున్నా - యాక్‌థూ.

బ్రహ్మదేవుడు కూడా కుదించి అందంగా మలచలేడా పేర్ని! ... ఛీ! అంతచండాలపు పేరు!

ఆమె కిలాంటి పేరుపెట్టినందుకు వాళ్ళఅమ్మానాన్నల్ని చండాలమ్మా, చండాలయ్యా అనాలసలు! అవునవును- అని తీరాల్సిందే! అప్పుడుగాని కుదరదు వాళ్ళతిక్క.

ఈ కుర్రకుంక వెళ్ళి వాళ్ళఅక్కయ్యతో ఏంచెబుతున్నాడో ఏమో?! తన పిచ్చి సంగతి చెప్పేసుంటాడేమో!

తనకి పిచ్చేంటి అసహ్యంగా

తనకసలు పిచ్చెక్కడుంది?!

ఇంకా ఆలోచిస్తే తనకి నిజంగానే పిచ్చెక్కుతుందేమో అనిపించి... మనసును బలవంతాన డైవర్ట్ చేసుకున్నాడు హరిశ్చంద్ర.

★ ★ ★

''ఏంట్రా ఇంత పొద్దున్నే ఊడిపడ్డావ్?''

బ్రష్ మీద పేస్ట్ వేసుకుంటున్న వామన్రావ్ హరిశ్చంద్రవేపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

''నీకు థాంక్స్ చెప్పిపోదామని వచ్చాన్రా...''

''థాంక్సా? థాంక్స్ దేనికీ?''

''దేనికేమిట్రా?... బ్రహ్మాండమైన రూమ్ చూపించావుగా... నీమేలు జన్మజన్మలకీ మర్చిపోలేను...''

హరిశ్చంద్ర నిజంగా అంటున్నాడో లేక వ్యంగ్యంగా అంటున్నాడో అర్థంకాలేదు వామన్రావ్‌కి.

''ఏంట్రా? ఏదన్నా ప్రోబ్లెమా?!'' కించిత్ కంగారుగా చూశాడు.

''చెముడా?''

''లేకపోతే ఏంట్రా? రూమ్ బ్రహ్మాండంగా వుందిరా బాబూ అంటుంటే... థాంక్స్ చెప్పడానికొచ్చాన్రా నాయనా అంటుంటే ... ప్రాబ్లెమా అంటావేం? భూతల స్వర్గంలాంటి ఆ రూమ్‌లో నన్ను చేర్పించినందుకు ... ఓహ్... ఇంక మాట్లాడలేనురా! నా గుండె కృతజ్ఞతతో బరువెక్కిపోతోంది...'' నిజంగానే గుండె బరువెక్కిపోయినవాడిలా ముందు కొరిగిపోతూ అన్నాడు హరిశ్చంద్ర.

అతన్ని క్రిందనుంచి పైదాకా ఓసారి చూసి... మళ్ళీ పైనుంచి క్రిందదాకా ఇంకోసారి చూశాడు వామన్రావ్.

తను హరిశ్చంద్రకి ఆ రూమ్ చూపించినపుడు- 'ఛఛ... ఇదేం రూమ్‌రా? పిచ్చుకగూడులా మరీఇరుగ్గా ఉంది! ఎంత మొక్కిలీసోళ్ళయితే మాత్రం? మరీ ఇంత చిన్నగదిలో ఎలా వుండటం?'' అంటూ అయిష్టంగా మాట్లాడాడు. ''ఈ ఊళ్ళో ఈపాటి రూమ్ దొరకడం- అందులో నీలాంటి బ్రహ్మచారి వెధవకి- అదృష్టం అనే అనుకోవాలి. ఇంకేం మాట్లాడకుండా అడ్వాన్సిచ్చి దిగిపో నోర్మూసుకుని...'' అని తను గదమాయించినమీదటే అందుకంగీకరించాడు. అలాంటిది తెల్లారేసరికల్లా తుపాకీ గుండులా దూసుకొచ్చి రూమ్ బ్రహ్మాండంగా ఉందీ అంటున్నాడంటే- ఎలా అర్థంచేసుకోవాలి?

వాడికి పిచ్చైనా ఎక్కుండాలి... లేదా తాగైనా వచ్చుండాలి.

''ఏంట్రా? నీకు పిచ్చిగాని ఎక్కిందా... లేక పొద్దున్నే మందుగాని...''

వామన్రావ్‌ని మాటపూర్తిచేయనివ్వలేదు హరిశ్చంద్ర. "హుఁ... పిచ్చి పిచ్చి... ప్రతివాడికీ ఇదొక వేళాకోళం ఐపోయింది నన్ను చూస్తుంటే..." అంటూ హుంకరించాడు... 'పిచ్చి' అన్న పదం మనసులో ముల్లులా గుచ్చుకోగా.

"అరెఁ అదేంట్రా? నేనేదో మాటవరసకంటే అంతగా ఇరిటేట్ అయిపోతా వేం? అందరికీ అంటున్నావ్... అంటే నేనుగాక ఇంకా ఎవరన్నా అన్నారేంటి నీకి పిచ్చని?"

"స్టాప్ నాన్‌సెన్స్ ..." మళ్ళీ హుంకరించాడు హరిశ్చంద్ర- 'పిచ్చి' అన్న పదం మళ్ళీ మనసులో ముల్లులా గుచ్చుకోగా.

పిచ్చి అన్న పదం మనసులో ముల్లులా గుచ్చుకోవడంవల్లనే అతనలా అరుస్తున్నాడని తెలీని వామన్రావ్ "ఏంట్రా ఆ పిచ్చికేకలు?" అనేశాడు.

"ఎవరికిరా పిచ్చి? నీకు పిచ్చి... మీ అమ్మకి పిచ్చి... మీ నాన్నకి పిచ్చి... మీ తాతకి పిచ్చి" అంటూ గంగవెర్రులెత్తిపోయాడు హరిశ్చంద్ర.

హరిశ్చంద్రని బాల్యంనుండీ ఎరిగున్నవాడు వామన్రావ్. కేవలం ఎరిగుండటం మాత్రమేకాదు... ఒకటో క్లాసు నుండి డిగ్రీ కంప్లీటయ్యేదాకా కలిసే చదువుకున్నారు. ఏనాడూ ఒకే కంచంలో తినకపోయినప్పటికీ ఒకే మంచంలో మాత్రం అనేకసార్లు పడుకున్నారు. వాళ్ళది అంతంత మాత్రపుస్నేహమేంకాదు. అలాగని ప్రాణస్నేహితులంటే అది అతిశయోక్తి అవుతుందేమోగాని... మొత్తానికి మంచి స్నేహితులు.

తనకి తెలిసి హరిశ్చంద్ర ఏనాడూ ఇలా పిచ్చిపిచ్చిగా ప్రవర్తించి వుండలేదు. ఏమైందబ్బా ఇవ్వాళ వీడికి?... నిన్న బాగోలేదన్న రూమ్‌ని ఇవ్వాళ భూతలస్వర్గమంటున్నాడు. ఊరికే అర్థంపర్థంలేకుండా శివాలెత్తుతున్నాడు..

కొంపదీసి ఆ రూమ్‌లో ఏగాలో ఉండి వీడిగ్గాని సోకలేదు గదా?

ఆమాటే అడిగాడు వామన్రావ్— "ఎందుకురా ఉత్తపుణ్యానికలా ఇదైపోతున్నావ్? కొంపదీసి ఏ గాలైనా సోకిందా ఏంటి?"

"యు మీన్?" ఎర్రగా చూశాడు హరిశ్చంద్ర.

"అయిమీన్ దయ్యం!"

"ఇందాక పిచ్చన్నావ్... ఇపుడు దయ్యమంటున్నావ్... ఏం— ఎలా కనబడుతున్నానేంటి నీ కళ్ళకి? నాగ్గాని చిరాకెత్తిందో..."

"అబ్బ... తగ్గరా బాబూ!" హరిశ్చంద్రకి అడ్డుతగుల్తూ అనునయంగా అన్నాడు వామన్రావ్! "అది కాదురా! నిన్నేమో ఆ రూమ్ బాగోలేదంటివాయె! ఇప్పుడేమో ఏకంగా భూతలస్వర్గమే అంటున్నావాయె! దాంతో నేను కన్‌ఫ్యూజైపోయి ఏదో మాటవరసకి పిచ్చెక్కిందా అంటే దానికింత హంగామా చేస్తున్నావాయె! నా ప్లేస్‌లో నువ్వే ఉంటే నువ్వు మాత్రం కన్‌ఫ్యూజవ్వవా... కంగారు పడవా?..."

వామన్రావ్ దీనంగా ముఖంపెట్టి అలా అడుగుతుంటే "అవును సుమా! నిజమే సుమా!" అనిపించి... తన ప్రవర్తన తనకే సిగ్గుగా తోచింది హరిశ్చంద్రకి.

"సారీరా" అనేశాడు కూల్‌డౌన్ అయిపోతూ.

"ఇట్సాల్‌రైట్! ఊఁ... అయితే నీకా రూమ్ బాగా నచ్చిందంటావ్?"

"అవున్రా..."

"ఏంటన్నయ్యగారూ- ఏదో అరుచుకుంటున్నట్టున్నారు?" అంది చేతిలో కాఫీ కప్పుల్తో అప్పుడే అక్కడికొచ్చిన వామన్రావ్ భార్య గోమతి హరిశ్చంద్ర నుద్దేశించి.

"అబ్బే... ఏం లేదమ్మా..." అనేశాడు హరిశ్చంద్ర.

"అరెఁ... మీరింకా మొహం కడుక్కోనేలేదా?" అంది భర్త నుద్దేశించి.

"ఏదీ... పేస్టేసుకుంటుంటే వీడొచ్చాడు. మాటల్లోపడి..."

"సర్లే... ఆ పాచిమొహంతో ఎంతసేపుంటారు? ముందెళ్ళి మొహం కడుక్కుని రండి!" కమాండింగ్‌గా అంది గోమతి.

"అఁ అఁ... ఈలోగా నువ్ మాట్లాడుతూండు వీడితో" అని బాత్‌రూమ్‌వేపు దారితీశాడు వామన్రావ్.

"ఇంత పొద్దున్నే వచ్చారేం?" గోమతి అడి




గింది.

"నిన్నటిదాకా నీ చేతి కాఫీ తాగుతున్నా నేమో... ఇవ్వాళ హొటల్లో తాగబోయేసరికి వాంతొచ్చినంత పనైందమ్మా! అందుకే... ఇదు గో... ఈ కాఫీ కోసమే వచ్చాను కాకిలా ఎగురు కుంటూ" కాఫీ సిప్‌చేస్తూనే బదులిచ్చాడు హరిశ్చంద్ర.

హరిశ్చంద్ర మాటల్లో తన చేతి కాఫీని గురించి అంతర్గతంగా వున్న పొగడ్తకి మన సులో సంతోషిస్తూ... "భలేవారే అన్నయ్యగా రూ" అనేసింది గోమతి.

"ఒట్టమ్మా.. నిజం!" అన్నాడు హరిశ్చంద్ర.

"అయితే ఈ రెండో కప్పుకూడా మీరే తాగే యండి- ఆయనకి వేరే తెస్తాన్లే."

"అబ్బే... వద్దమ్మా"

"సరే... మీ ఇష్టం" అంటూ హరిశ్చంద్ర అందించిన ఖాళీ కప్పును తీసుకుని అక్క ణ్ణించి వెళ్లిపోయింది గోమతి.

ఓ పదినిముషాల తర్వాత ఏకంగా స్నా నంకూడా ముగించి వచ్చాడు వామన్రావ్- "ఊఁ... ఇప్పుడు చెప్పరా" అంటూ.

"ఏముంది చెప్పడానికి?"

"అదే... నీ భూతలస్వర్గం గురించి..."

"అదా... చెప్తా చెప్తా... కానీ ఇప్పుడు కాదు- అదో పరమరహస్యం. ఎప్పుడుపడ్తే అప్పుడు, ఎక్కడ పడ్తే అక్కడ చెప్పేదికాదు!"

"నీ మొహం!" నవ్వేశాడు వామన్రావ్.

అంతలో అక్కడికి కాఫీ కప్పుల్తో మళ్ళీ వచ్చింది గోమతి.

"అరెఁ... నేనిప్పుడే కదమ్మా తాగేను. మళ్ళీ ఎందుకు నాకు?" తనకీ ఓ కప్పందిస్తుంటే తిరస్కరించబోయాడు హరిశ్చంద్ర.

"ఫర్వాలేదులే తీసుకోరా..." అన్నాడు వామన్రావ్.

"సర్లే కానియ్... అమృతసేవనం ఎన్నిసార్లు చేస్తేమాత్రం తప్పేముందిలే..."అంటూ కప్పందుకున్నాడు హరిశ్చంద్ర.

"హూఁ... నువ్వుకనక అనాలి ఇది అమృత మని" వ్యంగ్యంగా అన్నాడు వామన్రావ్.

అది తెచ్చుకోలు వ్యంగ్యమని తెలుస్తూనే ఉన్నా గోమతిని ప్లీజ్ చేయడానికి సీరియస్ గానే అన్నాడు హరిశ్చంద్ర- "దున్నపోతుకేం తెలుసు తోడిరాగం అన్నట్టు... అమృతం రుచి అర్థమైనవాళ్లకీ ఎలా తెలుస్తుందిలే! ఏం పాపం...ఇది అమృతంగాక కషాయమా?"

ముసిముసిగా నవ్వింది గోమతి ఆ మాటల కి.

"ఈ మతిలేని వెధవేదో వాగినంత మాత్రాన తమరేం నవ్వేసుకోనక్కరలేదు... మొహం చూ డు మొహం... ఇంక చాల్లేగాని దయచెయ్ లోపలికి..." భార్యకేసి కోపంగా చూశాడు వామ న్రావ్. అదీ ఉత్తుత్తిదేనని తెలుస్తూనేవుంది.

"ఏం– నీమొహం కన్నానా? హూఁ... మా చెల్లాయికి వంక పెట్టేవాడివయ్యావన్నమాట? అసలు నీ రాచిప్పమొహానికి ఏ తాటకిలాంటి పెళ్ళామో దొరికుండాల్సింది! కానీ నీఅదృష్టం బావుండబట్టి మా చెల్లాయిలాంటి..."

"స్టాపిట్..." అరచినట్టుగా అన్నాడు వామ న్రావ్.

"ఏం... ఏమొచ్చింది?"

"అఫ్‌కోర్స్... ఇంకా ఏమీరాలా! కాని నువ్వి లాగే పొగుడుతూ కూర్చుంటే అర్జంటుగా ఆవి డగారికి కొమ్ములొచ్చేస్తాయ్! కొమ్ములొచ్చిన ఆడాళ్ళేంబావుంటారు చెప్పు? ఆడ యమ కింకరుల్లా అసహ్యంగా వుండరూ?"

ఉబికి రాబోయిన నవ్వునాపుకుంటూ మూతి మూడు వంకర్లు తిప్పి లోనికెళ్ళిపోయింది గోమతి.

కాఫీలయ్యాక అలా ఫ్రంట్ రూమ్‌లోకెళ్ళి కూర్చున్నారు మిత్రులిద్దరూ.

"ఊఁ... ఎలా ఉంది ఈ ఉద్యోగం?" అన్నా డు వామన్రావ్ సంభాషణ ప్రారంభిస్తూ.

"ఏదీ...ఇప్పుడిప్పుడే అలవాటు పడ్తున్నా! వర్క్ ఈజీగానే ఉందిలే! ప్రస్తుతానికి నా సీనియర్స్ గైడెన్స్ ఇస్తున్నారు. ఇంకో వారం పది రోజులకి అన్నీ నా అంతట నేనే మేనేజ్ చేసుకోగలుగుతాను..."

"అంతేలే అంతేలే... సాధారణంగా బ్యాంక్ ఉద్యోగాలన్నీ ఈజీగానే ఉంటాయ్! మడతపే చీలూ, మతలబులూ ఉండటాన్కి అదేవఁన్నా




మండలాఫీసా?'' అంటూ నవ్వేసి—''ఊఁ... నీ రూమ్ సంగతి చెప్తూ ఆపేశావు...'' అన్నాడు వామన్రావ్.

''చెప్పాగా అది పరమ రహస్యమని...'' గమ్మత్తుగా కళ్ళెగరేశాడు హరిశ్చంద్ర.

''నీ బొందరహస్యం! నీ వ్యవహారం చూస్తుంటే నాకేదో అనుమానంగా వుంది. కొంప దీసి...''

''ఊఁ.. ఆగావేం- కక్కు...'' నవ్వుతూ ముందుకొరిగాడు హరిశ్చంద్ర.

''ఎంతైనా బ్రహ్మచారి వెధవ్వికదా... మీ ఇంటిగలాయన కూతుర్నిచూసి మనసుగానీ పారేసుకున్నావేమోనని నాకనుమానంగా వుంది'' కక్కేశాడు వామన్రావ్ తన మనసులోని డవుట్ని.

మిత్రుని తెలివితేటలకి అబ్బురపడిపోతూ గుడ్లుతేలేశాడు హరిశ్చంద్ర.

''ఏంటా వెర్రిచూపు? నిజమేనా ఏంటి కొంపదీసి?''

అవును-కాదు లకు మధ్యస్తంగా తలవూపి ఒకింత సిగ్గుగా తలదించుకున్నాడు హరిశ్చంద్ర.

తన డవుటు నిజమైపోయిందని గ్రహించేయడానికి ఒకటింబాతిక సెకండ్లకన్నా ఎక్కువ సేపు పట్టలేదు వామన్రావ్‌కి.

''హూఁ...నువ్వేదో బుద్ధిమంతుడివన్న నమ్మకంతో రికమెండ్ చేసి రూమిప్పిస్తే, అప్పుడే మొదలెట్టేశావన్నమాట వెధవ్వేషాలు నీకేం?... నువ్ బాగానే వుంటావ్. రేపు నన్నంటాడాయన...'' అన్నాడు కోపంగా. కోపంగా అంటే మరింత కోపంగా కాదు- కాస్తే కోపంగా.

ఎంతైనా అతనూ హరిశ్చంద్ర ఈడువాడే నాయె! ఇప్పుడంటే పెళ్లయిందిగానీ- పెళ్ళివ్వక క్రితం- అంటే జస్ట్ ఒన్నెండాఫ్ ఇయర్స్ బాక్... తనూ అలాంటి వెధవ్వేషాలు ఎన్నెన్నో వేసినవాడేనాయె! గాఢంగా ప్రేమించేయడాలూ, భంగపడడాలూ ఎక్స్ట్రా లేకపోయినా, 'కలర్' కనిపించిందంటే చాలు గంగవెర్రులెత్తిపోయేవాళ్ళు ఇద్దరికిద్దరూను. అప్పట్లో వాళ్ళిద్దరి ఉమ్మడి ముఖ్యమైన హాబీ అమ్మాయిలకి బీటు వెయ్యడమేగదా?!

''అది కాదురా ఆ... ఆ అమ్మాయి చాలా అందంగా వుంటేనూ...'' నసిగాడు హరిశ్చంద్ర.

''అందంగా వుందికదాని అమాంతం ప్రేమించేయడమేనా? మంచీచెడ్డా ఆలోచించే పన్లేదా? ఆ ఫామిలీ గురించి ఇంతో అంతో తెలుసున్నవాణ్ణి కదా- ఏం... నా సలహా తీసుకోవాల్సిన అవసరం నీక్కనిపించలేదా?''

''సారీ రా! అంత వ్యవధి లేకపోయింది. లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అంటారు చూడూ... అట్లాంటిదన్నమాట! ఆమెనిలా చూడ్డం... నా మనసలా పారేసుకోవడం... రెండూ వెంట వెంటనే జరిగిపోయాయ్...''

మొదట్నుంచీ వాళ్ల ధోరణే అంత. ఇద్దరూ కలిశారంటే సీరియస్‌గా మాట్లాడుకునేది తక్కువ. తమాషాగా మాట్లాడుకునేది ఎక్కువ!

''అయితే మనసులేనివాడివైపోయావన్నమాట! అదేలే మనసు పారేసుకున్నానన్నావుగా- ఇంక నేను చేసేదేముంది... అఘోరించు''

వామన్రావ్‌కేసి కాస్త సందేహంగా చూశాడు హరిశ్చంద్ర. ''అదేంటిలా అంటున్నావ్... ఆ అమ్మాయికేదైనా లోపమా?''

''ఏం... ఏదన్నా లోపముందని తెలిస్తే పారేసుకున్న మనసును పోయి వెదికి తెచ్చేసుకుంటావా మళ్ళీ?''

''అబ్బ... చంపకురా! మొన్నటిదాకా నువ్ దుండుముక్కలా వుండేవాడివని నిన్ను ఊతప్పంగా వెక్కిరించేవాణ్ణి. నువ్ వుడుక్కుచచ్చేవాడివి! అవునా?... ఇప్పుడూ నువ్వలాగే వున్నావు. కానీ నేన్నిన్ను ఊతప్పంగాడని అంటున్నానా- అనట్లేదు. ఎందుకని? మా చెల్లాయి ముందు నీ పరువుతీయడం ఇష్టంలేక. హూఁ... స్నేహం అంటే అలా వుండాల్రా... అంతేగాని ప్రాణమిత్రుణ్ణి ఇలా బోడి సస్పెన్స్‌లో ముంచి చంపడంకాదు'' నిష్ఠూరంగా అన్నాడు హరిశ్చంద్ర.

''చాల్లే నోర్మూసుకో...మన స్నేహం సంగతి మనసు పారేసుకోవడానికి ముందే ఎందుకు గుర్తురాలేదు నీకు? టింగురంగా అంటూ మనసు పారేస్కొచ్చి ఇప్పుడా వెంపర్లాడిపోవడం?''

"సారీరా అని ఇందాకోసారి చెప్పాగా? ఒకటికి వందసార్లు చెప్పించుకుంటే తప్ప తృప్తిగా వుండదానీకు?" సరే... మరోసారి చెబుతున్నాను. నిన్ను సంప్రదించకుండా మనసు పారేసుకోవడం తప్పే! అయామ్ వెరీవెరీ సారీ... ఇంక తగలడు..." ఠపీమని చప్పుడయ్యేలా చేతులు జోడించాడు హరిశ్చంద్ర.

"అద్గదీ- అలారా దారికి! ఎర్రగా బుర్రగా వుందన్జెప్పి ముందూవెనక ఆలోచించకుండా నువ్ మనసు పారేసుకున్నావు చూడూ.. ఆ అమ్మాయికి..."

"ఊఁ... ఆ అమ్మాయికి?"

"ఏ లోపమూ లేదు. లక్షణమైన పిల్ల" నవ్వుతూ పూర్తిచేశాడు వామన్రావ్.

అంతే!

హరిశ్చంద్ర గుండెలోని వ్యధంతా మాయమైపోయి ఆనందం మయూరమై పురివిప్పింది. "ఒరి కుళ్ళుబోతు వెధవా! ఆమె లక్షణమైన పిల్ల అని తెలిసుండి కూడా ఉత్తపుణ్యానికి నన్ను బెదిరించిపారేశావు కదరా?!" అంటూ మనసారా నవ్వేశాడు.

"ఆగాగు..." అన్నాడు వామన్రావ్.

"ఏం?"

"తొందరపడి అలా మనసారా నవ్వేయకు. ఆ అమ్మాయి మంచిదే. కాని వాళ్ళ తండ్రున్నాడు చూశావ్, అదే ఆ రాఘవయ్య- పరమ పీనాసిమనిషని చెప్పుకుంటారు. డబ్బుకోసం అడ్డమైనగడ్డీ కరుస్తాడట. డబ్బే అతని ప్రాణమట! డబ్బే అతని లోకమట! డబ్బే అతని సమస్తమూనట! నువ్విలా ప్రేమ, దోమ అంటూ మొదలెట్టేవనుకో... అది ఆయనకి తెలిసిపోయిందనుకో... ఇంకేముంది...ఠకీమని ఆ అమ్మాయిని నీకిచ్చి పెళ్ళిచేసేస్తాడు.పైసా అయినా కట్నం ఇవ్వకుండా! కట్నాల మార్కెట్లో నీ రేటు ఎంతలేదన్నా యాభైవేలకుపైగానే వుంటుంది. తొందరపడి నష్టపోకు"

ఇంకా ఏంటో చెప్తాడు కాబోలనుకున్న హరిశ్చంద్రకి ఆ మాటలో మనసు దూది పింజకన్నా తేలిగ్గా అయిపోయింది.

"కట్నం ఎవడికి కావాలిరా బోడి కట్నం? నేనేవన్నా సంతలో అమ్ముడుపోయే పశువుననుకున్నావా?... అసలు నేను మొదట్నుంచీ కట్నానికి వ్యతిరేకినే... నీ నోటి చలవ వల్ల ఆయన మా పెళ్ళికి అంగీకరించాలేగాని... అంతకన్నా కావాల్సిందేముంది?"

"మనస్ఫూర్తిగానే అంటున్నావా నువ్వీ మాట?" కాస్త అనుమానంగా చూశాడు వామన్రావ్.

"ఈ రెండు వేళ్ళలో ఒకటి పట్టుకో..."

"ఎందుకూ?"

"ముందు పట్టుకో చెప్తా..."

వామన్రావ్ హరిశ్చంద్ర మధ్య వేలుని పట్టుకున్నాడు.

అంతే... హరిశ్చంద్ర కళ్ళు మిలమిలా మెరిశాయ్. "సందేహంలేదురా- ఇంకేం సందేహం లేదు... నేను మనస్ఫూర్తిగానే అన్నాను" అన్నాడు ధీమాగా తలెగరేస్తూ.

"ఒకవేళ నేను నీ చూపుడువేలుని పట్టుకునుంటే?" సందేహంగా అడిగాడు వామన్రావ్.

"అప్పుడు కూడా నేను మనస్ఫూర్తిగానే అన్నట్టు లెక్క!"

"అదెలా?" విస్మయంగా చూశాడు.

"అదంతే! ఎందుకంటే నేనా మాటని మనస్ఫూర్తిగానే అన్నానని నాకు ముందే తెలుసు. ఈ వేళ్ళ టెస్టు ఊరికే తమాషాకి... అంటూ ఘొల్లున నవ్వేశాడు హరిశ్చంద్ర. మనసు గాలిలో తేలియాడుతున్నప్పుడు అయిందానికీ కాన్దానికీ ఘొల్లుఘొల్లున నవ్వు రావడం సహజమే!

"భలే వాడివేరా!" అంటూ తనూ నవ్వేసి... "సో... నీకింక అడ్డమే లేదు... లక్కీగా మీ కులాలు కూడా ఒకటే. కాబట్టి నువ్ నిరభ్యంతరంగా ప్రొసీడ్ అయిపోవచ్చు. కాని నా సిన్సియర్ అడ్వయిజ్ ఏవిటంటే- తొందరపడి కొంపల మీదికి తెచ్చుకోకు. నిదానమే ప్రధానం అన్నారు పెద్దలు. నిదానంగా లైన్లో పెట్టు. ఎందుకంటే జీవితం తెలుగు సినిమా కాదు- ఇలా చూపులు కలవగానే అలా వి.జి.పి గార్డెన్ కెళ్ళిపోయి డ్యూయెట్లు పాడేసుకోవడానికి. ప్రేమ వ్యవహారంలో తొందరపడితే అవతలివాళ్ళు జులాయిగా అపార్థంచేసుకునే అవకాశం

ఎంతైనా ఉంది. ఖర్మజాలక అలా జరిగితే ఆ అమ్మాయేనా నిన్ను ఛీ కొట్టచ్చు.. లేదా ఆ రాఘవయ్యే నిన్ను మెడబట్టి బైటికి గెంటొచ్చు- కాబట్టి..."

ఇంకా ఏదో చెప్పబోతున్న వామన్రావుకి "అర్థమైంది లేరా" అంటూ అడ్డుపడ్డాడు హరిశ్చంద్ర. "యు నీడ్‌నాట్ వర్రీ! నా జాగ్రత్తలో నేనుంటాను. విష్ మీ ఆల్‌ది బెస్ట్..." అనేసి సాగదీసి వదిలిన రబ్బరు ముక్కలా సర్రున అక్కడినుంచి దూసుకుపోయాడు- అర్జంటుగా వెళ్ళి గూనమ్మని లైన్‌లో పెట్టేయాలన్న ఆత్రం కొద్దీ.



కిటికీ దగ్గర అరగంటసేపు నిలబడ్డా గూనమ్మ దర్శనభాగ్యం కలగలేదు హరిశ్చంద్రకి.

ఏమోలే... గులాబీమొక్కలకి సాయంత్రంపూట మాత్రమే నీళ్ళుపోయవలెను... పగటిపూట పోయరాదు... అని ఎక్కడైనా రూలుగాని ఉందేమోలే... అని సరిపెట్టుకోబోయాడు. కాని వెధవ మనసు ఊరుకోలేదు.

మొక్కలకి నీళ్ళు పొయ్యకపోతే పొయ్యకపోవచ్చు. పోనీ బావిదగ్గర ఏ బట్టలో ఉతుక్కోవచ్చుగా? ఆ వేపచెట్టుకవతల... ఆ ఎండలో... ఏ మంచమో వేసి దానిమీద దుప్పటిపరిచి ఏ వడియాలో ఆరబెట్టొచ్చుగా? పోనీ అంత ఓపిక లేకపోతే ఆ బాత్‌రూం పక్కన... ఆ ఇటుకలగుట్టకివతల... ఆ ఇసుక దిబ్బలో ఏ పిచ్చుకగూళ్ళో కట్టుకుంటూ ఆడుకోవచ్చుగా?- ఇలా పరిపరి విధాల ఆలోచింపజేసి ఉక్కిరి బిక్కిరి చేసిపారేసింది.

"ఛీ... నోర్ముయ్యవే పాడుమనసా! పిచ్చుగ్గూళ్ళు కట్టుకుంటూ పిచ్చిపిచ్చి ఆటలాడుకోవడానికి నా గూనమ్మేమైనా చిన్నపిల్లనుకుంటున్నావా ఇంకా?" అని మనసును కోప్పడి... బ్యాంక్‌కి టైమ్ కావస్తోందని గుర్తుకు రావడంతో అక్కణ్నించి కదిలాడు హరిశ్చంద్ర.

అతని పరిస్థితి ఇక్కడిలా ఉండగా అక్కడ కుసుమ కోమల సుందరాంగి

"అబ్బ! అదృష్టం అంటే అవంతిదే.." అనుకుంది- అప్పుడే పూర్తిచేసిన చేతిలోని నవలని పక్కనపెట్టి గాఢంగా నిట్టూరుస్తూ. ఆమె ప్రఖ్యాత రచయిత్రి రాంబాయమ్మగారి అభిమాని... అప్పటి వరకూ ఆమె చదివిన "కన్నెమందారం" అనే ఆ నవల కూడా రాంబాయమ్మ రాసిందే.

అందులో హీరోయిన్ అవంతి... పూలమ్ముకునే పిల్ల! అయినాసరే విద్యావతి మరియు సంస్కారవతి. ఆమెకు సాగర్ అనే ఓ అందమైన ఆరడుగుల యువకుడితో పరిచయం ఏర్పడుతుంది. అతనో జమీందారు కొడుకు. అందమైన మారుతీ కారులో ఎప్పుడు చూసినా ఆనందంగా తిరుగుతుంటాడు. వాళ్ళ పరిచయం అనతికాలంలోనే ప్రేమగా మారి... ఒకర్ని చూడకుండా ఒకరు ఒక్కక్షణం కూడా గడవలేని స్థితికి చేరుకుంటారు. కొడుకు ఓ పూలమ్ముకునే పిల్లని ప్రేమిస్తున్నాడని తెలిసి సాగర్ తండ్రి ఆగ్రహంతో మండిపడతాడు. నయాన్న భయాన్న ఎన్నో విధాల చెప్పి చూస్తాడు సాగర్‌కి- 'ఇది మన అంతస్థుకి తగిన పని కాదురా!' అని. కాని సాగర్ వినిపించుకోడు. పవిత్రమైన ప్రేమకి అంతస్థులు అడ్డురావని వాదిస్తాడు. కాని ఆ వాదన జమీందారు హృదయాన్ని కదలించలేకపోతుంది. కదలించగలగడానికి అది గుండే అయితేగదా?- బండ. ఆ బండరాతి హృదయుడు వాళ్ళిద్దర్నీ వేరుచేయడానికి ఎన్నెన్నో విధాల ప్రయత్నిస్తాడు. ధనమదంతో చిత్రవిచిత్రమైన పరిస్థితులను సృష్టించి... సాగర్‌లో అవంతిశీలం మంచిది కాదన్న అనుమానం నాటుకునేలా చేస్తాడు. దాంతో సాగర్ మనసు విరిగి తాగుబోతు అయిపోతాడు. ఇలా... ఓ రెండు వందల పేజీలపా




టు కష్టాలనుభవించి... చివరికి ఎట్లాగైతేనేం అపోహలు తొలగి పరిస్థితులు అనుకూలించి హీరోహీరోయిన్లు ఒకటైపోతారు. వాళ్ళ అమర ప్రేమ ఫలిస్తుంది.

"అబ్బ... అదృష్టం అంటే అవంతిదే..." మళ్ళీ అనుకుంది సుందరాంగి.

సుందరాంగికి రాంబాయమ్మ నవలలంటే ఎంత ఇష్టమో ఆవిడ నవలల్లోని హీరోలన్నా అంతే ఇష్టం.

అవును మరి...

కారు కలిగిన ఆరడుగుల అందగాళ్ళు ఏ కన్నెపిల్లకి మాత్రం ఇష్టంగా అనిపించరు?... రాంబాయమ్మగారి హీరోలందరూ ఇంచు మించు అలాంటి గొప్ప అందగాళ్లే.

సాగర్ చాలా విశాల హృదయుడు. లేకపోతే అతనేంటి? అతని అంతస్తేంటి?... పవిత్రమైన ప్రేమకు కట్టుబడి ఓ పూలమ్ముకునే పిల్లను పెళ్ళాడేడూ అంటే... రియల్లీ హి ఈజ్ గ్రేట్.

ఒక విధంగా అతను గ్రేటే అయినా... ఏం? అవంతి అందం మాత్రం సామాన్యమైందా? వేయి గులాబీలు ఒక్కసారిగా విరగబూసినంత అందంగా ఉంటుంది అవంతి- అని వర్ణించింది రచయిత్రి. దాన్నిబట్టి ఇట్టే ఊహించుకోవచ్చు అవంతి అందం ఎంత గొప్పదో!

ఆడదాని అందానికి దాసోహం అవని మగాడెక్కడుంటాడు? అవంతి అందానికి దాసుడై సాగర్ తన అంతస్తుని మర్చిపోయి ఆమెను వివాహం చేసుకోవడంలో ఆశ్చర్యమేముంది?

సుందరాంగి లేచివెళ్ళి నిలువుటద్దం ముందు నిలబడి తన ప్రతిబింబంకేసి దృష్టి సారించింది.

తనది కళ్ళు మిరుమిట్లు గొలిపే అందమని ఆమె మట్టుకు ఆమెకే అనిపించింది. నిజానికామెకు నాట్యం రాకపోయినా... చీర కొంగు గట్టిగా లాగి నడుం దగ్గర బిగించి ఏదో నాట్యభంగిమ పెట్టింది.

ఓహ్... అజంతా శిల్పాలు బలాదూర్... తన అందం ముందు. తన రూపం తనకే ఇంత ముచ్చటగా ఉందే... అలాంటిది సాగర్‌లాంటి ఏ జమీందారు కొడుకైనా తనని చూస్తే...?

... తనని ప్రేమించకుండా ఉండగలుగుతాడా?

ఇంపాసిబుల్.

ఆరడుగుల ఓ అందగాడి పక్కన మారుతీ కార్లో కూర్చుని ఏదో సుందరమైన ప్రదేశంలో విహరిస్తున్నట్టు... చక్కని ఊహ.

సుందరాంగి హృదయం పులకాంకురమైంది.

ఎప్పటికైనాసరే... ఎట్లాగయినాసరే... కారున్న ఆరడుగుల అందమైన యువకుణ్ని మాత్రమే పెళ్ళిచేసుకోవాలి తను.

నాన్న తనకీమధ్య సంబంధాలు చూస్తున్నట్టు వినికిడి.

కారున్న ఆరడుగుల అందమైన యువకుణ్ని తేవడం నాన్నవల్ల అవుతుందా? అవ్వదు!

కాబట్టి నాన్న తేబోయే సంబంధాలకు చచ్చినా ఒప్పుకోకూడదు. అదృష్టమనేది ఎప్పుడు ఎవర్ని ఎలా వరిస్తుందో చెప్పలేం! జమీందారు కొడుక్కాకపోయినా... కారున్న ఆరడుగుల అందమైన ఏ డాక్టరో, ఇంజినీరో అదృష్టవశాత్తూ తనని చూసి ప్రేమించడం జరగొచ్చు. కూడదని రూలేం లేదుగా?... కాకపోతే అందుకు కొంత సమయం పట్టొచ్చు. అప్పటిదాకా ఆగాలి తను.

ముసిముసిగా నవ్వుకుంటూ నాట్యభంగిమలోంచి మామూలు పొజిషన్‌లోకి వచ్చేసింది సుందరాంగి.

"ఏంటే నీలో నువ్వే ఏదో నవ్వేసుకుంటున్నావు?"

ఉలిక్కిపడి వెనక్కి తిరిగింది సుందరాంగి.

నర్మద.

"రావే" అంది సుందరాంగి.

నర్మద వాళ్లది సుందరాంగి వాళ్ళ పక్కిల్లే వాళ్ళిద్దరిదీ ఒకే ఈడు. ఒకే ఈడు గల... పక్కపక్క ఇళ్ళలో పుట్టిపెరిగిన ఇద్దరాడపిల్లల మధ్య ఎంత స్నేహముంటుందో ఎవరైనా ఊహించుకోవచ్చు.

"ఏంటే... నీలో నువ్వే ఏదో నవ్వేసుకుంటున్నావూ?" మంచంమీద కూర్చుంటూ మళ్ళీ అదే ప్రశ్నవేసింది నర్మద.

"అబ్బే ఏంలేదే... ఏదో జ్ఞాపకం వచ్చి..."

"ఏంటబ్బా ఆ జ్ఞాపకం? తలుచుకోగానే నవ్వొచ్చేట్టంత స్వీట్ మెమొరీస్... నాకు తెలియనివి ఏమున్నాయబ్బా?" ఆశ్చర్యాన్ని అభినయిస్తూ నోరు సున్నలా తెరిచింది నర్మద.

"అబ్బ పట్టుకుంటే వదలవు కదా జలగలాగ!"

అంటూ నర్మద పక్కకొచ్చి కూర్చుని- "ఏంటి... నూన్‌షో సంగతి గుర్తు చేయడానికేనా వచ్చావ్?" అంది సుందరాంగి.

అంతక్రితంరోజే వాళ్ళిద్దరూ ప్లానేసుకున్నారు - రేపు నూన్‌షోకి వెళ్దామే అని.

"నూన్‌షోనా?"

"ఒసి నీమతిమరుపుమండా! నిన్న మనిద్దరం అనుకున్నాం గదే... ఇవ్వాళ వెళ్దామని!"

"అరెరె... అవునుగదూ?... పొద్దుట్నుంచి ఆ గొడవలో పడి నాకా ధ్యాసేలేదు..." నాలుక్కరుచుకొంది నర్మద. "ఏంలేదే... రాత్రి లాస్ట్‌బస్‌కి మా శ్యామలక్కొచ్చింది. దాని కాపురం సంగతి నీకు తెలియనిదేముంది?... ఆ పిశాచంగాడి వ్యవహారం ఈసారి బాగా ముదిరిపోయింది. ఆయనగారేదో వ్యాపారం చేస్తాట్ట... పదివేలు కావాల్ట! డబ్బు తీసుకొస్తే తప్ప నువ్ తిరిగి నా గడపతొక్కడానికి వీల్లేదంటూ బాగా భయంపెట్టేసి పంపించాడు దాన్ని. అది వచ్చినప్పట్నుంచి ఒకటే ఏడుపు! ఏదో ఒకటి చేసి ఇచ్చి పంపిద్దాం అంటాడు నాన్న! "ఎక్కణ్ణించి తెస్తారు? అయినా ఇలా ఎంతకాలం?... ఇవ్వడానికి వీల్లేదుగాక వీల్లేదు" అంటున్నాడు మా అన్నయ్య. వీళ్ళిద్దరూ ఇలా వాదులాడుకుంటుంటే మా అమ్మా, శ్యామలక్కా ఒకర్నొకరు వాటేసుకొని ఏడవడం. ఛఛ... ఏమంటూ దాని పెళ్ళి చేశారోగాని... అటు దానికీ సుఖంలేదు, ఇటు మాకూ సుఖం లేదు..."

నర్మద కంఠంలో ధ్వనించిన బాధకి... సుందరాంగి ముఖంలో జాలి చోటుచేసుకుంది. "ప్చ్... ఏంటోనే! ఆ భగవంతుడికి కొందరి మీద ఇంత కక్షెందుకో నాకర్థంకాదు. శ్యామలక్క ఎంతమంచిది! ఎంత అమాయకురాలు!! తనకా ఇలాంటి రాతరాస్తాడు?..." అంది సానుభూతిని వ్యక్తం చేస్తూ.

నర్మద పెదవి విరిచి ఊరుకుంది.

"ఇంతకీ ఏంనిశ్చయించారు?" సుందరాంగి అడిగింది మళ్ళీ.

"ఏదీ... ఇంకా తర్జనభర్జనల్లోనే వుంది! అంతగా అయితే కాపురానికి పంపడం మానేయనైనా మానేద్దాంగాని డబ్బులివ్వడానికి వీల్లేదంటున్నాడన్నయ్య. ఒకరకంగా అదీ నిజమేననిపిస్తోంది. ఎంతకాలం ఇవ్వగలం ఇలా? ఎప్పటికైనా ఇంక మావల్ల కాదనాల్సిన పరిస్థితి రాకుండా వుండదు. ఆ పిశాచంగాడు అప్పుడు మాత్రం ఊరుకుంటాడనేముంది... ఏ కిరసనాయిలో పోసి..."

"ఛఛ... ఊరుకోవే! ఏంపాడుమాటలవి?" నొచ్చుకోలుగా అంది సుందరాంగి.

"పాడు మాటలు కాదే... జరగబోయేది చెబుతున్నా..." నర్మద కళ్ళలో కనీ కనిపించని తడి.

"బాధపడకే... రోజులెప్పటికీ ఒకేలా వుండిపోవు. చెడ్డ మనుషులెప్పటికీ చెడ్డమనుషులుగానే వుండిపోరు. ఎప్పుడో ఒకప్పుడు అతను తన తప్పు తెలుసుకుని తీర్తాడు. శ్యామలక్కని ప్రేమగా చూసుకుంటాడు. నాకా నమ్మకం ఉంది" అంది సుందరాంగి నర్మద భుజం మీద అనునయంగా చేయివేస్తూ.

"అది కలలో కూడా జరగని విషయం! మనుషులు మారొచ్చు. కాని పశువులు మనుషులుగా మారడం అసంభవం!" అంది నర్మద.

ఒకింతసేపు మవునంగా వుండిపోయి... ఆ తర్వాత అంది సుందరాంగి- "సరేలే... ఎలా జరగాలని రాసిపెట్టుంటే అలాగే జరుగుతుంది. ఎలానూ అనుకున్నాంగా... కాస్త రిలీఫ్‌గానైనా వుంటుంది నాకు. పోనీ వెళ్దామా నూన్‌షోకి?"

"సారీనే... నేను రాలేను" అంది నర్మద.

"నీఇష్టం" అనేసి వూరుకుంది సుందరాంగి.

తర్వాత ఓ అరగంట అక్కడే గడిపి వెళ్ళిపోయింది నర్మద. "ప్చ్... ఏవిటో పాపం..." అనుకుంది సుందరాంగి.

శ్యామల వీళ్ళకంటే నాలుగేళ్ళు పెద్ద. ఒక




స్టేజ్‌లో ఆమె కూడా వీళ్ళతో పాటు ఆడుతూపా డుతూ గడిపిందే! చాలా నెమ్మదస్తురాలు. దానికితోడు ఓ పిసరు అమాయకత్వం. ముఖ్యంగా ఆ అమ్మాయి నవ్వితే ఎంత నిర్మలంగా వుంటుందో చెప్పలేం. అలాంటిది. ఆమెను పట్టుకుని ఆ బ్రూట్... డబ్బుకోసం... వెధవ డబ్బుకోసం... చిత్రహింసలు పెడుతున్నాడా! ఛీ... వాడూ ఒక మనిషేనా?

నర్మద అతన్ని గురించి చెప్పాల్సి వచ్చినపుడు పశువనో, పిశాచంగాడనో, రాక్షసుడనో అంటుంది తప్పితే మా బావ అని ఏనాడూ అనదు. మరీ కోపంలో ఉన్నప్పుడైతే తానాడపిల్లనన్న విషయం విస్మరించి బూతుపదజాలాన్ని కూడా ఉపయోగిస్తుంటుంది.

అవునుమరి... తనకే ఇలావుంటే ఇంక దానికెలా వుంటుంది? కడుపు మండి పోదూ?

డబ్బు! డబ్బు విలువైనదే... కాదనలేం! అసలు మనిషి జీవితమే డబ్బుతో ముడిపడి వుంది. అయితేమాత్రం?... కట్టుకున్న భార్యనే అడ్డంపెట్టుకుని... ఆమెను హింసించీ పీడించీ ఆమె వైపునుంచే ఆ డబ్బును రాబట్టాలనుకోవడం... ఛీఛీ... ఎంత నీచం?

ఏరోజూ పేపర్లో వరకట్నపు చావు వార్త ఒక్కటైనా వుండితీర్తోందీమధ్య.

ఈ మగాళ్లంతా ఇంతనీచులుగా ఎలా మారిపోగలుగుతున్నారు? పాపిష్ఠి డబ్బు కోసమే గదా?!

హుఁ... అసలందుకే ఈమధ్యతరగతి వెధవల్ని పెళ్ళిచేసుకోకూడదు. వాళ్ళకే ఈ యావ!

నిన్నటి పేపర్లో గావల్ను చూసింది తను. వాడెవడో కాలేజీ లెక్చరర్ అట... పదుగురికి విద్యాబుద్ధులు నేర్పాల్సినవాడు... థూ... డబ్బుకి కక్కుర్తిపడి భార్యను కిరసనాయిలు పోసి...''

ఉరితీసి పారేయాలి అలాంటి వెధవల్ని!

ఈ మధ్యతరగతి మనుషులెప్పుడూ వున్న దాంతో తృప్తి చెందలేరు. అదే మొదట్నుంచీ డబ్బులో పుట్టి పెరిగిన వాళ్లకయితే డబ్బుమీద అంత వెంపర్లాట వుండనే వుండదు. నిత్యం కట్టలుకట్టలు కళ్ల జూస్తుంటారాయె!

ఫరెగ్జామ్‌పుల్ ఇందాకటి నవల్లోని సాగర్‌నే తీసుకుంటే అతను అవంతికోసం ఒక స్టేజ్‌లో ఆస్తినంతట్నీ వదులుకోవడానికియ్యాడా సిద్ధపడ్డాడు. డబ్బుని అతనంత తృణప్రాయంగా చూడగలగడానికి కారణం... అతనికి మొదట్నుంచీ డబ్బుండటమే గదా?

యస్... యగ్జాక్ట్‌లీ!

ఆలోచించినకొద్దీ సుందరాంగి మనసులో మధ్యతరగతి మానవుల పట్ల అసహ్యం పెరిగిపోసాగింది.

అవతల ఓ మధ్యతరగతి మానవుడు అనేక వేల సెకండ్ల సుదీర్ఘకాలంనుండి తననెంతో గాఢంగా ప్రేమిస్తున్నాడనీ... తనని పెళ్ళాడని బతుకు వ్యర్థమన్న నిర్ణయానికప్పుడే వచ్చేశాడనీ, తనకోసం ప్రాణాలైనా ధారపోయడానికి సిద్ధంగా వున్నాడనీ ఆమెకేం తెలుసు?

ఆమె ఆలోచనలిలా రేసుగుర్రాల్లో కదను తొక్కుతున్నాయనీ... కారున్న ఓ అందమైన ఆరడుగుల యువకుణ్ని మాత్రమే పెళ్ళాడాలన్న నిర్ణయం ఆమెలో క్షణక్షణానికీ బలయమైపోతున్నదనీ, పాపం పూర్ హరిశ్చంద్ర... అతనికి మాత్రం ఏంతెలుసు?

సరిగ్గా ఆ సమయంలో హరిశ్చంద్ర బ్యాంక్ మెట్లెక్కుతూ వున్నాడు! అతనికే గనుక ఆ క్షణంలో సుందరాంగి ఊహలెలా పరిగెడుతున్నాయో తెలిస్తే పాపం అక్కడికక్కడే కుప్పగా కూలిపోయుండును.

★ ★ ★

"మిస్టర్ హరిశ్చంద్రా... మీకేదో ఉత్తరం..."

కొలీగ్ వాసుదేవరావ్ అందించిన ఇన్‌లాండ్ లెటర్‌ని "థాంక్స్" అంటూ అందుకున్న హరిశ్చంద్ర- దాన్ని చూడగానే పోల్చేసుకున్నాడు రాసింది తండ్రని.

"శ్రీరస్తు చిరంజీవి హరిశ్చంద్రకి..."

నీ తండ్రి అచ్యుతరామయ్య ఆశీర్వదించి రాయునది.

ఇక్కడ మేమంతా క్షేమం. అక్కడ నీవున్నూ క్షేమంగా వుండగలందులకు దేవుని ప్రార్థించుచున్నాము.

పోతే నీవు రాసిన కార్డు చేరింది. సంగతులు తెలిశాయి. నీవు నీ మిత్రుడు వామన్రావ్




ఇంట్లోవుంటున్నట్లుగా రాశావు. సాధ్యమైనంత త్వరగా నీకంటూ ఏదైనా రూమ్ చూసుకుని మారిపోవడం మంచిది. పిల్లాజెల్లా లేరు కాబట్టి వాళ్ళింకా కొత్త దంపతుల కిందే లెక్క. వారిమధ్య వాళ్ళింట్లో నీవు ఎక్కువ రోజులు ఉండిపోవడం భావ్యం కాదు.

దేవుని దయవల్ల నీకు మంచి ఉద్యోగం దొరికింది. దీనికి మేమంతా ముఖ్యంగా మీ అమ్మా, చెల్లాయీ ఎంతగానో సంతోషిస్తున్నారు.

పోతే అతిముఖ్యమైన విషయం నీకు ఉద్యోగం వచ్చిందని తెలిసి కవుతరం నుండి మీ వెంగళరావు మామయ్య వచ్చాడు. వాళ్ల కల్పలతని నీకివ్వాలని అతడి ఉద్దేశం. పళ్ళు కాస్త ఎత్తన్నమాటేగాని కల్పలతకేం? బుద్ధిమంతురాలు, గుణవతి. ఈ సంబంధం మా అందరికీ ఆమోదయోగ్యంగానే అనిపిస్తోంది. నాలుగెకరాల పొలమూ, నలభైవేలు క్యాషూ ఇస్తానంటున్నాడు మీ మామయ్య. కల్పలత నీవెరుగని పిల్లకాదు. కాబట్టి బాగా ఆలోచించి నీ అభిప్రాయం తెలియ జేసినట్లయితే మిగతా ఏర్పాట్లన్నీ మేము చేసుకుంటాము. కల్పలతను కోడలిగా చేసుకోవాలని మీ అమ్మ చాలా ముచ్చటపడుతోంది. అదీ సంగతి.

ఉద్యోగంలో చేరింది కొత్త గనుక నీపై అధికారుల సూచనల మేరకు శ్రద్ధగా పనిచేసి వారి మన్ననలను పొందడానికి ప్రయత్నించు. నీ ఆరోగ్యం జాగ్రత్త. ఇక ఉంటాను.

ఇట్లు... నీ తండ్రి—

అచ్యుతరామయ్యావ్రాలు''

ఉత్తరం చదవడం ముగించిన హరిశ్చంద్రకి ముచ్చెమటలు పోశాయి!

''హే భగవాన్!!'' అనుకున్నాడు బాధగా.

''నో... నో! కు... కు... కుదరదు'' అనుకున్నాడు పిచ్చిగా.

''రైలు క్రింద తల పెట్టి చావనైనా చస్తాను గాని... ఆ అడ డ్రాకులాని చేస్కోనుగాక చేస్కోను...'' అనుకున్నాడు కసిగా.

''హుఁ... నీకింత ద్రోహచింతన తగదు వెంగళ్రావ్‌మావయ్యా... ఆరోజుల్లో నా చదువుకేదో సాయం చేసినట్టు చేసి... ఇప్పుడేకంగా నా లైఫ్‌కే ఎసరుపెట్టాలని చూస్తున్నావా?! ఏం... కాంతం పిన్ని కొడుకు గూని నరసింహంగాడు కూడా నీకు మేనల్లుడే అవుతాడుగా? వాడికెందుకు కట్టబెట్టకూడదు నీ ముద్దులపట్టిని? మహాఅయితే ఓ ఏడెనిమిదివేలిచ్చుంటావ్ నా చదువుకోసం. కావాలంటే నీ డబ్బు నీ మొహాన కొడతాను... అణాపైసల్తో సహా తీసుకో. అంతేగాని నా గొంతు కొయ్యొద్దు మావయ్యా కొయ్యొద్దు'' అనుకున్నాడు ఆవేదనగా.

''పంచభూతములారా! అష్టదిక్పాలకులారా! నా మనసు నా ప్రియాతిప్రియమైన గూనమ్మకి ఏనాడో ఇచ్చేశాను. గూనమ్మ లేనిజీవితాన్ని నేనూహించలేను. గూనమ్మ నా ప్రాణం... గూనమ్మ నా ఊపిరి! గూనమ్మ నా ఇష్టసఖి! నా గూనమ్మకి నన్ను దూరం చేయకండి...'' అనుకున్నాడు ఆర్తిగా.

''మిస్టర్ హరిశ్చంద్రా...''

ఇంకా ఏదో అనుకోబోయిన హరిశ్చంద్ర ఉలిక్కిపడి- అనుకోవడం మానేసి వాస్తవంలోకొచ్చాడు.

''ఇది మీ ఇల్లు కాదు మిస్టర్ హరిశ్చంద్రా! బ్యాంకు! మీ చేతిలోని లెటర్‌లో ఏదైనా అశనిపాతంలాంటి వార్త ఉంటే వుండచ్చు. నేను కాదనను. బట్ మీరిలా ఏదేదో అనేసుకుంటూ ఇవన్నీ మర్చిపోతేఎట్లా? అవతల కస్టమర్స్ చూడండి ఎలా నిలబడిపోయారో?'' మందలింపుగా అన్నాడు వాసుదేవరావ్.

''సారీ వాసుదేవరావ్‌గారూ...'' అన్నాడు హరిశ్చంద్ర సిగ్గుపడిపోయి ఉత్తరాన్ని మడిచి జేబులో పెట్టుకుంటూ.

''ఇట్సాల్‌రైట్'' అన్నట్టుగా తలపరికించాడు వాసుదేవరావ్.

''యస్ ప్లీజ్...'' అంటూ తలపైకెత్తిన హరిశ్చంద్రకి కస్టమర్స్ అంతా తన వేపు ఎర్రగా చూడ్డం కనిపించింది.

ఎందుకైనా మంచిదని- ''సారీసార్... సారీ సార్... సారీ సార్'' అని అందరికీ సారీలు చెప్పి... ఆ మీదట పనిలో ఇన్‌వాల్వ్ అయిపోయాడు హరిశ్చంద్ర.



సాయంత్రం బ్యాంక్ అవగానే హరిశ్చంద్ర రూమ్‌కి వెళ్ళిపోవడానికి సిద్ధపడుతుంటే... "ఒంటిగాళ్ళేకదా... అప్పుడే రూంకెళ్ళి ఏంచేస్తారు? లీలామహల్లో పిక్చరు బావుందట... వెళ్దాంరారాదూ?" అంటూ ఆహ్వానించాడు వాసుదేవరావ్.

అసలే గూనమ్మ గులాబీ మొక్కలకి నీళ్లు పోసే వేళైపోయింది. సమయానికి తానందుకోగలడో లేదోనని ఆందోళన పడుతున్న హరిశ్చంద్రకి- ఆ ఆహ్వానం కంపరం కలిగించింది. "సారీ వాసుదేవరావ్‌గారూ! నిన్ననే కొత్తగా రూమ్‌లో ప్రవేశించాను. ఇంకా సామాన్లూ అవీ సర్దుకోలేదు. చాలాపనుంది. మరోసారి చూద్దాంలెండి..." అన్నాడు ఏడవలేక నవ్వుతూ.

"బ్రహ్మచారికి సామాన్లేవిటండీ నా బొంద! మరేం ఫర్వాలేదు రేపు సర్దుకోవచ్చులే!" అన్నాడు వాసుదేవరావ్.

"నీకేం నువ్వెన్నయినా చెప్తావు! నువ్వేమయినా గూనమ్మని ప్రేమిస్తూ వుంటేగా?... గూనమ్మని ప్రేమిస్తోంది నేనాయె... నాబాధ నీకెలా తెలుస్తుంది?" అని మనసులో అనుకుని... "సారీసార్... నన్ను బలవంతం చెయ్యకండి! నాకు పనుంది" అంటూ దీనంగా చూశాడు హరిశ్చంద్ర. ఎందుకైనా మంచిదని ముఖాన్ని కూడా ఎఫెక్టుకోసం ఆముదం తాగినవాడి ముఖంలా పెట్టాడు.

అది చూసి- "సరేసరే... మీ ఇష్టం" అనేసి తనదారినతాను వెళ్లిపోయాడు వాసుదేవరావ్.

★ ★ ★

ఉరుకులుపరుగులమీద రూమ్ కొచ్చిపడిన హరిశ్చంద్ర... రూమ్‌లో కాలుపెట్టీపెట్టగానే చేసిన మొట్టమొదటి పని-

కిటికీ తలుపు తెరవడం!

కిటికీ తలుపు తెరిచిన వెంటనే హరిశ్చంద్ర కళ్ళు చేసిన మొట్టమొదటి పని-

గులాబీ చెట్లకేసి ఆశగా చూడటం!

ఆశలు ఎల్లవేళలా ఆడియాశలు కావు.

ఇలా చూసిన వెంటనే అలా దర్శనమిచ్చేసింది హరిశ్చంద్ర కళ్ళకి కుసుకోమలసుందరాంగి. షరా మామూలే! గులాబీ మొక్కలకి నీళ్లుపోస్తూ ఉందామె.

నిన్న ఒంటిజడనుకుంటా వేసుకుంది. ఇవ్వాళ రెండు జళ్ళు. నిన్న చెవులకి లోలాకులనుకుంటా పెట్టుకుంది. ఇవ్వాళ పెద్ద పెద్ద రింగులు. ఎరుపురంగు పట్టు పరికిణీ... ఎరుపు రంగు జాకెట్టు! రవ్వంత శక్తివంతమైన డిటర్జెంట్ వాషింగ్ కేక్‌తో ఉతికినట్టుగా ఉన్న తళతళలాడే తెల్లటి ఓణీ! ఎరుపూ తెలుపూ గులాబీలను ఒళ్లంతా పేర్చుకున్న గులాబీబాలలా వుంది ఆ కుసుమకోమల సుందరాంగి.

"పారగాన్ ఆఫ్ బ్యూటీ" అనుకున్నాడు హరిశ్చంద్ర.

"గూనమ్మా అయ్ లవ్‌యూ" అనుకున్నాడు హరిశ్చంద్ర.

గూనమ్మా అనేపేరు మొదట్లో అసహ్యకరంగా అనిపించినా... 'అది తన కుసుమకోమల సుందరాంగి పేరు' అని అనుకుంటున్న కొద్దీ... క్రమక్రమంగా... ఆశ్చర్యకరంగా... ఆ పేరుపట్ల గల ఏహ్యాభావం తగ్గిపోయి లైకింగ్ ఏర్పడిపోసాగింది హరిశ్చంద్రలో.

కుసుమకోమల సుందరాంగి అందాన్ని హరిశ్చంద్ర తన కళ్ళతో జుర్రేసుకుంటుండగా... ఎలా గడిచాయో తెలియకుండానే గడిచిపోయాయి ఓ పదిహేను నిముషాలు!

ఎప్పటికైనా ఇటువేపు చూడకపోతుందా... అప్పుడు పలకరింపుగా తానో నవ్వు నవ్వితే... ఆమె ప్రతిగా నిన్నట్లాగే మరో మనోహరమైన నవ్వు నవ్వకపోతుందా? అని ఆశిస్తూ నిలబడ్డ హరిశ్చంద్రకి- ఆమె ఎంతసేపటికీ ఇటువేపు చూడకపోయేసరికి చాలా చిరాకేసిపోయింది. "ఒసేవ్ గూనమ్మా... ఎంతసేపూ ఆ పువ్వులకేసి చూడ్డమేనా... ఇటుకేసి చూసేదేమైనా వుందా?" అనుకున్నాడు కోపంగా. అంతలోనే చటుక్కున నాలుక్కరుచుకున్నాడు.

ఇదేంటిది... అప్పుడే ఇంత తొందరపడిపోతున్నాడేంటి తను? గూనమ్మతో తన వ్యవహారం ఇంకా ప్రేమ స్టేజ్‌లోనే కదా వుంది?? అది ఫలించి తామిద్దరూ భార్యాభర్తలయ్యాక కదా- అలా ఎడాపెడా అడ్డదిడ్డంగా విసుక్కునే హక్కు తనకి ఏర్పడుతుంది?!

తప్పుతెలుసుకున్న హరిశ్చంద్ర మనసారా పశ్చాత్తాపం చెంది- "సారీ గూనా... నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నందువల్ల మనకింకా పెళ్ళి కాలేదన్న సంగతి మర్చిపోయి అలా విసుక్కున్నాను. రియల్లీ అయామ్ వెరీవెరీ సారీ! మన పెళ్ళయ్యేంతవరకూ ఇంకెప్పుడూ నీమీద అలా విసుక్కోను... నన్ను మన్నించు..." అని మనసులో ఆమెకి క్షమాపణ కూడా చెప్పుకున్నాడు.

మరో అయిదు నిముషాలు గడిచిపోయాయి.

అయినప్పటికీ కుసుమకోమల సుందరాంగి ఇటువేపు తిరగలేదు. పైగా ఆమె చేతనున్న బక్కెట్‌లోని నీళ్ళు అయిపోవస్తున్న సూచనలు కూడా కానరావడంతో - ఇక లాభంలేదు, ఏదోఒకటి చేసి తానే ఆమె దృష్టిని ఆకట్టుకోవడం మేలు... అనిపించింది హరిశ్చంద్రకి.

చిన్నగా దగ్గాడు.

ప్చ్... ఆమె ధ్యాస ఆమెదే.

మరోమారు దగ్గాడు.

ఊఁహుఁ... ఫలితం శూన్యం.

ఇంకోమారు కూడా దగ్గుదామనుకున్నాడు గాని, ఆమె తనని క్షయవ్యాధిగ్రస్తుడిగా అపోహపడే ప్రమాదముందని భయపడి ఆ ప్రయత్నం మానుకున్నాడు.

అంతలో మెరుపులా తట్టిందో ఐడియా!

తట్టడమే ఆలస్యం... వెంటనే దాన్ని ఆచరణలో పెట్టేశాడు.

తర్వాత...

"ఏవండీ... ఏవండోయ్!" పిలిచాడు కుసుమ కోమల సుందరాంగిని.

ఆమె చటుక్కున వెనక్కి తిరిగిచూసింది. "నన్నేనా?" అన్నట్టుగా వుంది ఆమె చూపు.

"మిమ్మల్నేనండీ... ఓమారిలా కిటికీ దగ్గరికొస్తారా?" కంఠంలో వీలైనంత వినయాన్ని ధ్వనింపజేస్తూ అన్నాడు. అతని గుండె అత్యంత వేగంగా కొట్టుకోసాగింది.

సుందరాంగి భృకుటి ముడివడింది.

"ఎందుకూ?" అన్నట్లు చేత్తో సైగచేసి అడిగింది అక్కణ్ణించి కదలకుండానే.

"సారీ అండీ... నా బాల్‌పెన్ స్ప్రింగు... అవతల పడిపోయింది. కాస్త వెదికి పెడతారూ?" పిలిచిన కారణం చెప్పేశాడు ఎలాగోలా ధైర్యం చేసుకుని.

ఆమె బక్కెట్ అక్కడే వదిలేసి కిటికీ దగ్గరికొచ్చింది... "ఏవన్నారూ" అంటూ.

"ఏమీలేదండీ... బాల్‌పెన్‌లో రీఫిల్ మార్చుదామని తీస్తుంటే... స్ప్రింగు ఎగిరి అవతల పడింది... దొరుకుతుందేమో కాస్త ప్రయత్నించరూ?" తనమాట నిజమే అవడానికి నిదర్శనంగా ఊడదీసి వున్న బాల్‌పెన్నుని ఆమెకు చూపుతూ అన్నాడు. ఆమెనంత క్లోజ్‌గా చూడగలుగుతున్నందుకతని గుండెలో ఏవేవో శ్రావ్యమైన వింతవింత రాగాలు!!

ఆమె నవ్వింది "ప్చ్..." అని పెదవి విరుస్తూ- "ఈ మట్టిలో అదెక్కడ దొరికి చస్తుందండీ బాబూ?... వెధవ స్ప్రింగేగా? పోతే పోయింది... మరోటి కొనుక్కోండి..." అంది నాలుక చప్పరిస్తూ.

"ఓసి నీబద్ధకం నాశనంగానూ! ఏమే... చూస్తే అరిగిపోతావా? చాల్లేగాని నోర్మూసుకుని వెతుకు..." అని గసిరేయబోయి... తమకింకా పెళ్ళికాలేదన్న విషయం జ్ఞాపకం రావడంతో ఠక్కున ఆగిపోయాడు. అదీగాక పెళ్ళయ్యేంత వరకూ అలా గసురుకోనని ఇందాకే మనసులో ఆమెకు ప్రామిస్ కూడా చేశాడాయే!

"దొరకడం కష్టమే అనుకోండి... కాని ప్రయత్నించడంలో తప్పులేదుగా...ప్లీజ్...శ్రమపెడుతున్నాననుకోక కాస్త చూద్దురూ మీకాళ్ళ దగ్గర ఎక్కడైనా ఉందేమో..." అన్నాడు బతిమాలుతున్న ధోరణిలో. కిటికీలోంచి చెయ్యి బైటికి చాపి ఆమె గడ్డం కూడా పుచ్చుకుందామా అనుకున్నాడుగాని...అలా చేయడం మరీ టూమచ్‌గా వుంటుందని మానుకున్నాడు.

అయినా ఇప్పుడిప్పుడే తొందర దేనికి? ఈ ప్రపంచంలోని ఏ శక్తీ తమని విడదీయలేదని తన అంతరాత్మ చెబుతూనే వుంది! ఏనాటికైనా గూనమ్మ తనదే! ఆమెను తాకి తరించే రోజులు....ముందుముందుకి....కోకొల్లలు!!

చిత్తశుద్ధితో కాకపోయినా...మొత్తానికి కొద్దిసెకండ్లపాటు నేలంతా కలయజూస్తూ బోడి

స్ప్రింగుకోసం వెదికినట్లుగానే నటించింది సుందరాంగి.

నిండా ఒక నిముషమైనా కాకముందే విసుగ్గా తల విదిలించి...“అబ్బే ఇక్కడెక్కడా లేదండీ బాబూ! ఐనా స్ప్రింగుకదా... ఫోర్స్‌గా వెళ్ళి ఎటువడిపోయుంటుందో ఏమో...” అనేసింది కంఠంలో చికాకును ధ్వనింపజేస్తూ.

“సారీఅండీ...మీకు శ్రమ కలిగించాను. అన్నట్టు నా పేరు బాబు కాదండీ...హరిశ్చంద్ర...” అన్నాడు హరిశ్చంద్ర ఉత్సాహంగా.

వెధవ స్ప్రింగ్‌పోతే పోయింది. ఐనా దానంతటదేం పడిపోలేదుగా? తనేగా కావాల్సి బైటికి విసుర్తా??. మొత్తానికి తన ప్లాన్ గ్రాండ్ సక్సెసయ్యింది. ఎలాగైతేనేం తన ప్రియసఖితో...ఇంత స్వల్పవ్యవధిలోనే మాట కలపగలిగాడు. మాటంటూ కలిసింది కాబట్టి ఈ పరిచయాన్ని ముందుముందు ఇంకా ఇంకా పెంచేసుకొని....

ఇలా ఆలోచించేసరికి అతనిలోని ఉత్సాహం ఏకంగా పరవళ్లు తొక్కడం ప్రారంభించింది.

మనసులో ఉత్సాహం పరవళ్ళు తొక్కినపుడు ఏ మనిషి ముఖమైనా చేటంత అవుతుంది. ఇటీజ్ క్వయిట్ నేచురల్!

హరిశ్చంద్ర ముఖం కూడా చింకి చేటంత యింది!

“హరిశ్చంద్ర! ఏంబావుందనబ్బా...పాత చింతకాయపచ్చడిలాగ? అంతటి గొప్పపేరు ఇంకెవరికీ లేనట్టు మొహం చూడెలా చింకిచేటలాచేసుకున్నాడో” అనుకుంది లోలోన సుందరాంగి. తన మూలంగానే అతనిలో ఉత్సాహం పరవళ్ళు తొక్కసాగిందనీ, అందుకే అతని ముఖం అలా చింకిచేటలా అయ్యిందనీ ఆమెకేం తెలుసు పాపం? “అలాగా అండీ...” అంది ఏదో ఒకటి అనాలి గనుక.

“అన్నట్టు మీపేరు గూనమ్మంట కదండీ! ...గూనమ్మ ...వెరీ నైస్‌నేమ్” అసలే ఉత్సాహంలో వున్నాడేమో, తానేమంటున్నదీ కానుకోకుండా గభాల్న అడిగేడు హరిశ్చంద్ర.

“ఛీ...”అని - పమిట చెంగును నోట్లో కుక్కుకొంది సుందరాంగి.

“అదేంటండీ అలా అంటున్నారు. ఏం...మీపేరంటే మీకు నచ్చదా? గూనమ్మకేమండీ... మరీ అంత గొప్ప పేరు కాకపోయినా ఓ మాదిరి నైస్‌పేరేగా? అరె....దుఃఖిస్తున్నారా? ఛఛ ఊరుకోండీ...పేరులో ఏముందీ? అయినా ఇప్పుడు మాత్రం -మించిపోయిందేముంది... మీకు మరీ అంతగా నచ్చకపోతే ఇప్పుడైనా సరే పేరు మార్చేసుకోవచ్చు...” ఆమె పమిట చెంగును నోట్లో కుక్కుకోవడం చూసి దుఃఖాన్ని ఆపుకోవడానికి ఆమె వ్యర్ధప్రయత్నం చేస్తున్నది కాబోలనుకున్న హరిశ్చంద్ర - ఆమె దుఃఖిస్తున్నందుకు వ్యధాభరితహృదయుడైపోయి కీచుగొంతుకతో ఆమెనలా ఓదార్చబోయాడు. కాని అంతలోనే నేనేం దుఃఖించడంలా అంటూ ఆమె కోపంగా నోట్లో పమిట చెంగుని విసురుగా బైటికి లాగేసుకోవడంతో - అతని బుర్ర గిర్రున తిరిగిపోయింది.

“దుఃఖించకపోతే మరెందుకండీ నోట్లో పమిట చెంగు కుక్కుకున్నారు? పమిట చెంగు నమలడం మీహాబీనా?” అన్నాడు అయాయకంగా. బుర్రగిర్రున తిరిగిపోయినప్పుడు మెదడు స్థానభ్రంశం చెందుతుంది గనుక అలాంటి సందేహాలు రావడం సహజం.

“మీకు ఉమ్మెత్తకాయలు తినడం హాబీనా?” ఎదురుప్రశ్న వేసింది సుందరాంగి.

“ఉమ్మెత్తకాయలా?” ఆశ్చర్యంగా చూశాడు హరిశ్చంద్ర.

“అవును ఉమ్మెత్తకాయలే” - ‘త’ అనే అక్షరాన్ని నొక్కి పలికింది సుందరాంగి.

“మీరెందుకిలా అడుగుతున్నారో అర్ధంకావడంలేదు” బుర్ర గీరుకుంటూ ఇంకా ఆశ్చర్యంగానే చూశాడు హరిశ్చంద్ర.

సుందరాంగి కిసుక్కున నవ్వబోయి మానేసింది. “అబ్బే ఏంలేదండీ! ఉమ్మెత్తకాయలు తింటే పిచ్చెక్కుతుందంటారుకదా... అందుకని అడిగాను...” అంది యమా సీరియస్‌గా.

నవనాడులూ కుంచించుకుపోతున్నట్టనిపించింది హరిశ్చంద్రకి. తాను నించున్నచోట భూమి రెండుగా చీలిపోయి తానా చీలికలో కూరుకుపోతే బావుణ్ణని కూడా అనిపించింది.

అవును మరి! మనసారా ప్రేమించిన ప్రేయసి దృష్టిలో ఓ పిచ్చివాడిగా ముద్రపడ్డాక-ఇంక బతికి మాత్రం ఏంప్రయోజనం?!

"ఎ...ఎ...ఎవరు చెప్పారండీ మీకు-నాకు పిచ్చి అని?" అన్నాడు తడబడిపోతూ. "ఇంకెవరూ... ఆ బంటూగాడే చెప్పుంటాడు... దొంగ రాస్కెల్! అనుకున్నంత పనీ చేశాడు" అనుకున్నాడు లోలోన నులుచుకుపోతూ.

"ఎవరో చెప్పాలా ఏమిటండీ...పమిట చెంగు నమలడం మీ హాబీనా అని మీరడిగినపుడే నాకర్థమైపోయింది... మీకు పిచ్చి అని"

"అంతేనంటారా? నేనింకా మీ బంటూగాని చెప్పేడేమో అనుకున్నాను..." అనేసి...అన్నాక నాలుక కరుచుకున్నాడు హరిశ్చంద్ర.

పట్టేసింది సుందరాంగి. "అయితే మీరు వాడిముందు కూడా పిచ్చిపిచ్చిగా ప్రవర్తించారన్నమాట! దీన్నిబట్టి చూస్తుంటే నాకోటి అర్థమవుతోంది. మీకు నిజంగానే పిచ్చి అయినా ఉండి తీరాలి...లేదా ఇలా పిచ్చిపిచ్చిగా ప్రవర్తించడం మీ హాబీయేనా అయ్యుండాలి- యామై కరెక్ట్?"

"అబ్బే అలాంటిదేం లేదండీ! మీరు చాలా అపార్థంచేసుకుంటున్నారు!"

"అయితే మీకు నిజంగా పిచ్చి లేదంటారు..."

"లేదూ లేదూ లేదు"

"పిచ్చిపిచ్చిగా ప్రవర్తించడం మీ హాబీ కూడా కాదంటారు..."

"కాదూ కాదూ కాదు"

"ఏమోనండీ...ఇప్పుడు మీరిచ్చిన స్టేట్మెంట్లకీ, మీ ప్రవర్తనకీ ఎక్కడా పొంతన కుదరడంలేదు. మిమ్మల్ని కొంతకాలంపాటు కీన్‌గా అబ్జర్వ్ చేస్తేనే తప్ప...మీ విషయంలో నేనొక నిర్ణయానికి రాలేను" నిష్కర్షగా అనేసింది సుందరాంగి.

తెలుగు సినిమాలో హీరోకి కేన్సర్ వచ్చినపుడు ఆ హీరో ముఖం ఎలా ఉంటుందో అలాంటి ముఖం పెట్టి-"డు యాజ్ యు ప్లీజ్...మీ ఇష్టప్రకారమే చేయండి...మీఇష్టమొచ్చినంత కాలం అబ్జర్వ్ చేసుకోండి నన్ను. చందమామకి పట్టే గ్రహణం తాత్కాలికం. సూర్యుణ్ణి మబ్బులు ఎల్లకాలం అడ్డగించలేవు. ఏదో ఒకనాటికి మీరే ఒప్పుకుంటారు నాకు పిచ్చిలేదని. ఏనాడో ఓనాడు మీరే అంటారు పిచ్చిపిచ్చిగా మాట్లాడటం నా హాబీ కూడా కాదని! ప్రస్తుతానికి ఇంతకన్నా నేనింకేమీ చెప్పలేను..." అన్నాడు హరిశ్చంద్ర గద్గదికంగా. అంతలోనే మళ్ళీ ఏదో గుర్తొచ్చినవాడిలా అదోలా తలెగరేసి- "బట్ వన్‌థింగ్ గూనమ్మగారూ..." అంటూ ఏదో చెప్పబోయి ఠక్కున ఆగిపోయాడు.

అందుక్కారణం...సుందరాంగి మళ్ళీ తన పమిటచెంగును నోట్లో కుక్కుకుంటూ ఉండటం!

హరిశ్చంద్రకి చెప్పలేనంత ఉక్రోషం వచ్చేసింది. "పమిటచెంగు నోట్లో కుక్కుకోవడం మీ హాబీ కాదన్నారుగా ఇందాక. మరి మళ్ళీ ఎందుకు కుక్కుకుంటున్నారు? హుఁ...నన్నిలా కన్ఫ్యూజ్ చేసేసి...నాతో ఏదో ఏదో వాగింపచేసి...నాకు లేనిపోని పిచ్చి అంటగట్టడానికా?" అన్నాడు రోషంగా.

సుందరాంగి నోట్లోంచి పమిట చెంగును బైటికి లాగేసి ఫకాలున నవ్వింది.

"అదికాదండీ బాబూ! మీరు నన్ను గూనమ్మ అంటుంటే నవ్వొచ్చి ఆ నవ్వునాపుకోవడానికి పమిటచెంగును నోట్లో కుక్కుకున్నాను. ఇందాక్కూడా అందుకే!"

"మిమ్మల్ని గూనమ్మా అంటే మీకు నవ్వు రావాల్సిన పనేముంది? నన్నెవరైనా హరిశ్చంద్రా అని పిలిస్తే నాకు నవ్వు రాదే?! దీన్నిబట్టి చూస్తే నాకూ ఒకటి అర్థమవుతోంది...మీకు కాస్త నట్ లూజేమోనని..."

ఎలాక్కొట్టేన్దెబ్బ? అన్నట్టుగా చూశాడు హరిశ్చంద్ర.

"షటప్" అందామనుకుంది కాని...పోన్లే పాపం అని అన్లేదు సుందరాంగి.

"మీరు చాలా చాలా పొరబడ్డారు మిస్టర్ హరిశ్చంద్రా! మిమ్మల్ని హరిశ్చంద్రా అని పిలిస్తే మీకు నవ్వు రాకపోవడం సహజం! ఎందుకంటే అది మీపేరు కాబట్టి. నన్ను గూనమ్మ అంటే నాకు నవ్వు రావడం సహజం! ఎందుకంటే నా పేరు గూనమ్మ కాదు కాబట్టి!"




"ఆఁ!!" అంటూ నోరు వెళ్ళబెట్టాడు హరిశ్చంద్ర. "ఏంటీ మీ పేరు గూనమ్మకాదా? నిజంగా గూనమ్మకాదా?... నిజంగా గూనమ్మ కాదా?" ఆమె పేరు గూనమ్మకానందుకు మనసు ఆనందోడోలికల్లో తేలియాడిపోతుండగా- "మరి మీ తమ్ముడు అలా చెప్పాడేం?" అన్నాడు తికమకపడిపోతూ.

"వాడొక పోకిరీ వెధవ! వాడికి మా ఇంట్లో ఎవ్వరిమీదైనా కోపమొచ్చినప్పుడు వాడి నోటికి ఏం చండాలప్పేరు తోస్తే ఆపేరుతో పిలవడం వాడికో దురలవాటు! ఉదాహరణకి మా అమ్మ వాడికి అడగ్గానే డబ్బులివ్వలేదనుకోండి... 'ఏంవెంకమ్మా ఓ పదిపైసలిస్తే అరిగిపోతావా?' అంటాడు. నిజానికి మా అమ్మ పేరు వెంకమ్మ కాదు పూర్ణమ్మ. మా నాన్నగారు వాణ్ణెప్పుడైనా ఏదైనా అల్లరి పని చేసినందుకు కొట్టేరనుకోండి... చాటుకెళ్ళి 'హుఁ... ఈ గుర్నాధానికి మాలావు కోపం!' అని సణుక్కుంటాడు. మీకూ తెలుసుగా మా నాన్నగారి పేరు గుర్నాధం కాదు- రాఘవయ్యగారని? నిన్న మీ రూమ్‌కెళ్ళి ఏవైనా పుస్తకాలడిగి తీసుకురమ్మంటే వెళ్ళను పొమ్మని మొరాయించాడు. నాక్కోపమొచ్చి వీపు మీద రెండేసి పంపించాను. వాడు మీ రూమ్ కొచ్చినప్పుడు లోలోన నామీద కోపంతో మండిపడుతూ వున్నాడన్నమాట! ఇదంతా మీకేం తెలుసు? మీరు మామూలుగా నా పేరడిగి వుంటారు. వాడు నామీద కసికొద్దీ అలా గూనమ్మ అని చెప్పివుంటాడు... మీరదే నిజమనుకుని..."

"ఇంక చాలు... ఇంక చెప్పకండి... నాకంతా అర్థమైపోయింది..." అన్నాడు హరిశ్చంద్ర ఆనందంగా. నిజానికతనికా క్షణంలో ఎంత ఆనందంగా వుందీ అంటే- "నా ప్రేయసి పేరు గూనమ్మ కాదోచ్!" అని భూగోళం దద్దరిల్లిపోయేలా అరవాలన్నంత ఆనందంగా వుంది.

'ఇంతకీ మీ అసలు పేరు?" అడిగాడు ఆనందం కాస్త సద్దుమణిగాక.

"లాహిరి..."

అంతే! సద్దుమణిగిన ఆనందం మళ్ళీ చెలరేగిపోయింది అతనిలో.

లా...హి...రి...

అబ్బ! ఎంత మంచిపేరు?!
వాటె బ్యూటీఫుల్ నేమ్?!

పేరంటే ఇదీ పేరు... పేరంటే ఇలా వుండాలి!

రేపొద్దున్న పెళ్ళయ్యాక షార్ట్‌కట్‌లో ఏమని పిలవాలి'లాహీ'అంటే బావుంటుందా? అబ్బే- ఏమంత బావున్నట్టుగాలేదు. పోనీ 'హిరీ' అంటే?... ఫర్వాలేదు సమ్‌వాట్ బెటర్! అయినా ఎందుకొచ్చిన షార్ట్‌కట్‌లెద్దూ... ముచ్చటగా మూడక్షరాల పేరేగా? ఇంచక్కా 'లాహిరీ' అనే పిల్చుకోవచ్చు.

"ఏంటి హరిశ్చంద్రగారూ... ఏంటి ఏదో దీర్ఘాలోచనలో మునిగిపోయారు?"

లాహిరి ప్రశ్నతో ఊహాల్లోంచి వాస్తవంలోకి వూడిపడ్డ హరిశ్చంద్ర నిజం చెప్పలేక గుటకలు మింగాడు- "అబ్బే ఏంలేదండీ ఏంలే"దంటూ.

"పాపం ఇంతకీ మీ స్ప్రింగు దొరకనేలేదు. వస్తానండీ ఇంకా కొన్ని మొక్కలకి నీళ్లుపొయ్యాలి..." అంటూనే మళ్ళీ గులాబీ మొక్కల వేపు వెళ్లిపోయింది లాహిరి.

"ఫర్వాలేదు... మనిషి మూగికాదు, మాటకారే! ఇనెడిషన్ టు దట్... షి ఈజ్ బ్లెస్డ్ విత్ ఏస్వీట్ వాయిస్! వింటున్న కొద్దీ వినాలనిపించేటంతే తియ్యటి మాటలు..." మనసు ఆనందంతో రెపరెపలాడిపోతుంటే మురిపెంగా అనుకున్నాడు హరిశ్చంద్ర.

ఇంకా ఏవైనా పుస్తకాలు కావాలంటే మీ తమ్ముణ్ణి పంపించండని కేకేసి చెబుదామా అనుకున్నాడుగాని... అంతలోనే 'ఓవర్‌స్పీడ్ ఈజ్ ఇన్‌జూరియస్ టు హెల్త్' అనిపించి... ఆ ప్రయత్నం మానుకున్నాడు.

ఆమె మొక్కలకి నీళ్లుపోయడం ముగించాగ్గాని అతని కాళ్ళక్కడి నుంచి కదల్లేదు.

★ ★ ★

ఆ రాత్రి బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చేసి... తండ్రి ఉత్తరానికి ప్రత్యుత్తరం రాశాడు హరిశ్చంద్ర.

"పూజ్యనీయులైన నాన్నగారికి నమస్కారములు" అంటూ మొదలెట్టి... ఫార్మల్‌గా

 

రాయాల్సిన విశేషాలన్నీ రాసేశాక... "వెంగళ్రావ్ మావయ్య కూతురు కల్పలత గురించి నేను బాగా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాను. ఆ దంతసుందరిని పెళ్ళిచేసుకోవడంకంటే ఉరిపోసుకోవడం మేలన్నదే ఆ నిర్ణయం! అంచేత మీరీ విషయంలో ఇంకేమీ ఆలోచించకండి. మా వాడికి ఇష్టంలేదట... అని కుండబద్దలుగొట్టినట్టుగా చెప్పేయండి మావయ్యతో. పోతే గూని నరసింహాన్ని ప్రైజేసి చూడమని కూడా చెప్పండి. కల్పలతనే కాదు ఇంకే అమ్మాయిని కూడా ఇప్పట్లో పెళ్లి చేసుకునే ఉద్దేశం నాకులేదు. కాబట్టి ఇప్పట్లో నా పెళ్ళి ప్రసక్తి తేనేవద్దు. గమనించ ప్రార్థన. ఇట్లు- మీ కుమారుడు హరిశ్చంద్ర వ్రాలు" అని రాసి ముగించేడు ఉత్తరాన్ని.

దాన్ని చూసి తండ్రి కల్లుతాగిన కోతిలా గంతులేస్తాడని తెలుసు. కాని... 'వేస్తే వెయనీలే' అనుకున్నాడు. 'ఆఫ్టరాల్ తండ్రే కదా?' అనుకున్నాడు.

అవును మరి... ప్రేమా మజాకానా?

ప్రేమకోసం రాజ్యాలనే కాలదన్నిన అమర ప్రేమికులున్నారీ పవిత్ర భారతదేశంలో.

అలాంటిది... ఆఫ్టరాల్ తండ్రి... ఆఫ్టరాల్ ఓ తండ్రికి భయపడి ప్రేయసిని దూరం చేసుకుంటాడా తను?

నో... నెవ్వర్!- దృఢంగా అనుకున్నాడు. అతనికి కళ్ళముందు లాహిరి నవ్వుతోంది...

అభినందన పూర్వకంగా చూస్తోంది...

"అవును లాహిరీ, అవును. నీకోసం మా నాన్ననేకాదు... అవసరమైతే యావత్ ప్రపంచాన్నే ధిక్కరిస్తాను... ఆఁ..."

"వెవ్వెవ్వె..."

"ఏయ్... ఏంటావెక్కిరింత? నేనేం అబద్ధాలాడ్డంలేదు తెలుసా? నిజంగానే నీకోసం ఏమైనా చేస్తాను. చివరికి నా ప్రాణాలైనా..."

"అర్పిస్తావు... నాకు తెలుసు హరిశ్చంద్రా! నీ ప్రేమ ఎంత గొప్పదో నాకు తెలుసు! నీ ప్రేమను పొందగలిగిన నేను- నిజంగా చాలా అదృష్టవంతురాల్ని హరిశ్చంద్రా..."

"ఊహుఁ... అదేంకాదు! నీలాంటి అందగత్తె ప్రేమను పొందగలిగిన నేనే నిజమైన అదృష్టవంతుణ్ణి..."

"హరిశ్చంద్రా..."

"లాహిరీ..."

హరిశ్చంద్ర కౌగిట్లోని తలగడ దిండు అష్టవంకర్లు తిరిగిపోసాగింది.



అప్పటికి వారం పూర్తయ్యింది హరిశ్చంద్ర ఆ రూమ్‌లో జేరి.

లాహిరి మాట ఏమోగాని ఇతను మాత్రం ఆమెనూ, ఆమె కుటుంబ సభ్యులనూ కీన్‌గా అబ్జర్వ్‌చేసి చాలా విషయాలు గ్రహించాడు. తుంటరివెధవ బంటూతో స్నేహం లాంటిది చేసి వాడిద్వారా కూడా కొంత సమాచారాన్ని రాబట్టగలిగాడు. అయితే ఈ వారం రోజుల్లో లాహరితో మళ్ళీ మాట కలిపే అవకాశం మాత్రం కలగలేదతనికి.

ప్రయత్నిస్తే కలిగుండేదేమోగాని... ఎందుకనో సాహసించలేకపోయాడు.

ఏరోజూ ఆమె గులాబీ మొక్కలకి నీళ్ళు పొయ్యడమూ మానలేదు. ఇతనా సమయానికి ఠంచనుగా కిటికీ దగ్గర హాజరవ్వడమూ మానలేదు.

కళ్ళతో పలకరించుకోవడం అడపాదడపా జరిగినా... బాల్‌పెన్ స్ప్రింగ్‌ని మాటిమాటికి అవతలకు విసిరేయడం మాత్రం మానలేదు.

మొత్తానికి అతను గ్రహించిన విషయాలు:

లాహిరి ఇంటర్ పాసయ్యాక చదువుమానేసింది. టైపూ షార్ట్‌హాండూ వచ్చు.

లాహిరి తండ్రి రాఘవయ్యది ఐరన్‌స్క్రాప్ వ్యాపారం. ఐరన్‌స్క్రాప్ అనగానే చప్పున "పాత ఇనుముకి మిఠాయో మిఠాయ్"

అంటూ ఇంటింటికీ సైకిళ్ళమీద తిరిగే వ్యక్తులు గుర్తుకు రావచ్చు. కాని అలాంటిదికాదాయన వ్యాపారం. అమ్మేదీ కొనేదీ పాత ఇనుమునే అయినా... ఒకింత భారీస్థాయిలో. కాగా అతన్ని గురించి వామన్రావ్ చెప్పింది మాత్రం అక్షరాలా నిజమే! పరమ పిసినారి. డబ్బు అనేది కూడబెట్టడానికే తప్ప ఖర్చు చేయడానికి కాదన్నది అతని సిద్ధాంతం. ఆ కారణంగా ఇంట్లోవాళ్ళని చిన్నచిన్న సరదాలను కూడా తీర్చుకోనివ్వడు.

లాహిరి తల్లి పూర్ణమ్మ- పూర్తి పేరు అన్నపూ[illegible]ని పూర్ణమ్మ అనే పిలుస్తారంతా- చాలా సాత్వికురాలు. ఏనాడూ చెరగని చిరునవ్వు ఆమె ముఖానికో [illegible]ని ఆభరణం! ఆచి తూచి ఇంటి ఖర్చులకని ఆమె చేతికి కొంత పైకం ఇస్తుంటాడు రాఘవయ్య. అంతే తప్ప తన సంపాదనని తెచ్చి ఆమె చేతిలో పోయడు. అయినాసరే ఆమె చేతిలో ఎప్పుడూ డబ్బాడుతూనే ఉంటుంది. దానిక్కారణం అప్పుడు కొంతా అప్పుడుకొంతా చొప్పున పుట్టింటినుండి తెచ్చుకున్న పైకాన్ని ఆమె చిన్నస్థాయిలో వడ్డీలకు తిప్పుతూంటుంది. భర్త పీనాసితనంపట్ల ఏవగింపు ఉన్నా ఆ విషయంలో అతనితో ఏనాడూ తగవుపెట్టుకో[illegible] పుట్టుకతో వచ్చినబుద్ధి పుడకలతోగాని పోదని ఆమెకు బాగా తెలుసు. తగవుపెట్టుకుని మాత్రం ఏం ప్రయోజనం? అదీగాక తనకంటూ కొద్దోగొప్పో సంపాదనవుంది. పిల్లలు చిన్నచిన్న సరదాలకి మొహంవాచిపోకుండా చూడటానికి అది సరిపోతూనేవుంది. ఇంక దిగులెందుకు? అయినా ఆయన మాత్రం సంపాదించినదంతా కట్టుకుపోడుగా? కూడబెట్టున్నది పిల్లలకోసమేగా?

లాహిరికి పెళ్ళి చేయనిశ్చయించి ఈమధ్యే సంబంధాలు వాకబు చేస్తున్నాడు రాఘవయ్య. అతని పరిస్థితికి కాస్త భారీగా కట్నం ఇచ్చి ఓ మోస్తరు వరుణ్ణి తేలేకపోడు లాహిరికి. కాని స్వతహాగా ఉన్న పీనాసితనంకొద్దీ భారీగా కట్నం ఇవ్వడానికి అతనికి మనసొప్పడంలేదు. వీలైనంత తక్కువ కట్నంతో సాధ్యమైనంత మంచి సంబంధం తేవాలని తాపత్రయం!

కాని అవ్వా కావాలీ బువ్వాకావాలీ అంటే ఎలా కుదుర్తుందీ? అందుకే లాహిరి పెళ్ళి విషయం ఇంకా సంబంధాలు వాకబు చేయడం దగ్గరే ఉండిపోయింది తప్ప... అంత కుమించి ముందుకు జరగలేదు. అదీగాక లాహిరి పెళ్ళికి అప్పుడే ఏమంత తొందరొచ్చిందిలే అన్న తాత్సారం కొంత.

బంటూ మూడో తరగతి చదువుతున్నాడు. ఇంగ్లీషు మీడియంలో చదివిస్తే ఫీజులెక్కువని తెలుగు మీడియంలో చేర్పించాడు రాఘవయ్య. ఏదో అయిష్టంగా బడికి వెళ్ళొస్తుంటాడే తప్ప...ఇంటి దగ్గర మాత్రం వీడు పుస్తకం ముట్టిన పాపాన పోడు. పద్దాకా అల్లరే! అంతూ పంతూ లేని అల్లరి!!

రాఘవయ్య దంపతులకు మొదట్లో చాలా కాలం దాకా-సుమారు పెళ్ళయిన పదిపన్నెండేళ్ళ వరకూ-సంతానం కలగలేదట. ఇంక తమకా ప్రాప్తం లేదేమోలే అనుకుంటున్న తరుణంలో లాహిరి అనుకోకుండా పుట్టేసిందట! ఆమె తర్వాత ఇంకెవరూ పుట్టకపోవడంతో తమకా ఆడపిల్ల ఒక్కర్తే ప్రాప్తం కాబోలనుకుంటున్న తరుణంలో-పదేళ్ళ గ్యాప్ తర్వాత-బంటూగాడు కూడా అనుకోకుండానే పుట్టేశాడట! మనవళ్ళ నెత్తుకోవాల్సిన వయసులో వాళ్ళకి ఎనిమిదేళ్ళ కొడుకుండడానికి కారణం అదే!

ఇలా ఆ కుటుంబం గురించి అనేకానేక విషయాలు తెలుసుకోగలిగాడు హరిశ్చంద్ర.

కాని లాహిరి ఆంతర్యాన్ని మాత్రం తెలుసుకోలేకపోయాడు. అడపాదడపా తనని చూసి చిరునవ్వులొలికిస్తున్నది గనుక తనకు మల్లే ఆమె మనసులో కూడా ఏదో అలజడి ప్రారంభమయ్యే వుంటుందనుకున్నాడు. అంతేగాని ఆమె ప్రముఖ రచయిత్రి రాంబాయమ్మగారి అభిమాని అని...ఆమె నవలల్లోని హీరోల్లాంటి వాళ్ళు తప్ప తనలాంటి సామాన్య అల్పమానవులు ఆ జవ్వని హృదయంలో చోటుచేసుకోవడం మాట అటుంచి కనీసం వేలయినా పెట్టలేరని...అతను ఊహామాత్రంగానైనా గ్రహించలేకపోయాడు.

అందుకు నిదర్శనం-రాంబాయమ్మగారి నవలలన్నిట్నీ బాన్ చేసి పారేయాలంటూ అతనింత వరకు ఏ ఉద్యమాన్నీ స్టార్ట్ చేయక





పోవడమే!

లాహిరి కూడా తనని ప్రేమిస్తూండకపోతే రోజూ తన కలల్లోకి వచ్చి ఎందుకంతగా కవ్విస్తుందీ? అనుకున్నాడే తప్ప...తనలాంటి ప్రేమకీటకాల విషయంలో అలా జరగటం సర్వసాధారణం అన్న విషయాన్ని అతను గ్రహించలేకపోయాడు. తన కలల్లోకి ఆమె రావడం-కేవలం తన పరంగా జరుగుతున్న అసంకల్పిత చర్య మాత్రమే అన్న నిజాన్ని అతను గుర్తించలేకపోయాడు.

అంచేతే అతనా రోజు శ్రీకారం చుట్టాడు.

దేనికి?

ఓ అందమైన ప్రేమలేఖకి.

'నా ప్రాణేశ్వరీ!

మిమ్మల్ని వారం నుండి చూస్తున్నాను. మీ అందమైన హృదయమూ, మీ అందమైన రూపమూ, మీ అందమైన లావణ్యమూ నన్నెంతగా ఆకర్షించాయీ అంటే—

మిమ్మల్ని జీవిత భాగస్వామిని చేసుకో కుంటే నా జన్మ వ్యర్థం అన్న నిశ్చయానికి వచ్చేశాను.
...అంతగా ఆకర్షించాయి.

తొలిసారిగా మిమ్మల్ని ఏ ఘడియలో చూశానో ఆ ఘడియలోనే నా అందమైన హృదయాన్ని...అవును నాదీ అందమైన హృదయమే...మీ కంకితం చేసేశాను.

కాబట్టి మన అందమైన హృదయాలు రెండూ ఒక్కటిగా పెనవేసుకుపోవాలని నా ఆకాంక్ష.

మీ అందమైన హృదయంలో ఈ దీనుడికి కాస్త చోటివ్వరూ?...ప్లీజ్!

ఇవ్వకుంటే నా జీవితం అంధకారబంధురమే! బహుశా నేను జీవించకపోవచ్చు కూడా.

నాకు ప్రేమలేఖలు వ్రాయడంలో ఎక్స్‌పీరియన్స్ లేదు. ఇదే మొదటిసారి. సాధ్యమైనంత అందంగా రాయాలన్న తపనకొద్దీ అందం అనే పదాన్ని ఎక్కువసార్లు వాడాను. మీలాంటి అందమైన అందగత్తె అందమైన హృదయంలో చోటు సంపాదించుకోవాలి అంటే—ప్రేమలేఖ అందంగా వుండాలి కదా మరి!

ముఖ్యమైన గమనిక—

బాల్‌పెన్‌కి కొత్తస్ప్రింగు కొనేసుకున్నాను. కాబట్టి మీరింక ఆ విషయంలో ఆందోళన చెందకండి.

ఇక ఉంటాను.

మీ సమాధానం కొరకు నిరీక్షిస్తూ...

మిస్టర్ ఎక్స్'

రాయడం ముగించాక...అందంగా కుదిరిందో లేదోనని ఓ మారు చదివి చూసుకున్నాడు.

మరీ అందంగా ఉన్నట్టనిపించకపోయినా-'ఫర్వాలేదు...నాట్‌బేడ్' అనిపించింది.

అయినా ఇదే కదా మొదటిసారి. ప్రస్తుతానికి ఆమె దీన్ని ఏక్సెప్ట్ చేస్తే ముందుముందుకి ఇంకా ఇంప్రూవ్ చేసుకోవచ్చు.

సరే...రాయడమైతే ఎలాగోలా రాసేశాడు. బట్ దీన్ని ఆమెకు అందజేయడం ఎలా?

సాయంత్రం కిటికీలోంచి ఉండచుట్టి అవతలకి విసిరి తీసుకోమన్నట్టుగా ఆమెకు సైగచేస్తే?

ఛఛ బావుండదు. ఇంత అందమైన ప్రేమలేఖని అందమైన పద్ధతిలో అందివ్వాలేగాని...బిచ్చగత్తెకు ముష్టివేసినట్టు అలా విసిరేయడం చాలా అసహ్యంగా ఉంటుంది.

పోనీ దగ్గరకు పిలిచి నేరుగా అందజేస్తే?

బానే ఉంటుందిగాని తన మొహానికి అంత ధైర్యం కూడానా? అదీగాక నేరుగా అందజేస్తే ప్రేమలేఖలకి సరియైన రెస్పాన్స్ ఉండదని ఎక్కడో చదివినట్టు గుర్తు.

ఇహ పోతే-

ఏ చాక్లెటో చేతబట్టి, ఎవ్వరూ చూడకుండా మీ అక్కయ్య కివ్వరా, అంటూ బంటూ కివ్వొచ్చు.

కాని ఏమో... వాణ్ని నమ్మేదానికి లేదు. వాడసలే డేంజరస్ ఫెలో!

అంతలో చటుక్కున తన ఆలోచనలు తప్పుడు గాడిలో పయనిస్తున్నట్టు తెలుసుకున్నాడు హరిశ్చంద్ర.

ఒకవేళ ఆమె ఆ ఉత్తరాన్ని చదివి కోప

గించుకుని నానా రభసా చేస్తే- అంటే పెద్దవాళ్లకి చెప్పి తన్నించబోవటాలూగట్రా—

అదే జరిగితే, ఇది నేనుకాదు రాసిందని దబాయించొచ్చునే కదా తను మిస్టర్ ఎక్స్అని సైన్ చేస్తే?

మరలాంటపుడు నేరుగానో, ఆమె తమ్ముడి ద్వారానో అందజేయాలనుకోవడంలో అర్థమేముంది?

"ఛిఛీ... అర్థంలేని బుద్ధితక్కువ వెధవా! ఇంత మట్టి బుర్రేంట్రానీది?!" తిట్టుకున్నాడు తననితానే.

అంతలో ఆపద్బాంధవుడిలా బంటూ వచ్చాడు... "ఈ వారం వీక్లీ వుంటే మా అక్కయ్య అడిగి పట్రమ్మంది" అంటూ

"వీక్లీ ఏమిటోయ్ నీ బొంద? దానికి పేరు లేదా?"

"ఇదిగో బొందాగిందా అంటే ఊరుకోను. మాటలు కాస్త మంచిగా రానివ్వండి..." గుర్రుగా చూశాడు గుంటవెధవ.

"సారీనోయ్... వెరీవెరీ సారీ. వీక్లీ అంటే నాకెలా అర్థమవుతుంది మరి? దయచేసి డేష్ పూర్తి చెయ్..." దీనంగా అన్నాడు హరిశ్చంద్ర.

ఆఫ్టరాల్ ఓ గుంటవెధవ ముందు ప్రతి



సారీ తానిలా దీనంగా అయిపోవాల్సి రావడం కాస్త బాధగానే అనిపించినా... ఏంచేయగలడు మరి?

"ఏమో నాకు సరిగ్గా గుర్తులేదు.. ప్రభను కుంటా... కాదు భూమనుకుంటా... కాదు కాదు జ్యోతనుకుంటా... కాదు కాదు కాదు పత్రి..."

"ఛీ నోర్మూయ్!"

"ఏంటీ నన్నేనా మీరన్నది?" బంటూ కళ్ల లోంచి నిప్పులు కురుస్తున్నాయ్.

"ఛఛ... నిన్నెందుకంటానోయ్ అంత మాట? అదుగో విను... ఇంకా బుద్ధిరాలేదు దానికి..."

"భౌ... భౌ.... భౌ..." ఎక్కడో దూరంగా కుక్క మొరుగుతున్న శబ్దం. చెవులు రిక్కించి బహు శ్రద్ధగా ఆ మొరుగుడ్ని ఆలకించిన బంటూ- "ఐతే నన్ను కాదన్నమాట!" అన్నాడు అదోలా తలెగరేస్తూ.

"కాదన్నమాటేగా మరి!" అన్నాడు హరి శ్చంద్ర- "టోకరా తిన్నావురా బిడ్డా" అని మనసులో అనుకుంటూ.

"పటప్"

ఖంగుతిన్న హరిశ్చంద్రకి కాసేపట్లోనే తెలి సిపోయింది- టోకరా తిన్నది వాడు కాదు తనేనని.

"నాకే మస్కా కొట్టాలని చూడబోకండి. పాపం అదెక్కడో మొరుగుతుంటే దాన్ని నోర్మూయ్ అనాల్సిన పనేమొచ్చింది మీకు? నేనేం వెర్రోణ్నికాదు. నాకు తెలుసు మీరు నన్నే అన్నారు!"

బంటూ కరాటే ఫోజు పెట్టి ఒక్కొక్క అడుగే ముందుకేస్తుంటే...

భయంభయంగా ఒక్కొక్క అడుగే వెనక్కి వేస్తూ దీనాతిదీనంగా అన్నాడు హరిశ్చంద్ర. ఒట్టు బంటూ! నాకు కుక్క అరుపంటే మహా చెడ్డ ఎలర్జీ! అదేంటో గాని నా చిన్నప్పట్నుంచీ అంతే! ఎక్కడైనా కుక్కగాని మొరిగిందటే ఛీ నోర్మూయ్ అని అనకుండా ఉండలేను. అది నా వీక్‌నెస్సు. ప్లీజ్ బంటూ! నన్ను నమ్ము..."

"నమ్మమంటారా?"

"అనటంకాదు... ప్రాధేయపడుతున్నా ను..."

"ప్రాధేయపడటం అంటే ఇలాగేనా? చేతు లూ, గడ్డమూ పుచ్చుకుని బతిమాలాలిగానీ?"

"అవుననుకో... కాని నువ్ నాతో పోలిస్తే చాలాచాలా చిన్నవాడివి కదా? నీ ముందు నేను మరీ అంత ఏబ్రాసిలా ప్రవర్తిస్తే బావుండదు కదా?"

పళ్ళు బిగువున అతి కష్టంమీద కోపాన్ని నిగ్రహించుకుంటూ సాధ్యమైనంత సౌమ్యంగా చూశాడు హ[illegible]్ర.

"సర్లే. [illegible]ంచానుపో" అన్నట్టు ఓ కొంటె చూపు [illegible]... "ఊఁ ఇవ్వండి..." అన్నాడు బంటు[illegible].

"ఎలాఇవ్వను?..."

"ఎలాగేమిటి- చేత్తో ఇవ్వండి..."

"ఆపాటి నాకూ తెలుసులేవోయ్... కానీ నువ్ డేష్ సరిగ్గా పూర్తి చేయన్దే మీ అక్కయ్యెడిగింది ఏ వీక్లీనో నా కెలా తెలుస్తుంది?"

"ఉండండైతే మా అక్కయ్యనడిగి మళ్ళీ ఇప్పుడే వస్తా!" తూనీగలా పరుగుతీశాడు బంటూ.

అబ్బ... వీడితో ఓ ప్రాణసంకటమైపో యింది! ఎలా పుట్టేడో వెధవ!!

పళ్ళు నూరుతూ కసిగా అనుకున్నాడు హరిశ్చంద్ర.

"ఎందుకలా పళ్ళుపటపటలాడిస్తున్నా రు?" అతని కేసి ఆశ్చర్యంగా చూస్తూ అడిగా డు బంటూ.

"అరెఁ... నువ్వింకా వెళ్లనే లేదా?"

"వెళ్లకపోవడమేంటి... వెళ్ళాను... వచ్చేశా ను కూడా"

హరిశ్చంద్ర అనుమానంగా వాడికాళ్ళవేపు చూశాడు కాళ్ళకి చక్రాలుగాని వున్నాయేమో నని.

ఊహుఁ... చక్రాలూ లేవు, పాడూలేవు.

"చిన్నప్పుడు పాలకు బదులు పెట్రోలు తాగుంటాడు వెధవ" అనుకుని... "ఊఁ... ఇంతకీ కనుక్కొనొచ్చావా?" అన్నాడు జేబు లోని ప్రేమలేఖని ఆప్యాయంగా తడుము కుంటూ.

"ఏంటి కనుక్కునిరావడం?"

రపీమని నెత్తిమీద బాదుకున్నాడు హరిశ్చంద్ర.

"ఏంటా? నా బొంద! ఇంతకీ నువ్ బైటికెళ్లి చేసిందేంటి?"

"ఒంటేలు పోసుకొనొచ్చా! సారీ అండీ... అర్జెంటుగా ఒంటేలొచ్చేసరికి మా అక్కయ్యా దగ్గరకెళ్ళాలన్న సంగతి మర్చేపోయాను. పోనీ ఇపుడు మళ్ళీ వెళ్ళి రమ్మంటారా?"

"ఏంఅక్కర్లేదులే! వీక్లీలు ఏమేమైతే వున్నాయో అన్నీ ఇస్తా... తీస్కెళ్ళి ఇవ్వు మీ అక్కయ్యకి..."

తన దగ్గరున్న ఆవారపు వీక్లీలన్నీ ఒకదాని మీద ఒకటి పేర్చి బంటూ కందించాడు హరిశ్చంద్ర. "జాగ్రత్త... అది గాని మధ్యలో జారిపడిపోతుందేమో! మళ్ళీ ఎవరికైనా దొరికితే ప్రమాదం..." అన్నాడు అందించాక.

బంటూ అనుమానంగా చూశాడు. కూస్తా కాస్తా అనుమానంగా కాదు; చాలా చాలా అనుమానంగా. "దేన్నిగురించి మీరు చెబుతుంట? అరెరె... మీ నోట్లోంచి ఆ రక్తమేంటీ?"

"నాలుక్కరుచుకున్నాన్లే..." నిజమే చెప్పాడు హరిశ్చంద్ర. నోరుజారి అలా అనేశాక 'అద్దేద్దే ఎంత పనైందబ్బా' అని అతను నాలుక కరుచుకున్నమాట నిజమే! దాని ఫలితమే ఆ రక్తం.

"అంతేనా? లేక మీగ్గాని కేన్సరా?"

"నరికి పోగుపెడతానొరేయ్!"... హుఁ... ఏమిటో... ఆఫ్టరాల్ పదకొండు అక్షరాలున్న ఈ చిన్నవాక్యాన్ని కూడా పైకిఅనే స్వాతంత్ర్యంలేని వెధవ బతుకైపోయింది! అనుకుని దీర్ఘంగా నిట్టూర్చి!

"ప్రతిదానికీ నీకు తొందరే! జీవితంలో ప్రతిదానికీ ఇంత తొందర పనికిరాదు బంటూ! కేన్సరైతే ఇలా కొంచెం రక్తంకారదు. భళ్ళుభళ్ళున కక్కుతుంటారు... ఆఁ..." అన్నాడు హరిశ్చంద్ర.

"అవునవును... నేను కూడా చాలా సినిమాల్లో చూశాలే! అద్సరే... ఇందాకేదో... జాగ్రత్త... పడిపోతుందేమో ... ప్రమాదం... అన్నట్టున్నారే? దేన్ని గురించి?!"

కొంపదీసి వీడుగాని చూసే నాటకమాడుతున్నాడా?- తానా ఉత్తరాన్ని వీక్లీలలో ఒకదానిలో పెట్టడం?!

అబ్బే చూసుండడు. చూసుంటే ఇంత అమాయకంగా అడగడు... తనకు తానే నచ్చచెప్పుకుని-

"అబ్బే... ఏంలేదు బంటూ, ఏం లేదు..." అన్నాడు హరిశ్చంద్ర.

"ఏంలేకపోవడమేంటి?... ఏదో వుంది కథ!"

మూతి పగిలేలా కొట్టాలనిపించి చేయిపైకెత్తాడుగాని... "కొట్టకు వాడు లాహిరి తమ్ముడు...కొట్టకు వాడు లాహిరి తమ్ముడు... కొట్టకు వా..." అని అంతరాత్మ హెచ్చరించడంతో- పైకెత్తిన ఆ చేత్తో బుర్రనుగీరుకుంటూ అసహాయంగా నవ్వేశాడు.

"కథా నాబొందా? అలాంటిదేం లేదు. అసలెలాంటిదీ లేదు..."

"మరైతే ఎందుకు చెప్పారలా?"

"నోరు కొవ్వెక్కి..." అనబోయి తమాయించుకున్నాడు హరిశ్చంద్ర. "ఏమో... నాకూ తెలియదు... అన్నట్టిదివరకోసారి చెప్పేగా- ఒక్కోసారి నాకు మైండ్ సరిగ్గా పన్జేయదనీ, పిచ్చిపిచ్చిగా వాగుతుంటాననీ..."

"అయితే ఇందాక మైండ్ సరిగ్గా పన్జేయక అలా అన్నారన్నమాట?"

"అవును..." కడుపు రగుల్తున్నా కంఠంలో మాత్రం శాంతాన్నే ధ్వనింపజేశాడు హరిశ్చంద్ర.

"మీరు చాలా బీదవాళ్ళా?"

"చాలా కాదు. కొంచెమే బీదవాణ్ణి... ఏం?"

"మైండ్ సరిగ్గా పన్జేయకపోయినా డాక్టర్‌కి చూపించుకోవట్లేదుగా... అందుకని..."

"ఇప్పుడేంకాదు... బాగా ముదిరేక చూపించుకుంటాను..."

హరిశ్చంద్ర మెంటల్‌గా ప్రిపేరైపోయాడు- వాడు తనని పిచ్చివాడనుకుంటే అనుకోనీ లెమ్మని.

"ముదరటం అంటే వీధుల్లో పిచ్చివాళ్ళు తిరుగుతారు చూడండీ... మీరు కూడా అలాగైపోయాకా?"

''అవును...''

''భలేభలే... అలాంటి పిచ్చివాళ్ళని చూస్తే భలే నవ్వొస్తుంది!...మీరు కూడా అలా అయి పోతే భలే బావుంటారు...''

''అవును...''

''అన్నట్టు మీకంత పిచ్చెక్కాక మీరు కూడా కాయితాలూగట్రా ఏరుకుంటారా? రాళ్ళూగ ట్రా విసుర్తారా అందరిమీదకీ?''

''ఎందుకువిసర్నూ? పిచ్చి అన్నాక అందరి కీ ఒకటే! అంతేకాదు నీసైజు పిల్లల్ని పట్టు కుని గొంతుకూడా పిసుకుతాను...''

హరిశ్చంద్ర మాట పూర్తిచేసేసరికి బంటూ అక్కడ లేడు. ''భగవంతుడా! నువ్ నిజంగా భగవంతుడివే!'' అనుకున్నాడు హరిశ్చంద్ర.

''నిన్నందరూ దీనజనబాంధవుడని ఎందు కంటారో నాకిప్పుడు తెలిసింది...'' అని కూడా అనుకున్నాడు హరిశ్చంద్ర.

బంటూ ఉడాయింపుకి కారణం తన మాటలే అన్న పచ్చినిజం ఆ క్షణంలో అతనికి తట్టనేలేదు.

★ ★ ★

''ఎందుకండీ అలా నిప్పులు తొక్కిన కో తిలా చిందులేస్తున్నారు? ఏం రాశాడేంటివా డు?'' భర్త కేసీ, భర్త చేతిలోని ఉత్తరంకేసీ మార్చిమార్చి చూస్తూ అడిగింది సావిత్రమ్మ.

''ఒళ్ళు కొవ్వెక్కి కొట్టుకుంటున్నాడు...'' అన్నాడు అచ్యుతరామయ్య పళ్ళు నూర్తూ.

''అబ్బ సరిగ్గా చెప్పండీ! ఏంరాశాడు?''

''ఏంరాస్తాడు? నా నెత్తికి ఆవదం రాస్తాడు''

''హుఁ... మీదంతా డొంకతిరుగుడే! ఏంరా శాడో చెప్పమంటుంటే...'' ఒకింత విసుగ్గా చూ సింది సావిత్రమ్మ.

''ఆ దొరగారికి కల్పలత పనికిరాలేదట! ఉరి పోసుకుని చావనైనా చస్తాడటగాని ఆ అమ్మాయిని చేసుకోడట...''

''ఏం... ఎవర్నయినా ప్రేమించాట్టనా?''

''ఏమో ఎవడికి తెలుసు? ఇప్పుడిప్పుడే పెళ్ళిచేసుకునే ఉద్దేశం లేదట దొరగారికి...'' అంటూ పుత్రరత్నం ఉత్తరం యొక్క సారాంశా న్ని వివరించాడు అచ్యుతరామయ్య.

''పోనీలెండి... వాడికిష్టం లేనపుడు మనమేం చేయగలం?'' అంది సావిత్రమ్మ. ఆమె ఎప్పుడూ కొడుకు పక్షమే! కల్పలతను కోడలిగా చేసుకోవాలని ఆమె ముచ్చట పడ టంలోని నిజం అంతంతమాత్రమే! ప్రత్యే కించి కల్పలత అంటే ఆమెకు అభిమానమూ లేదు. అలాగని అయిష్టతా లేదు.

''నువ్ నోర్మూయ్'' అన్నాడు అచ్యుతరామ య్య చేతిలోని ఉత్తరాన్ని వుండగా చుట్టి నేలకేసి కొడ్తూ- ''నాలుగెకరాల పొలమూ... నలభైవేలు క్యాషూ...'' అంటూ అతనింకా ఏదో అనబోతుంటే మధ్యలో అడ్డు తగిలింది సావిత్ర మ్మ-

''చాల్లే వూరుకోండి! డబ్బుదేముంది? అయినా ఆపాటి కట్నం వాడికెవరైనా ఇస్తా రు...''

''ఇస్తారుసరే... కానీ ఈలోగా ఈవెధవ పును క్కున ఎవర్నైనా ప్రేమించేస్తేనో?''

''వాడిమొహం... వాడి కలాంటి ఆలోచ నలేం రావులెండి... అయినా వాడికి మాత్రం బాధ్యత తెలియదా? వాడికొచ్చే కట్నంతో తప్ప మనం రాగిణి పెళ్ళి చేయలేమని వాడికీ తెలుసు. వాడలాంటి అవకతవక పనులేం చేయడులెండి...''

''ఒకవేళ చేస్తే?''

''చేయడంటున్నాగా? వాడి మీద నాకా నమ్మకముంది...''

''నీకు నమ్మకం వుండగానే సరిపోదు... వాడి బుద్ధివక్రం కాకుండా వుండాలి... అదీ ముఖ్యం!''

''సరేలెండి... అయినా మనంమనం ఇలా నంజుడు గుంజుడు అవ్వడందేనికి? ఓసారి రమ్మని రాయండి... వాడినే నేరుగా అడిగితే సరి...''

''అడగటం కాదు... పిచ్చిపిచ్చివేషాలేస్తే పళ్ళురాల్తాయని స్ట్రిక్ట్‌గా వార్నింగిస్తాను... ఆఁ...'' అంటూ హుంకరించాడు అచ్యుతరా మయ్య.

''ఏదో ఒకటి చేయొచ్చుగానీ... ముందు వాణ్ణి రానీయండి...'' అంది సావిత్రమ్మ.

''ఇదిగో ఇప్పుడే రాసి పడేస్తా...'' అని




# సంగీత స్వర లహరి వింటూ సమయం గడపండి






భారతదేశంలో మ్యూజికల్ గడియారాల తయారీలో ప్రథములు

# Ajanta® QUARTZ

the touch of tomorrow's technology

రిజిస్టర్డు ఆఫీసు:
పృథ్వీరాజ్ ప్లేస్, పో. బా. నం.: 116
మోర్వి 363 641
ఫోన్లు: 3627, 2280, 2457, 2433
టెలెక్స్: 0167-212 ATCM
గ్రామ్: VANITHA









అన్ని ప్రముఖ దుకాణాలలో లభ్యం.

హెచ్చరిక: మా గడియారాలన్నిటిపైన "అజంతా" గుర్తు చూడండి. నకిలీలను గురించి జాగ్రత్త పడండి.

KPS/AM/9-89-TEL

వెంటనే పోస్టాఫీస్‌కేసి దారి తీశాడు అచ్యుతరామయ్య.

"ఏంటమ్మా నాన్నేదో గట్టిగట్టిగా కేకలేస్తున్నారు?" అడిగింది అప్పుడే అక్కడికొచ్చిన రాగిణి.

సంగతి చెప్పింది సావిత్రమ్మ.

"బాగారాశాడు... లేకపోతే ఏంటమ్మా? ఆ వళ్ళుదయ్యానికీ అన్నయ్యకీ పోలికేంటి? అన్నయ్యకి ఏవిధంగానూ సరిపోదు..." హరిశ్చంద్రనీ కల్పలతనీ మనసులో పోల్చి చూసుకుంటూ అంది రాగిణి.

"అందందేముందిలేగాని... మొత్తానికి వాడికిష్టంలేనపుడు బలవంతంగా చేయలేంగదా! ఆ మాటే అంటే మీనాన్నగారు విరుచుకుపడుతున్నారు..." నిట్టూర్చింది సావిత్రమ్మ. "మీ అన్నయ్యగాని ఎవర్నయినా ప్రేమించేస్తాడేమోనని మీ నాన్నగారి భయం..."

"ఏం- ప్రేమిస్తే తప్పా?"

సావిత్రమ్మ కూతురివేపు కాస్త అనుమానంగా చూసింది. "అదేంటే అంతలా వత్తాసు వలుకుతున్నావ్?... కొంపదీసి నువ్ కూడా ఎవర్నయినా..."

"ఛీ... పోమ్మా" అంది రాగిణి చిరుకోపంగా. "నేనలాంటి పాడు పనులేం చేయన్లేగాని... 'నువ్ కూడా' అంటున్నావ్ గదా; అంటే అన్నయ్య ఎవర్నయినా ప్రేమించే వుంటాడనా నీ ఉద్దేశం?"

"ఏమో మరి..." నిట్టూర్చింది సావిత్రమ్మ.

"ఎందుకే అయిందానికీ కాన్దానికీ అలా నిట్టూరుస్తావ్? ఒకవేళ ప్రేమిస్తే ప్రేమిస్తాడు... ఇపుడేవిటంట?"

"ఏవిటా... ఏం-నీకు పెళ్ళిచేసుకోవాలని లేదా?"

"దానికీ దీనికీ ఏమిటీ సంబంధం?"

"లేకేం ... వాడెవర్నయినా ప్రేమిస్తే దమ్మిడీ కట్నంరాదు. వాడికేదో కట్నమొస్తే దాంతో నీ పెళ్ళి చేయాలని మా ఉద్దేశం. అలాంటిది వాడు కట్నం తీసుకోకుండా ఎవర్తెనో ప్రేమించి పెళ్ళిచేస్తే ఇంక నీపెళ్ళెలా అవుతుందే పిచ్చి మొహమా?" విడమర్చి చెప్పింది సావిత్రమ్మ.

"అవ్వకపోతే పోనీ" అంటూ నిర్లక్ష్యంగా తలెగరేసి వెళ్ళిపోయింది రాగిణి. "ఇంకా పసితనం పోలా..." అనుకుని నిట్టూర్చింది సావిత్రమ్మ ఆమె వెళ్ళిన దిక్కు చూస్తూ.

★ ★ ★

"ప్రేమికులారా చావకండి" సీరియల్ చదువుతుండగా కళ్ళబడింది లాహిరికా ఉత్తరం.

సంబోధనలో తన పేరుగాని కింద హరిశ్చంద్ర సంతకంగాని లేకపోయినప్పటికీ... స్పష్టంగా తెలుస్తూనే వుంది అది తనకే రాయబడిందనీ, రాసింది అతనేననీ.

ఒళ్ళుమండిపోయింది లాహిరికి. ఒంటిమీద తేళ్ళూ, జెర్రులూ పాకుతున్నట్టు కూడా అనిపించింది.

"అమ్మభడవా! ఎంత ధైర్యం నీకు!"అనుకుంటూ పటపటా పళ్ళునూరింది.

"ఉండు నీపని చెప్తా" అనుకుంటూ విసురుగా లేచి నిలబడింది.

"నాకు... నువ్వు... ఆఫ్టరాల్ నువ్వు... లొలెటర్ రాయడమా? కనీసం స్కూటరైనా లేని నీ మొహానికి ప్రేమా? ఏదో దిక్కుమాలిన బ్యాంకులో బోడి గుమస్తా ఉద్యోగం చేసుకునే నీకు నా హృదయంలో చోటివ్వడమా? ఆగాగు చూపిస్తా నా తడాఖా" అనుకుంటూ రయ్ఁరయ్ఁన దూసుకెళ్ళింది హరిశ్చంద్ర రూమ్ కేసి.

తలుపు మూసివుంది ఈమె వెళ్ళేసరికి.

దబదబా శక్తికొద్దీ బాదింది తలుపుమీద.

"ఆ వచ్చె వచ్చె..." అంటూ తలుపు తీసిన హరిశ్చంద్ర- ఎదురుగా ఈమెను చూసి తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు.

అవునా కాదా అని ఓ మారు కళ్ళు నులుముకుని చూశాడు. కళ్ళు నులుముకున్నాక కూడా కళ్ళెదుట లాహిరే వుండటంతో సందేహం లేదు వచ్చింది లాహిరే అనుకున్నాడు.

"రండ్రండి... ఏంటి నామీద ఇంత దయ కలిగింది?" అన్నాడు పక్కకు తొలగుతూ.

"ఏమీ ఎరగనట్టు ఎంత అమాయకంగా మాట్లాడుతున్నాడో చూడు!"- అనుకుంది




లోలోన లాహిరి. అంటే- ఏదో సింపుల్‌గా అనేసుకోవడం కాదు... చాలా కసిగా.

"అబ్బే ఏంలేదండీ... నేనడిగినపుడల్లా విసుక్కోకుండా మా తమ్ముడితో వీక్లీలు పంపుతున్నారుగా... అందుకు థాంక్స్ చెప్పి పోదామని..." అంది ముఖం మీద నవ్వు పులుముకుంటూ.

"భలేవారే! దానికి మీరింత శ్రమపడి రావాలా? ఇటీస్ మై డ్యూటీ..." ఆనందంతో మెలికలు తిరిగిపోయాడు హరిశ్చంద్ర.

"మీకు ఆడపిల్లలంటే తగనిసిగ్గా?"

"అబ్బే అలాంటిదేం లేదండీ..."

"మరైతే ఎందుకలా మెలికలు తిరిగిపోతున్నారు?"

"ఓస్ అదా... అదీ... అదీ... ఆనందంతో..."

"ఆనందంతో అయితే ఎవ్వరూ మెలికలు తిరిగిపోరు... సిగ్గుతో అయితే మెలికలు తిరిగిపోతారు... ఆనందంతో అయితే...."

"ఊ... ఆనందంతో అయితే?"

"కప్పలా ఉబ్బిపోతారు..."

"అయితే నన్ను కూడా ఉబ్బిపోమంటారు కప్పలా... సరే... ప్రయత్నిస్తానుండండి..."

హరిశ్చంద్ర కప్పలా ఉబ్బిపోయేందుకు ప్రయత్నిస్తుండగా కస్సుమన్న శబ్దం వినిపించింది.

"అరెౕ ... అదేంటండీ తాచుపాములా కస్సుమంటున్నారు? మీరిలా బెదిరిస్తే నేను కప్పలా ఉబ్బనంతే!"

"పటప్!"

"అరెౕ... ఎందుకండీ అంతకోపం? ఇప్పుడు నేనేవన్నాననీ?" అమాయకంగా చూశాడు హరిశ్చంద్ర.

"వాటీస్ దిస్?"- లాహిరి చేతిలో రెపరెపలాడుతున్న అందమైన ఆ ప్రేమలేఖను చూడగానే గుండె గుభేలుమంది హరిశ్చంద్రకి. "ఏమోనండీ! మొత్తానికి ఏదో ఉత్తరంలా వుంది..." అన్నాడు అంతకు ముందెప్పుడూ దాన్ని చూడని వాడిలా దానికేసి చాలా ఆశ్చర్యంగా, విచిత్రంగా చూస్తూ.

నిజానికి అంతవరకూ అతనా ధ్యాసలో లేనేలేడు. తాను లాహిరికో అందమైన ప్రేమలేఖ రాశాడన్న విషయమైతే గుర్తుందిగాని... దాని పర్యవసానమే ఇప్పటి లాహిరి రాక అని అతనెందుచేతనో అనుకోలేకపోయాడు. బహుశా లాహిరిని చూడగానే అతని మతి గతి తప్పడం అందుక్కారణం కావచ్చు.

"అబ్బ... ఏంనటన... ఏంనటన?"

"నన్నేనాండీ అంటున్నారు?"

"మిమ్మల్నిగాక? హుఁ... నాకిలాంటివంటే నచ్చవ్... మీరేదో మర్యాదస్తులనుకుని ఆ వామన్రావ్‌గారి మాట నమ్మి మా నాన్నగారు మీకు రూమిస్తే ఇలాంటి పన్లా చేస్తారు?"

లాహిరి ముక్కుపుటాలు రోషంతో ఎగిరిపడుతూండటం గమనించి, ఇదేంటబ్బా వ్యవహారం ఇలా బెడిసికొట్టేసిందని లోలోన మధనపడిపోతూ-

"మీరేవంటున్నారో నాకర్థంకావట్లేదండీ... నాకు తెలిసి నేనే వెధవపన్లూ చేయలేదే?" అన్నాడు హరిశ్చంద్ర.

మింగేసేలా చూసింది లాహిరి అతనికేసి. "ఇది వెధవపనిగాక మంచిపనా?" అంది కుడిచేతిలోని అందమైన ఆ ప్రేమలేఖని వింజామరలా ఊపుతూ.

తప్పదు... బుకాయింపు ఒక్కటే మార్గం... అనుకున్న హరిశ్చంద్ర- "అబ్బే మీరేవంటున్నారో నాకిప్పటికీ అర్థంకావట్లేదండీ..." అన్నాడు మరింత అమాయకంగా కనిపించేందుకు నోట్లో వేలు పెట్టేసుకుంటూ.

అతనివేపు అసహ్యంగా చూసింది లాహిరి.

"మీరు వేలు చీక్కున్నంత మాత్రాన మిమ్మల్ని అమాయకులనేసుకోవడానికి నేనేం వెర్రిదాన్నికాను... మీ తాతల్లాంటి నటుల్ని చాలా మందినే చూశాను. బుకాయించాలని చూడకండి... ఇది... ఇది మీర్రాసింది కాదా?" అంటూ హూంకరించింది.

"ఏమోనండీ... కాదనుకుంటా నండీ..." తడపడిపోయాడు హరిశ్చంద్ర.

"అవునో కాదో మీ తడబాటే చెబుతుంది..." చీదరింపుగా చూసింది లాహిరి.

"ఛీ ... ఇంక తడబడకూడదు..." అని

గట్టిగా నిర్ణయించేనుకొని- కాదండీ. అది నేన్రా సింది కాదు... కానే కాదు- ఆఁ... తల్లితోడు.. ఆఁ'' అంటూ ఈసారి తొణుకూ బెణుకూ లేకుండా స్థిరంగా పలికాడు హరిశ్చంద్ర.

''ఛీ''

''మీరు ఛీ అనండీ ఛా అనండీ... నేను మాత్రం నిజమే చెప్పాను. నమ్మడం నమ్మకపో వడం మీఇష్టం''

''ఛీ''

''ఇంకో వందమార్లనుకోండి నాకేంటి నష్టం? అయినా ఈలోకం తీరే అంతలెండి... పాడు లోకం నిజం చెబితే నమ్మదు....'' పాడులోకంపై ఉద్భవించిన అసహ్యాన్ని ముఖంలో ప్రస్ఫు టింపచేయడానికి వ్యర్థ ప్రయత్నం చేస్తూ అన్నాడు హరిశ్చంద్ర.

''ఛీ''

''ఎందుకండీ అన్నిసార్లంటారలా? నోరు



నొప్పెట్టడం లేదా?''

''ఇంకో లక్షసార్లన్నా నాకు నోరు నొప్పెట్టదు. ఎందుకంటే నాకు అబద్ధాలాడే వాళ్ళంటే అంత అసహ్యం. మరి ముఖ్యంగా మీలా హరిశ్చంద్ర అని పేరుపెట్టుకుని కూడా అబద్ధాలాడేవాళ్ళంటే చచ్చేంత అసహ్యం.... ఇదివర



కోసారి మీలాగే సత్యమూర్తి అనే అబ్బాయి నాకో లవ్‌లెటర్ రాశాడు. చాలా ఇంప్రెసివ్‌గా రాశాడు! పోన్లే పాపమని నేను కూడా అతన్ని ప్రేమిద్దామనుకున్నాను. కాని ఇదిగో అచ్చం ఇలాగే... నేనా ఉత్తరాన్ని పట్టుకుని అతని దగ్గరికెళ్ళేసరికి... కేకలేయడానికి వచ్చానేమో అనుకుని- నేను కాదు రాసిందని దబాయించేశాడు. అంతే సత్యమూర్తి అన్న పేరు పెట్టుకుని కూడా అబద్ధమాడినందుకు నాకతనిపై చచ్చేంత అసహ్యం వేసింది. ఇలాంటి వెధవని చచ్చినా ప్రేమించకూడదనుకుని అతన్ని ప్రేమించడం మానివేశాను. ఊఁ.. ఇప్పుడు చెప్పండి... ఈ ఉత్తరం రాసింది మీరు కాదా?''

బ్రహ్మాండమైన బాణాన్ని ప్రయోగించింది లాహిరి-''నిజం చెప్పి నా అభిమానాన్ని పొందుతారో... అబద్ధమాడి నాతో అసహ్యించుకోబడతారో మీరే నిర్ణయించుకోండి...''

లాహిరి ఆమాట పూర్తిచేసేసరికి హరిశ్చంద్ర గుంజీళ్ళు తీస్తూ కనిపించాడు.

''అరెఁ... ఇదేంపనండీ?'' అంది ఆశ్చర్యంగా.

''నన్నాపకండి లాహిరిగారూ... నన్నాపకండి. చేసిన తప్పుకు నన్ను ప్రాయశ్చిత్తం చేసుకోనివ్వండి. ...మీరు అబద్ధద్వేషి అని తెలియక పుసుక్కున అబద్ధమాడేశాను. అందుకు నేనీ శిక్ష అనుభవించాల్సిందే. నిజానికి నా నాలుక తెగ్గోసుకున్నా తప్పులేదనుకోండి... కానీ నా రూమ్‌లో నైఫ్ లేదు... ప్లీజ్ నన్నాపకండి... దయచేసి నన్నాపకండి... ముప్పై ఏడూ... ముప్పై ఎనిమిదీ... ముప్పై తొ...'' అని రొప్పుతూ యమస్పీడుగా గుంజీళ్ళు తీసేయసాగాడు హరిశ్చంద్ర.

''చాల్లేగాని ఆపండి... ఎవరైనా చూస్తే నవ్వీపోతారు'' అంది లాహిరి నవ్వాపుకుంటూ.

''ఒద్దు... నన్నాపకండి... నలభైనాలుగూ... నలభై....''

''అరె...ఆపండి. మీకే చెప్పేది ఆపండీ'' అరిచించి లాహిరి.

''మీరు చెప్పేరు కాబట్టి ఆపేశాను... లేకపోతేనా?'' అంటూ గుంజీళ్ళు తీయడం ఆపేసి స్టైయిట్‌గా నిలబడ్డాడు హరిశ్చంద్ర. రొప్పు మాత్రం ఇంకా తగ్గలా.

''ఫర్వాలేదు ... బుద్ధిమంతుళ్ళానే ఉన్నాడు... ఇతన్ని గనక చేసుకుంటే కోతినాడించినట్టు ఆడించవచ్చు'' అనుకుంది లాహిరి.

కాని అంతలోనే ఆ ఊహ ఆమెకు నచ్చలేదు.

ఇతను ఆఫ్టరాల్ ఓ బ్యాంకు గుమాస్తా. ఇతన్ని చేసుకుని ఏంసుఖపడగలదు తను. మొగుడంటే రాంబాయమ్మగారి నవల్లోని హీరోలా ఉండాలే తప్ప... ఇలాంటి అల్పజీవులు మొగుళ్ళుగా ఉండేందుకు ఎంతమాత్రం పనికిరారు. ఇతన్ని చేసుకోవడం అంటే కోరి బురదగుంటలో కాలుపెట్టడమే!

హి ఈజ్ అన్‌ఫిట్!

కాని పాపం చూడ్డానికి చాలా తింగరమేళంలా వున్నాడు! గెట్‌టూట్ అని ఒకేసారి బెదిరించేయడంకన్నా తెలివిగా తప్పించడం మేలు!

లాహిరిలో ఓ ఐడియా రూపుదిద్దుకోబోతుండగా - ''మాట్లాడరేం లాహిరిగారు! నామీద ఇంకా కోపం పోలేదా?

నన్ను క్షమించలేరా!? క్షమించలేనంటే చెప్పండి. మళ్ళీ మొదలెట్టేస్తాను...'' అన్నాడు హరిశ్చంద్ర. అప్పటికతని రొప్పులు పూర్తిగా తగ్గి మనిషి బాగా కుదుటపడ్డాడు.

''ఏంటీ మళ్ళీ మొదలెట్టేది?''

''గుంజీళ్ళు...''

''చాల్లే వూరుకోండి. పశ్చాత్తాపాన్ని మించిన ప్రాయశ్చిత్తం లేదంటారు. మీరు మనస్ఫూర్తిగా పశ్చాత్తాపం చెందితే అదేచాలు...'' అంది సౌమ్యంగా లాహిరి.

''ఒట్టండి... నేను మనస్ఫూర్తిగానే పశ్చాత్తాపం చెందుతున్నాను...'' అన్నాడు హరిశ్చంద్ర.

''నమ్మమంటారా?'' అంది లాహిరి.

''ఒట్టంటున్నాగా?'' దీనంగా చూశాడు హరిశ్చంద్ర.

''దాందేముందిలేండి... ఇందాక ఏకంగా తల్లితోడని కూడా అబద్ధమాడేరుగా?''

''అది ఇందాకటిమాట! అప్పుడు నేను




పరివర్తన చెందని పాడుమనిషిని. కానీ... ఇప్పుడు..."

"ఊఁ ఇప్పుడు?" అంది లాహిరి - తానతన్ని ఏ ట్రాప్‌లో బిగిద్దామనుకుందో సరిగ్గా అదే ట్రాప్‌లో అతనికై అతనే పడబోతున్నందుకు లోలోన సంతోషిస్తూ-

"ఇప్పుడు నేను పరివర్తన చెందిన మనిషిని! అబద్ధం ఎంత హేయమైనదో గ్రహించిన మనిషిని! సత్యం ఎంతవిలువైనదో, ఎంత సుందరమైనదో, ఎంత ఆహ్లాదకరమైనదో, ఎంత ఉదాత్తమైనదో, ఎంత ఇదైనదో, ఎంత అదైనదో గుర్తించిన మనిషిని..." అంటూ ధీమాగా తలెగరేశాడు హరిశ్చంద్ర.

"ఎలావుంది నా భాషాపరిజ్ఞానం." అన్నట్టు కళ్ళతోనే ప్రశ్నించాడు తలెగరేయడం అయ్యాక.

"నా బొందలా వుంది" అన్నట్టు కళ్ళతోనే జవాబిచ్చి - "దట్స్‌గుడ్!" అంటూ ప్రశంసాపూర్వకంగా చూసింది లాహిరి. "అయితే మీరు కూడా ఇప్పుడు నాలాగే అబద్ధద్వేషి అయిపోయారన్నమాట! బాగుంది! చాలా బాగుంది! ఐ లైకిట్ వెరీమచ్! సరే - ఇప్పుడు చెప్పండి! ఎందుకు రాశారీ ఉత్తరం?"

"ఎందుకేవిటండీ?... నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను గనుక. మీరు లేనిదే నేను జీవించలేను గనుక..." అంటూ హుషారుగా కాలరెగరేశాడు హరిశ్చంద్ర.

"నిజంగా అంతలా ప్రేమిస్తున్నారా నన్ను?"

"ఏం - అనుమానమా? నేనిప్పుడు మారిపోయానని తెలిసికూడా మీరు నన్నిలా అనుమానించడం భావ్యంకాదు..." నిష్ఠూరం ధ్వనించింది హరిశ్చంద్ర కంఠంలో.

"అనుమానించడంకాదులేగాని... మొత్తానికి నేను మీ ప్రేమకో పరీక్ష పెట్టదల్చుకున్నాను సిద్ధమేనా?"

"ఓ... మీరెలాంటి పరీక్ష పెట్టినా నేను సిద్ధమే!" ధీమాగా రొమ్ము విరుచుకుంటూ "ఊఁ చెప్పండి" అన్నాడు హరిశ్చంద్ర.

"నేను పెట్టబోయేది సామాన్యమైన పరీక్షకాదు, చాలా కఠినమైన పరీక్ష! నా ఈ పరీక్షలో మీరు నెగ్గుతారన్న నమ్మకం నాకేకోశానాలేదు. కాబట్టి బాగా ఆలోచించుకుని సిద్ధపడండి!" రెచ్చగొడుతున్న ధోరణిలో అంది లాహిరి.

"అదెంత కఠినమైనదైనాసరే... నేను వెనుకంజ వేసే ప్రశ్నే లేదు. కఠినం కాదు- కఠినాతి కఠినమైనదైనాసరే- నేను విజయం సాధించి తీర్తాను. నామీద నాకా నమ్మకం వుంది!" అన్నాడు హరిశ్చంద్ర నిండుగా ఊపిరి పీలుస్తూ. ఆత్మ విశ్వాసంగలవాళ్లు అలా నిండుగా ఊపిరి పీలుస్తారని అతనెక్కడో ఎప్పుడో చదువాడు.

"ఖాయమేనా?"

"ఖాయమే..."

"తీరా నేను చెప్పేక తోక ముడవరుగా?"

"నాకు తోకలేదనుకోండి.- ఒకవేళ వున్నా ముడవను"

"నా పరీక్షలో నెగ్గాలంటే మీరెన్నెన్నో ఇబ్బందులకు గురి కావాల్సి ఉంటుంది. ఒక్కోసారి ఆపదల్లో కూడా ఇరుక్కోవాల్సి రావచ్చు! కాబట్టి మళ్లీ చెబుతున్నా బాగా ఆలోచించుకోండి. తీరా ముగ్గులోకి దిగాక మధ్యలో డ్రాపైపోతానంటే మాత్రం బావుండదు..." బెదిరించింది లాహిరి.

కాని హరిశ్చంద్ర బెదరలేదు.

"అదెంత ప్రమాదభరితమైనదైనాసరే నేను మీ పరీక్షకు సిద్ధమే. ఎలాంటి ఇబ్బందులొచ్చినా ఎన్ని ఆపదలెదురైనా ధైర్యంగా ఫేస్ చేస్తాను. అంతే తప్ప మధ్యలో డ్రాపై పోను ఊఁ చెప్పండి..." అన్నాడు భుజాలెగరవేస్తూ.

"పడిపోయావ్ గురూ ట్రాప్‌లో" అనుకున్న లాహిరి మనసులో ముసిముసిగా నవ్వుకుంటూ... "అయితే చెప్తున్నా" అంది కవ్వింపుగా.

"చెప్పండి.... " అన్నాడు ధీమాగా.

"సరే వినండి... ఈ క్షణం నుండి సరిగ్గా ఒక్క ఏడాది వరకూ... అంటే ఇవ్వాళ మే ఇరవై ఏడు కదా. వచ్చే సంవత్సరం మే ఇరవై ఆరు వరకూ అన్నమాట మీరు ఎట్టి పరిస్థితులలోనూ అబద్ధం అనేది ఆడనేకూడదు. హరిశ్చంద్ర అన్న మీ పేరును సార్థకం చేసుకోవాలి.

పెద్దవాళ్ల దగ్గరగాని, చిన్నవాళ్లదగ్గరగాని, ఆడవాళ్లదగ్గరగాని, మగవాళ్లదగ్గరగాని, ముసలివాళ్ల దగ్గరగాని ముతకవాళ్ల దగ్గరగాని.... ఎవ్వరి దగ్గరనైనా సరే ఎటువంటి పరిస్థితులలోనూ అబద్ధం ఆడనేకూడదు. కలలో మీ పరిస్థితిని అదుపు చేసుకునే కెపాసిటీ మీకుండదు కాబట్టి కలలో ఆడచ్చు.... అంతేకాని ఇలలో మాత్రం ఎవ్వరిదగ్గరా ఎటువంటి సిట్యుయేషన్‌లోనూ అబద్ధం ఆడకూడదు. జస్ట్ ఒన్ ఇయర్- కేవలం ఒకే ఒక్క సంవత్సరం ఈ కండిషన్‌కి మీరు లోబడి వుండగలిగితే నా పరీక్షలో మీరు నెగ్గినట్లు లెక్క. మీరు నెగ్గితే మీ ప్రేమను నేను తప్పకుండా అంగీకరిస్తాను- ఓకే?'' అంది లాహిరి.

''ఓస్ ఇంతేనా?'' అని నాలుక చప్పరించేశాడు హరిశ్చంద్ర.

''అంత తేలిగ్గా తీసుకోకండి!వింటానికిది చాలా సింపుల్‌గా అనిపించొచ్చు గాని ఆచరణలో మాత్రం చాలాకష్టం. ఈ పరీక్షలో మీరు నెగ్గగలరని నేననుకోవడం లేదు. బట్ వన్ థింగ్... నేను మాట తప్పే మనిషిని కాదు. ఒకవేళ మీరు నెగ్గితే నేను మనస్ఫూర్తిగా మీదాన్నవుతాను.... సరేనా?''

''సరే''

''నా సమక్షంలోగాని, పరోక్షంలోగాని- ఎప్పుడైనా ఎవరితోనైనా మీరు అబద్ధం ఆడినట్లు గాని తెలిసిందో... అది ఎంత చిన్న అబద్ధమైనా సరే- ఎటువంటి సిట్యుయేషన్‌లో ఆడిందైనా సరే... మీరు ఓడిపోయినట్టే లెక్క!''

''అలాగే!''

''అలాగే అని బుర్ర వూపగానే సరిగాదు. ఈ పరీక్షలో ముఖ్యంగా మీకుండాల్సింది నిజాయితీ. నేను చూడబోను కదా అని బైట యథావిధిగా అబద్దాలాడేస్తారేమో! ఒక్క విషయం గుర్తుంచుకోండి. ఈ పరీక్షని నేను చాలా సీరియస్‌గా తీసుకుంటున్నాను. అవసరమైతే మీ ప్రవర్తనని ఎప్పటికప్పుడు అబ్జర్వ్ చేసి నాతో చెప్పడానికి కొంత మంది సి.ఐ.డి.లను కూడా నియమిస్తాను. సి.ఐ.డి.లంటే నిజంగా సి.ఐ.డి.లు కాదు.సి.ఐ.డీల్లా పన్జేసే నా తరుపు మనుషులన్నమాట. ఫరెగ్జామ్‌పుల్ సమయం సందర్భాలను బట్టి ఒక్కోసారి మా బంటూగాడే మీపాలిటి సి.ఐ.డి కావచ్చు- తెలిసిందా''

''తెలిసింది... కాని మీరూ ఒక్క విషయం గుర్తుంచుకోండి లాహిరి గారూ! ఒకవేళ నేను ఓడిపోవాల్సి వస్తే ఓడిపోయానని ఒప్పుకుంటానే తప్ప ఆత్మవంచనకి మాత్రం పాల్పడను. వంచనతో సాధించే విజయం నాకు వద్దనే వద్దు- ఆ(!'' అన్నాడు రోషంగా హరిశ్చంద్ర.

''ష్యూర్?''

''ష్యూర్?''

''దెన్ ఇట్స్ ఓకే! గుర్తుంచుకోండి ఈ క్షణంనుండే ప్రారంభమైపోయింది నా పరీక్ష. ఈ క్షణంనుండే మీరు నిజమైన సత్యహరిశ్చంద్రుడిగా మారిపోవాలి- ఓకే?''

''ఓకే...''

లాహిరి తన చేతిలోని ప్రేమలేఖని ఫర్రున చింపేసింది.

''అరెరెరె... ఎందుకండీ దాన్నలా చింపేశారు?'' అన్నాడు హరిశ్చంద్ర బాధగా.

అదంతే! ఎందుకంటే ప్రస్తుతం నేను మీ ప్రేమను ఏక్సెప్ట్ చేస్తున్నట్టు కాదు. మీరు నా పరీక్షలో నెగ్గాక...నెగ్గటం అసంభవం అనుకోండి...ఒకవేళ నెగ్గితే గిగ్గితే...అప్పుడంగీకరిస్తాను మీ ప్రేమని. ఇక వెళ్ళి రానా?'' అంది లాహిరి.

''అప్పుడే వెళ్ళిపోతారా?'' బాధగా ముఖం పెట్టాడు హరిశ్చంద్ర.

''వెళ్ళక ఇక్కడే ఉండిపోమంటారా ఏంటి?''

''మీరు ఉండిపోవాలేగాని అంతకన్నా అదృష్టమా?'' అని ఇంకా ఏదో అనబోయిన హరిశ్చంద్ర ఠక్కున ఆగిపోయాడు. అతని చూపులు పమిట స్థానభ్రంశం చెందిన లాహిరి ఎదపై నిలిచిపోయాయి.

అది గమనించి చటుక్కున పమిట సరిచేసుకున్న లాహిరి —''ఏంటలా చూస్తున్నారు?'' అంది కోపంగా.

''అబ్బే... ఏంలేదండీ'' అనేయబోయిన హరిశ్చంద్ర-''అబద్ధమాడకు తప్పు...అబద్ధమాడకు తప్పది'' అని అంతరాత్మ హెచ్చ

రించడంతో-"మీ పమిట చెదిరి మీ కుడి వక్షోజం బిగువుగా అందంగా కనిపిస్తుంటే చూపు తిప్పుకోలేకపోయానండీ" అని నిజం చెప్పేశాడు.

అంతే!

అతని చెంప చెళ్ళుమంది!

కళ్ళ వెంబడి నిప్పులు రాల్తుండగా-"ఇడియట్! ఒక ఆడపిల్లతో ఇలాగేనా మాట్లాడేది?!" అంటూ మరోమారు చెంపఛెళ్ళుమని పించడానికి మళ్ళీ చేయి పైకెత్తింది లాహిరి.

పైకి లేచిన ఆమె చేతిని చటుక్కున ఒడిసి పట్టుకుని- "మరెలా మాట్లాడమంటారండీ? మీరేగా అబద్ధం ఆడకూడదని కండిషన్ పెట్టారు!? ఒక పక్క అబద్ధ ద్వేషినంటూనే నిజం చెప్పినందుకు నన్నిలా కొట్టడం మీకు భావ్యమా?" అంటూ దీనంగా చూశాడు హరిశ్చంద్ర.

అతని సిన్సియారిటీకి ఆశ్చర్యపోయిన లాహిరి "సారీ" అంటూ అప్రయత్నంగా తల దించుకుంది.

"ఏంసారీనో ఏంపాడో! దవడ చూడండి ఎలా బూరెలా పొంగిపోయిందో" నిష్ఠూరంగా అన్నాడు హరిశ్చంద్ర.

"రియల్లీ అయామ్ వెరీవెరీ సారీ!...మీ సిన్సియారిటీ నాకెంతో నచ్చింది...కీపిటప్" అనేసి అక్కడినుంచి వెళ్ళిపోయింది లాహిరి.

"ఏంట్రా ఈమధ్య దర్శనాలే లేవు. ఏంనీ భూతల స్వర్గం లోంచి ఇవతలకి రాలేకపోతున్నావా?" అన్నాడు హరిశ్చంద్రవేపు నిష్ఠూరంగా చూస్తూ వామన్రావ్.

అప్పటికి నాలుగో అయిదో రోజులైంది హరిశ్చంద్ర వామన్రావ్ ఇంటికెళ్ళి.

"అవున్రా బ్యాంక్ అవ్వగానే నేరుగా రూమ్ కెళ్ళిపోతున్నాను. ప్రతిక్షణం నాకు నారూమ్‌లో ఉండాలనిపిస్తోంది. ఎందుకంటే నా లాహిరి దర్శనభాగ్యం ఏ క్షణంలో కలుగుతుందో నాకే తెలియదుగదా?!" అన్నాడు హరిశ్చంద్ర.

"సిగ్గు విడిచేసి మాట్లాడకు. ఆమెపట్ల నీకు ఎంత ప్రేమ ఉంటే మాత్రం-మరీ ఇంత నిర్లజ్జ గా నిజం ఒప్పేసుకోవడం ఏంబావులేదు" అన్నాడు వామన్రావ్.

"నిజం ఒప్పుకోవడానికి సిగ్గుదేనికిరా? అయినా కాకపోయినా నేనిపుడు మునుపటి హరిశ్చంద్రనుకాను. ఇక నుండి నా నోటి వెంబడి నిజమే తప్ప ఎట్టి పరిస్థితులలోనూ అబద్ధం అనేది రానే రాదు.." అంటూ లాహిరి తనకు పెట్టిన ప్రేమ పరీక్షను గురించి వామన్రావ్‌తో అంతా వివరంగా చెప్పాడు హరిశ్చంద్ర

"ఛీ... మూర్ఖుడా!" అన్నాడు వామన్రావ్.

హరిశ్చంద్ర తెల్లబోయి చూస్తుంటే వామన్రావే అన్నాడు మళ్ళీ-"లేకపోతే ఏంట్రా? ఆమెపట్ల నీకు ఎంత ప్రేమ ఉంటే మాత్రం?-మరీ ఇంత డేంజరస్ పరీక్షకు సిద్ధపడిపోవడం మూర్ఖత్వం కాకపోతే మరేంటి? ఇందులో ఎంత రిస్కుందో తెలుసా? ఎల్లవేళలా నిజమే చెప్పాలంటే మానవమాత్రులకు సాధ్యం కాదురా దవడ చూడు ఎలా వాచిపోయిందో! పందెంకాదు అగ్రిమెంట్-కాదు పరీక్ష-ఏదో ఒకటిలె నాబొంద... స్టార్టయ్యి-ఇంకా గంటైనా నిండలేదంటున్నావ్, అప్పుడే దవడ వాచిపోయింది. ముందుముందు కీళ్ళూ, కాళ్ళూ విరిగినా ఆశ్చర్యపోనక్కరలేదు. నీ స్నేహితుడిగా, శ్రేయోభిలాషిగా చెబుతున్నా...వెంటనే డ్రాపైపో! అర్జంటుగా ఆ అమ్మాయి దగ్గరికెళ్ళి, నీకూ, నీ పరీక్షకూ ఓ దండం తల్లీ అని రెండుచేతులూ జోడించు-తప్పులేదు..."

"నెవ్వర్! నేను డ్రాపైపోవడం అన్నది ఇంపాసిబుల్!...ఈ పరీక్షలో నేను విజయం సాధిస్తానన్న నమ్మకం నాకుంది. దయచేసి నాకు పిరికిమందు నూరిపోయకు..." అన్నాడు హరిశ్చంద్ర అయిష్టంగా ముఖంపెట్టి.

"సరే... నీ ఖర్మ ఆఘోరించు" అనేశాడు వామన్రావ్.

"నా అఘోరింపేదో నేనఘోరిస్తాలే! నువ్వేం జాలి చూపనక్కర్లేదు" అంటూ దూకుడుగా లేచి నిలబడ్డాడు హరిశ్చంద్ర-అతనికాక్షణంలో వామన్రావ్ తనను తన ప్రేయసి నుండి వేరు చేయబోతున్న కిరాతకుడిలా కనిపించాడు.

"అదేంటన్నయ్యగారూ ఇప్పుడే వచ్చి అప్పు

డే వెళ్ళిపోతున్నారు...కూర్చోండి కాఫీ తెస్తా!'' అంది అప్పుడే ఆ గదిలోకి వచ్చిన గోమతి.

''ఒద్దులేమ్మా అవతల నాకు చాలా అర్జంటు పనివుంది'' అన్నాడు హరిశ్చంద్ర కూర్చునే ప్రయత్నమేదీ చేయకుండా.

''మీరైనా చెప్పండీ అన్నయ్యగార్ని కూర్చో మని'' అంది గోమతి.

''నేన్చెప్పను... ఏంఎందుకు చెప్పాలి?.... ఏదో స్నేహితుడు కదాని హితవు చెప్పబోతే దానికిలా మొహం మాడ్చుకుని వెళ్లిపోవడ మేనా?'' అన్నాడు వామన్రావ్ కోపంగా.

''ఏంటి ఏమైనా గొడవగాని పడ్డారా?'' అంది గోమతి ఇద్దరివంకా మార్చిమార్చి చూస్తూ.

''గొడవంటే గొడవకాదు గానమ్మా... ఈ కిరాతకుడు నన్ను నాప్రేయసి నుండి వేరు చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. అందుకని ఇక్కడ వుండబుద్ధిగాక వెళ్లిపోతున్నాను'' అని నిజంచెప్పేసి, మరో మాటమాట్లాడేందుకు గోమతికి అవకాశం ఇవ్వకుండా రయ్యిమని వెళ్లిపోయాడు హరిశ్చంద్ర.

''ఏంటండీ అన్నయ్యగారిధోరణి ఏదో వింతగా వుంది?!'' అంది గోమతి.

ఆమెకు సంగతి సందర్భాలు వివరించి చెప్పాడు వామన్రావ్.

''పాపం పసివాడు'' అంది గోమతి.



''అదేంటే ఇందాకట్నుంచి గమనిస్తున్నాను. కన్నార్పకుండా అతనిగదికేసి చూస్తున్నావ్.... కొంపదీసి అతన్తో లవ్‌లోగాని పడ్డావా ఏంటి?''

''చస్ నోర్ముయ్!'' అంటూ నర్మద నెత్తిమీద గట్టిగా మొట్టింది లాహిరి.

''అబ్బా!'' అంది నర్మద.

''వదిలిందా తిక్క! లేకపోతే ఏంటా వెధవ్వాగుడు?'' అంటూ చురచురా చూసింది లాహిరి.

''ఓయబ్బా నంగనాచి!!'' అంటూ అదోలా చేతులు తిప్పింది నర్మద. ''వెధవ్వాగుడంట వెధవ్వాగుడు! నాకేం తెలియదనుకోబోకు! ఇందాక నువ్వతని రూమ్‌కెళ్లి అతనితో చాలాసేపు మాట్లాడటం నేను గమనించలేదనుకున్నావా?''

''అంత మాత్రాన అతనితో లాలో పడిపోయినట్టేనా? నా సంగతి నీకు తెలుసుగా? నేను ప్రేమిస్తే గీమిస్తే కారున్న ఆరడుగుల అందమైన యువకుణ్ణి ప్రేమిస్తానే తప్ప.... ఇలాంటి అల్లాటప్పాగాళ్లని నా దగ్గరక్కూడా రానివ్వను.... ఆ.....''

''మరైతే అతనితో అంతసేపు కబుర్లేవిటి?''

''కబుర్లా పాడా, కసి! అతని దుంప తెంచడానికి బ్రహ్మాండమైన ఏర్పాటు చేసొచ్చాను....''

''అబ్బ... సరిగ్గా చెప్పిచావవే!'' వినుక్కుంది నర్మద విషయం అర్థంగాక.

టూకీగా సంగతంతా చెప్పింది లాహిరి.

''పాపం'' అంది నర్మద.

''పాపమేమిటే పాపం? లేకపోతే ఆ స్కౌండ్రల్‌కి ఎంత ధైర్యం? నాకు... నాకు... ప్రేమలేఖ రాస్తాడా?''

''ఏమే రాస్తే తప్పా? ఏంటంట నీబోడి గొప్ప?'' ఉడికించింది నర్మద.

''నోర్ముయ్!''

''మూస్తాలేగానీ నీవరస నాకేం నచ్చలేదే! అతనంటే ఇష్టంలేనిదానివి ఆ ప్రేమలేఖేదో అతని మొహాన్నకొట్టేసి రాకుండా — పాపం ఎందుకే అతన్నలా ఇరకాటంలో పెట్టేవ్! నా జోలికొస్తే మర్యాదగా వుండదని ఓ వార్నింగిస్తే సరిపోయే దానికి.... అతనిలో లేనిపోని ఆశలు రేపడానికి కాకపోతే మధ్యలో ఈ పరీక్షేంటి? ఒకవేళ అతను నెగ్గితేనో?''




"నెగ్గడు"

"ఏంటంత భరోసా? ఒకవేళ నెగ్గితే?"

"నెగ్గితే అతని ప్రేమను అంగీకరిస్తాను..."

"నిజంగా?"

"నిజంగా!"

"అయితే అతను నెగ్గాలనే నేను మనస్ఫూర్తిగా కోరుకుంటాను. ఎందుకంటే మీ ఇద్దరికీ ఈడూజోడూ భలే బావుంటుంది"

"చాల్లే నోర్ముయ్!" అంది లాహిరి కోపంగా.

"ఇప్పుడంటే గసిరి నానోరు మూయించగలవేమోగాని ఒకవేళ రేపొద్దున్న అతను గనక నెగ్గితే నువ్వేమూసుకోవాల్సొస్తుంది గార్తిగా నోరు!" అంది నర్మద కొంటెగా కళ్లెగరేస్తూ.

"అతను నెగ్గడు గాక నెగ్గడు...."

"చూద్దాం..."

"ఏంటి చూసేది నీబొంద" అని లాహిరి ఇంకా ఏదో అనబోతుండగా... "అడుగోనేవ్ వస్తున్నాడు" అంది నర్మద అప్పుడే గేటు తీసుకునిలోనికి ప్రవేశిస్తున్న హరిశ్చంద్రను చూసి.

"ఒక తమాషా చేద్దామా?"

ఏమిటన్నట్టు చూసింది నర్మద.

"నువ్వతని దగ్గరికెళ్ళి, ఏవండీ మీ చెంప ఎందుకలా వాచిందనడుగు... ఏంచెబుతాడో చూద్దాం. మామూలుగా అయితే అతను నిజం చెప్పడానికి సిగ్గుపడి ఏదో అబద్ధం చెప్పాలి..." అంది లాహిరి.

"నేనెళ్ళను బాబూ!" అంటూ అడ్డంగా తలాడించింది నర్మద.

"ఏం-వెళ్తే అరిగిపోతావా? నిన్నేం కొరుక్కుతినళ్ళే వెళ్ళు!"

"అదికాదే, ఎవరైనా చూస్తే బావుండదు..."

"ప్రస్తుతం ఇక్కడెవ్వరూ లేరుగా... ఫర్వాలేదులే వెళ్ళు జస్ట్ ఆ ఒక్కమాట అడిగి ఏంచెబుతాడో విని వచ్చేసెయ్" అంటూ నర్మదని ముందుకు నెట్టింది లాహిరి.

"సరే... అయితే" అంటూ అయిష్టంగానే బయల్దేరింది నర్మద.

ఆమె వెళ్ళేసరికి హరిశ్చంద్ర లుంగీ చుట్టుకుంటూ వున్నాడు. ఒంటిమీద కనీసం బనీనైనా లేకపోవడంతో ఆమెనుచూసి కంగారుపడిపోతూ నగ్నంగావున్న ఛాతీపై టవల్ పరుచుకున్నాడు.

"మీరు..." అంటూ ఆగాడు ప్రశ్నార్థకంగా చూస్తూ.

"నా పేరు నర్మద. లాహిరి స్నేహితురాల్ని..." తననితాను పరిచయం చేసుకుంది నర్మద.

అలాగా అన్నట్టు ఓ వెర్రిచూపుచూసి-"ఏంటి ఏవైనా వీక్లీలు కావాలా?" అన్నాడు హరిశ్చంద్ర.

కాదన్నట్టు అడ్డంగా తలాడించింది నర్మద.

"మరి?" అన్నట్టు చూశాడు హరిశ్చంద్ర.

"మిమ్మల్ని ఓమాట అడిగిపోదామని వచ్చాను..."

"అడగండి..." అన్నాడు ఇబ్బందిగాచూస్తూ.

"మీ చెంప ఎందుకలా వాచింది?"

బిత్తరపోయాడు హరిశ్చంద్ర ఒక్షణం.

ఓ అపరిచితురాలు... ఏదో పెద్దపని వున్నదానిలా రూమ్‌కొచ్చి... అలా అడగటం.

కాస్త ఆలోచించేసరికి అర్థమైపోయిందతనికి ఇదేదో లాహిరి పన్నాగమే అయ్యుంటుందని.

"సో...షి ఈజ్ వన్ ఆఫ్ ది సి.ఐ.డీస్ ఆఫ్ లాహిరి అన్నమాట!" అనుకుని... "చెబుతాగానీ నా చెంపయొక్క యోగక్షేమాలు ఇలా పనిగట్టుకుని మరీవచ్చి తెలుసుకోవాల్సిన అవసరం మీకేమొచ్చిందో చెప్పండి ముందు" అన్నాడు తెలివిగా.

నర్మదకి ఏంచెప్పాలో తోచక మవునంగా వుండిపోయింది.

"నాకు తెలుసు... మిమ్మల్ని లాహిరిగారే పంపించి వుంటారు- అవునా?"

"అవును..." అనక తప్పలేదు నర్మదకి.

"నా చెంపనిలా వాయగొట్టింది లాహిరిగారేగా! మళ్ళీ మిమ్మల్ని పంపించి ఈ ప్రశ్న మీతో అడిగించటందేనికి?" అన్నాడు హరిశ్చంద్ర నిజం ఒప్పేసుకుంటూ.

"అరెరెరె... నిజంగా లాహిరే కొట్టిందా మిమ్మల్ని? ఆ సంగతి నాకేం తెలుసు? పాపం అతని చెంప వాచిపోయి వుంది. ఎందుకు వాచిందో కనుక్కుని రావే అంటే నేనేదో వెర్రిమేళంలా ఇలా వచ్చేశాను... అదిసరే... ఎందుక్కొట్టింది లాహిరి మిమ్మల్ని" అంది నర్మద.

"చెబుతాగానీ, నారూమ్‌లో మీరింకా చాలా సేపు వుండేందుకు అవకాశం వుందా?"



"వాట డు యు మీన్?" కోపంగా అంది నర్మద.

"ప్లీజ్ కోపగించుకోకండి! వేరే ఉద్దేశం ఏంలేదు. సదుద్దేశమే! ఇప్పటికే ఒక చెంప వాచిపోయి చాలా బాధపడుతున్నాను. రెండో చెంపనైనా కాపాడుకోవాల్సిన అవసరం నాకెంతయినావుంది" అన్నాడు హరిశ్చంద్ర.

"అంటే?"

"అబ్బ మీకెలా చెప్పాలో నాకర్థంకావట్లేదు.. ఏంలేదు. మీరుగాని ఇంకా కాసేపు నా రూమ్‌లో వుండదల్చుకుంటే దయచేసి మీ పమిట చెంగుని ఎట్టి పరిస్థితులలోనూ స్థాన భ్రంశం చెందనీయకుండా గట్టిగా బిగించి నగుంచుట్టూ తిప్పి బొడ్లో దోపుకోండి- ప్లీజ్..."



అంటూ కళ్ళుమూసుకున్నాడు హరిశ్చంద్ర.

ఫక్కున నవ్వబోయి నిగ్రహించుకుంది నర్మద.

"ఊс... మీరు చెప్పినట్టే చేశాను... ఇంక కళ్ళు తెరవండి ఫర్వాలేదు" అని ఆమె అన్నమీదట కళ్ళు తెరిచాడు హరిశ్చంద్ర-

"హమ్మయ్య చాలా థాంక్సండీ!" అన్నాడు తేలిగ్గా ఊపిరిపీలుస్తూ.

"ఊс చెప్పండి... ఎందుక్కొట్టింది లాహిరి మిమ్మల్ని?"

"ఎవరైనా వూరికినే కొట్టరుకదా? ఆమెను నేనొక పాడుమాట అన్నాన్లెండి... అందుకని కొట్టింది" అన్నాడు హరిశ్చంద్ర-- 'ఇదెక్కడి పీడరాబాబూ' అని లోలోన గొణుక్కుంటూ.

"ఏంటి ఏదో గొణుక్కుంటున్నారు?" అంది నర్మద.

ఏంలేదండీ అనేయబోయాడుగాని, "అబద్ధం ఆడకు తప్పు... అబద్ధం ఆడకు తప్పు..." అని అంతరాత్మ ఘీపెట్టడంతో- "ఇదెక్కడి పీడరా బాబూ అని గొణుక్కుంటున్నానండీ" అని భయపడుతూనే నిజం చెప్పేశాడు హరిశ్చంద్ర.

అతనికేసి ఉరిమిచూసింది నర్మద.

"ఏంటీ? నేను మీ కళ్ళకు పీడలా కనబడుతున్నానా?"

"అవునండీ!"

"పిశాచంలా కూడా కనబడుతున్నానా?"

"అవునండీ!"

"నన్ను మెడపట్టి బైటికి గెంటాలని కూడా అనిపిస్తోందా?"

"అవునండీ!"

"ఫర్వాలేదు... ఇతను నెగ్గే సూచనలు బాగానే కనిపిస్తున్నాయ్" అని మనసులో అనుకుంటూ "మీకు మంచీమర్యాదా తెలిసినట్టు లేదే?!" అంది నర్మదపైకి.

"తెలుసండీ... నేనేం మేనర్‌లెస్ బ్రూట్‌ని కాదండీ..." ఏడుపుముఖంపెట్టి అన్నాడు హరిశ్చంద్ర.

"తెలిస్తే మరి ఇలాగేనా మాట్లాడేది?"

"ఏం చేయనండీ... నేనొక శాపగ్రస్తుణ్ణి! కొద్ది గంటలక్రితం వరకూ బానే వుండేవాణ్ణి. మీ ఫ్రెండు లాహిరిగారి పుణ్యమా అని ఇలాగైపోయానండీ! ఎల్లవేళలా ఎట్టిపరిస్థితులలోనూ నిజమే చెప్పాల్సిన దౌర్భాగ్యపు సంకటస్థితిలో ఇరుక్కుపోయానండీ! ప్రేమకోసం అండీ... ఇదంతా ప్రేమకోసం..." అంటూ కళ్ళు నులుముకున్నాడు హరిశ్చంద్ర.

"ఛ... ఊరుకోండీ" అంది నర్మద జాలిగా.

"ఇంకా అడగాల్సిన ప్రశ్నలేమైనా వున్నాయా?" అన్నాడు హరిశ్చంద్ర కళ్ళు నులుముకోవడం మానేసి.

"మిమ్మల్ని ఇబ్బందిపెట్టడం నా ఉద్దేశ్యం కాదుగాని, మా లాహిర్ని మీరేదో పాడుమాట అన్నాన్నారుగా... ఆ పాడుమాటేంటో చెప్తే వెళ్ళిపోతాను" అని పెదవులు బిగించింది నర్మద.

కుడితిలోపడ్డ ఎలుకలా గిజగిజలాడిపోతూ- "చెప్పక తప్పదాండి?" అని దీనంగా చూశాడు హరిశ్చంద్ర.

"తప్పదు..." అంది నర్మద అని మళ్ళీ పెదవులు బిగించేసింది.

బిడియపడ్తూ బిడియపడ్తూ చెప్పలేక చెప్పలేక చెప్పేశాడు హరిశ్చంద్ర- తన చెంప ఏ సిట్యుయేషన్‌లో పగిలిందో.

"మరి అలా అంటే ఏ ఆడపిల్లకైనా కోపం రాదుటండీ." అంది నర్మద జాలిగా నవ్వేస్తూ.

తలదించుకున్నాడు హరిశ్చంద్ర.

"మరి నేనింక వెళ్ళిరానాండీ?" అని అతని వద్ద శలవుతీసుకుని అక్కడినుంచి వెళ్ళిపోయిన నర్మద- నేరుగా లాహిరి వద్దకెళ్ళింది! జరిగిన సంభాషణంతా పూసగుచ్చినట్టు చెప్పాక ఇద్దరూ కలసి నవ్వుకున్నారు చాలాసేపు.

ఓ అరగంట తర్వాత బంటూవచ్చాడు హరిశ్చంద్ర రూమ్‌కి.

"ఏం నాయనా ఇలా దయాచేశావ్? ఏం నిన్ను కూడా సి.ఐ.డి వర్క్‌చేసి రమ్మని పంపించారా మీ అక్కయ్యగారు" వాడికేసి కొరకొరా చూస్తూ అన్నాడు హరిశ్చంద్ర.

"అదేంటండీ నేనేదో ఊరికే వస్తే అలా అంటారు?" అన్నాడు వాడు బిత్తరపోతూ.

"మా నాయనే! ఊరికే వచ్చావా? హుс...




ఊరికే వచ్చావా?''

"అవునండీ... ఊరికే వచ్చాను..."

"ఊరికే నా రూమ్‌కెందుకూరావడం? ఏం-ఏవుల్లయ్యరూమ్‌కో వెళ్ళొచ్చుగా?''

"పుల్లయ్యెవరండీ?''

"వల్లకాట్లో మల్లయ్య తమ్ముడు'' అనబోయి నాలుక్కరుచుకున్నాడు హరిశ్చంద్ర. వల్లకాట్లో మల్లయ్యకి పుల్లయ్య అనే తమ్ముడు గనక వుండకపోతే తాను అబద్ధం ఆడినట్టువు తుందిగదా!?- అందుకు

"ఏదోమాట వరనకన్నానేగాని, నిజం చె ప్పు... మీ అక్కయ్యగారు కాదా నిన్ను పంపిన్త..''

"కాదు... ఊరికే వచ్చాను...''

"ఊరికే ఎందుకూ రావడం?''

"ఊరికే...''

"ఊరికే ఊరికే ఊరికే!... హుం... ఊరికే వచ్చినవాడివి ఊరికే వుంటావన్న నమ్మకం ఏముంది?... ఇదుగో బంటూ మర్యాదగా చెబు తున్నా- వచ్చినవాడివి వచ్చినట్టు తిన్నగా వుండు. అంతేగాని అడ్డదిడ్డమైన ప్రశ్నలేసి నన్ను విసిగించకు... తెలిసిందా... ఆఁ?!''

ఈ మానవుడేంటబ్బా ఉత్తుత్తికే ఇలా సీరి యస్ అయిపోతున్నాడని ఆశ్చర్యపోయిన బంటూ- "ఇవ్వాళకూడా పాపం మీ మైండ్ సరిగ్గా పన్జేయడం లేదల్లే వుందే?!'' అన్నాడు ఎగాదిగా చూస్తూ.

"అవును... ఇవ్వాళ నామైండ్ సరిగ్గా పన్జే యడం లేదు'' అని నిజాన్ని ఒప్పుకున్నాడు హరిశ్చంద్ర.

"ఎందుకని మీమైండ్ సరిగ్గా పన్జేయడంలే దు?''

"దవడ వాచింది గనక.''

"ఎందుకని మీ దవడ వాచింది?''

"ఒకమ్మాయి కొట్టింది గనక''

"ఎవరా అమ్మాయి? ఎప్పుడు కొట్టింది మి మ్మల్ని?''

"నేన్చెప్పను...''

"ఏం ఎందుకని చెప్పరు?''

"చెబితే నువ్ ఊరంతా టాంటాం చేసే స్తావు గనక''

"టాంటాం చేయటం అంటే?''

"డప్పుచ్చుకుని దండోరా వేయటం...''

"వేస్తే ఏమవుతుంది?''

హరిశ్చంద్ర గబాల్న దండెంమీద వేళ్ళాడు తున్న ఓ లుంగీని అందుకున్నాడు. రెండు చేతుల్తో రెండు కొసల్నీ పట్టుకుని దాన్ని లావు పాటి తాడు షేప్ వచ్చేలా మెరిదిప్పాడు. తర్వాత మెడచుట్టూ దాన్ని ఓ తిప్పుతిప్పి రెండు చేతుల్తోనూ రెండు కొసల్నీ గట్టిగా లాగిపట్టుకున్నాడు.

"ఏం చేస్తున్నారు మీరు?'' ఆశ్చర్యంగా అడిగాడు బంటూ.

"కనబడ్డంలా? ప్రాణంతీసుకోవడానికి ప్ర యత్నిస్తున్నాను...'' హరిశ్చంద్ర కంఠంలో దుఃఖం ధ్వనించింది.

"ప్రాణంతీసుకోవడం దేనికి?''

ఇంక నిగ్రహించుకోవడం హరిశ్చంద్రవల్ల కాలేదు.

"రేయ్ బంటూ...'' అంటూ రూమ్ దద్దరిల్లి పోయేలా పెనుకేకవేశాడు. "తక్షణం గది లోంచివెళ్ళిపో... ఐసే గెటవుట్! ఇంకొక్కక్ష ణంగాని ఇక్కడ వున్నావంటే నే నాత్మహత్యచే సుకుంటాను. ఊఁ... క్విక్... పరిగెత్తు...''

అంతే!

పిచ్చి ముదిరిపోయింది గావల్ను ఈ మహా నుభావుడికి అనుకుని మెరుపువేగంతో అక్కడి నుంచి మాయమైపోయాడు బంటూ.

వాడు మాయమైపోయిన మరుక్షణం హరి శ్చంద్ర కూడా ఆ రూమ్‌లోంచి మాయమైపో యాడు... మళ్ళీ ఏ.సి.ఐ.డీ గాడైనా వస్తాడేమో నన్న భయంకొద్దీ.

★ ★ ★

ముక్కు పగిలిందాండీ? సారీ అండీ నేను చూసుకోలేదు''

"ఏంటయ్యా చూసుకోకపోవడం? ఏంకళ్ళు నెత్తిమీదకెక్కేయా?''

"సారీ అంటున్నాగా...'' దీనంగా చూశాడు హరిశ్చంద్ర.

"ఏంటయ్యా సారీ... ఏం రోడ్డుమీద నడిచే టప్పుడు ఒళ్ళు దగ్గర పెట్టుకొని నడవాలని తెలీదా..." కోపంగా అన్నాడు అవతలి వ్యక్తి.

"తెలుసనండి... కాని ఏదో పరధ్యానంలో వుండి మిమ్మల్ని చూసుకోకుండా గుద్దేశాను- దయచేసి మన్నించండి" అంటూ చేతులు జోడించాడు హరిశ్చంద్ర. తప్పు తనదే కాబట్టి తనే తగ్గాలి తప్పదు మరి. అదీగాక అవతలి వ్యక్తి తనకంటే పెద్దవాడు. తలనెరిసిన వ్యక్తిని మన్నించమని వేడుకోవడంలో సిగ్గుపడా ల్సిందేముంది.

"సర్లే సర్లే... ఇంకెప్పుడూ ఇలా పరధ్యానంగా రోడ్లమీద నడవకు..." అనేసి ముక్కును రుద్దుకుంటూ ముందుకు సాగిపోయాడా పెద్ద మనిషి.

"ఖర్మ... ఇవ్వాళ పొద్దున్నే లేచి ఎవరి ముఖం చూశానోగాని అన్నీ అనర్థాలే- అన్నీ అనర్థాలే" అనుకుంటూ తనూ ముందుకు సాగిపోయాడు హరిశ్చంద్ర.

ఇంకాసేపటికి రాత్రైపోతుంది కాబట్టి ఎలాగోలా ఈరోజు గడిచిపోతుంది. కానీ రేపట్నుంచి ఎలాగబ్బా?

అనుక్షణం సత్యమునే పలుకుతూ బతకటం తనవల్ల అవుతుందా?

ఏమో... ఆ దేవుడే రక్షించాలి తనని.

ఇదేంటిది అప్పుడే ఇలా డీలాపడిపోతున్నాడు తను.

తన ప్రియాతిప్రియమైన లాహిరికోసం ఎన్ని తిప్పలైనా పడాలి తను. అంతేగాని ఇలా డీలాపడిపోవడం ఏంటి?

నో... ఇంకెప్పుడూ ఇలా డీలాపడిపోకూడదు.

మధ్యలో డ్రాపైపోవడం అన్నది జరగనే జరగదని ఛాలెంజీ కూడా చేశాడాయె.

అలాంటప్పుడు మరెంత ధైర్యంగా వుండాలి తను?

"ధైర్యంగా వుండరా హర్రిగా... ధైర్యంగా వుండరా హర్రిగా" తనకుతానే ధైర్యంచెప్పుకుని ఒకింత కుదుటపడ్డాడు హరిశ్చంద్ర.

అంతలో అతనికి వాసుదేవరావ్ ఎదురువడ్డాడు. "హలో హరిశ్చంద్రా... ఎటు ఇలా బయల్దేరారు?"

"ఎటూ అనుకుని బయలుదేరలేదండీ... రూమ్‌లో వుంటే మళ్ళీ సి.ఐ.డిగాళ్ళు గాని వస్తారేమోనని అనాలోచితంగా ఇలా రోడ్డుమీద పడిపోయాను..." చెప్పాడు హరిశ్చంద్ర.

"సి.ఐ.డిగాళ్ళా?"

"అవునండీ సి.ఐ.డీగాళ్ళే కాని మీకు నమస్కారం పెడతాను నన్నింకేమీ ప్రశ్నించకండి!" అంటూ బెదురుబెదురుగా చూశాడు హరిశ్చంద్ర.

"మీరు..."

"నేను హరిశ్చంద్రనండీ"

"అది సరేనండీబాబూ... ఏంటలా బిక్కుబిక్కుమని చూస్తున్నారు? మిమ్మల్ని చూస్తుంటే మీరెందుకో మెంటల్‌గా సౌండ్ పొజిషన్‌లో వున్నట్టనిపించడంలేదు... ఎనీథింగ్ రాంగ్?"

హరిశ్చంద్ర చేతులు జోడించబోవడం చూసి- "అరె... అదేంటి హరిశ్చంద్రగారూ?" అన్నాడు వాసుదేవరావ్ కంగారుగా.

"అదంతేలెండి! నన్నింకేమీ ప్రశ్నించొద్దు. ప్రశ్నించవద్దని ప్రాథేయపడటానికే చేతులు జోడించబోతుంటే మీరు వారించారు. మీరు గనక ప్రశ్నిస్తే నేనన్నీ నిజాలే చెప్పాల్సి వస్తుంది..."

"మీరేవంటున్నారో నాకు సరిగ్గా అర్థంకావడంలేదు"

"అర్థం కాకపోవడమే మంచిదిలెండి... సారీ మరోలా అనుకోకండి... నాకు పనుంది నేను వెళ్తాను... అనేసి వడివడిగా ముందుకు సాగిపోయాడు హరిశ్చంద్ర "ఉండండి— నేనూ అటే వస్తున్నా" అని వెనక నుంచి వాసుదేవరావనడం అతనికి వినిపించకపోలేదు అయినా సరే పట్టించుకోలేదు.

కనుమరుగు అయ్యేంతవరకూ అతనివేపు అయోమయంగా చూస్తుండిపోయాడు వాసుదేవరావ్.

భోజనంవేళయ్యేంతవరకూ అలాఅలా నాలుగు వీధులు తిరిగి చివరికో హొటల్లో దూరాడు హరిశ్చంద్ర.

★ ★ ★




ఆరోజు బ్యాంకులో అందుకున్నాడు హరి శ్చంద్ర ఓకార్డు.

శ్రీరస్తు చిరంజీవి హరిశ్చంద్రకి,

నీ తండ్రి అచ్యుతరామయ్య ఆశీర్వదించి రాయునది.

నీఉత్తరం అందింది. కల్పలతను చేసుకో వడం నీకిష్టంలేదని రాశావు. అలాగే- నీ అభీ ష్టానికి వ్యతిరేకంగా ఏమీచేయను.

పోతే ఒక ముఖ్యమైన విషయాన్ని గురించి నీతో నేరుగా మాట్లాడాల్సి వుంది. కంగారుప డకు, నీపెళ్ళి విషయం కాదు... వేరే విషయం కాబట్టి ఈ ఉత్తరం అందిన వెంటనే ఒకసారి వీలుచూసుకుని రాగలవు.

మీఅమ్మా, చెల్లెలూ నిన్ను అడిగినట్లుగా చెప్పమన్నారు— ఉంటాను.

ఇట్లు

నీ తండ్రి అచ్యుతరామయ్యావ్రాలు.

భలే చావొచ్చిపడిందే అనుకున్నాడు హరి శ్చంద్ర తండ్రి రాసిన ఆకార్డుని గొట్టంలా చుట్టూ వెళ్లడమా? మానడమా అని కాసేపు ఆలోచనలో పడ్డాడు. కల్పలతతో తనపెళ్ళి కాన్సిలే అంటున్నాడు కాబట్టి ధైర్యంగా వెళ్లవ చ్చు. ఫర్వాలేదు కాని తానిపుడు మామూలు హరిశ్చంద్రకాడాయె! సత్యహరిశ్చంద్రుడాయె! ''ఏరా ఎందుకిష్టంలేదు కల్పలతని చేసుకో వడం? ఏం ఎవర్నయినా ప్రేమిస్తున్నావా?'' అనిగాని అడిగితే ఏంచెప్పడం?

అబద్ధం చెప్పడానికి వీలేలేదాయె! కంపల్స రీగా నిజమే చెప్పాల్సివస్తుంది! చెబితే నానా రభసా అయిపోదూ? బాబోయ్ ఇంకేమైనా వుందా?

తన పిచ్చిగాని తన ఊళ్ళో తానబద్ధాలా డితే మాత్రం తప్పేముంది? లాహిరి చూడొ స్తుందాఏం? అంతదూరం తన సి.ఐ.డీలను మాత్రం ఎలా పంపగలదామె?

''నోర్ముయ్‌రా నిజాయితీ లేనివెధవా? సిగ్గు లేదూ ఆత్మవంచనకి పాల్పడటానికి? ప్రేమ పవిత్రమైనదిరా! పవిత్రమైన లాహిరి ప్రేమ ను వంచనతోనట్రా పొందుతావు? ఛూ! అద్దంలో నీమొహం చూడు- ఉడతలు పట్టే మొహంలా ఎలా వుందో''

''నన్నేనా అంటున్నావు?'' అడిగాడు హరి శ్చంద్ర అంతరాత్మని.

''నిన్ను కాకపోతే ఇంకెవర్నంటాన్రా? అడ్డగా డిదలా మనిషివి పెరిగావన్న మాటేగాని... మెదడు పెరగలేదు'' అంది అంతరాత్మ.

దాంతో తానలా తప్పుడు పంథాలో ఆలో చించబోయినందుకు సిగ్గుపడిపోయి ఆ తర్వాత పశ్చాత్తాపం కూడా చెందాడు హరి శ్చంద్ర.

హరిశ్చంద్ర తెలుగు సినిమాలు కాస్త విరివి గానే చూస్తాడు. అందువల్ల అప్పుడప్పుడూ అతనలా తన అంతరాత్మతో ఎదురుగా మరో హరిశ్చంద్ర వున్నట్టు భావించి మరీ మాట్లాడే సుకుంటూ వుంటాడు.

''దట్స్‌గుడ్... పశ్చాత్తాపం చెందేవుగా- ఇంకనే పాపం పోయినట్టే! కాని ఇంకోసారి మాత్రం నీ బుద్ధిని పెడదోవ పట్టనీకు'' అంది అంతరాత్మ.

''అలాగేలే అయినా మాటిమాటికీ బుద్ధిని పెడదోవ పట్టనీయడం తప్ప నాకింకేం పనిలే దనుకున్నావా?'' అన్నాడు హరిశ్చంద్ర.

''రోషానికేం లోటులేదు... మొహం చూడెలా వుందో!

... సర్లేగాని బాగా ఆలోచించుకుని వెళ్ళు మీ ఇంటికి. ఏక్షణాన్న ఏం జరుగుతుందో ఎవరికి తెలును!?''

''అబ్బ నువ్ నోర్ముయ్... నేనేం పసివాణ్ణను కున్నావా మరీ అంతలా జాగ్రత్తలు చెబుతు న్నావు? ఎప్పుడెలా ప్రవర్తించాలో ఆపాటి నాకూ తెలును. అనవసరంగా బోడిసలహాలివ్వకు. అడిగినప్పుడివ్వుచాలు...'' అన్నాడు హరి శ్చంద్ర.

''హుఁ... అంతరాత్మని కూడా గౌరవించ డంచేతగాని వెధవ్వీరా నువ్వు! అయినా నాకెందుకులే, నేను నోరుమూసుకుంటాను'' అంది అంతరాత్మ.

''సరే... మూసుకో అయితే'' అని దానికి గుడ్‌బై చెప్పేసి తన వర్క్‌లో పడిపోయాడు హరిశ్చంద్ర.

★ ★ ★

ఓ మూడ్రోజులు అతిభారంగా గడిచాయి.

ఈ మూడ్రోజుల్లో నాలుగైదు సందర్భాలలో కాస్త ఇబ్బందిపడాల్సివచ్చినా మరో ప్రమాదభరితమైన సమస్యలేం ఉత్పన్నంకాలేదు హరిశ్చంద్రకి తన సత్యసంధత వల్ల.

దాంతో అతనికి బాగానే ధీమావచ్చేసింది- ఫర్వాలేదు తను నెగ్గుకురాగలడని.

ముందుంది ముసళ్ళపండుగని అతనికేం తెలుసు పాపం?

తండ్రి ఓసారి రమ్మని రాసిన ఆ ఉత్తరానికి ఇప్పట్లో రావడానికి వీలుపడదంటూ జవాబు రాసిపడేసినందున ప్రస్తుతానికి అదేం సమస్య కాలేదతనికి.

కాగా ఈ మూడ్రోజుల్లోనూ లాహిరి దర్శనభాగ్యం ఒక్కసారైనా కలగకపోవడం మాత్రం అతన్ని అమితంగా బాధించింది.

కిటికీ దగ్గర గంటలకొద్దీ పడిగాపులుగాసినా ప్రయోజనం లేకపోయింది.

గులాబీ మొక్కలకి ప్రతిరోజూ ఎవరో నీళ్ళు పోస్తున్న ఆనవాళ్ళుమాత్రం కనిపిస్తూనే వున్నాయిగాని ఆమె మాత్రం కానరావడంలేదు.

తను రూమ్‌లో లేనివేళల్లో పోసేస్తున్నారెవరో గులాబీ మొక్కలకి నీళ్ళు. కాని ఆ పోస్తున్నది లాహిరో కాదో తెలియడంలేదు.

అసలామె ఇంట్లో వున్నదీ లేనిదీ కూడా అర్థంకావడంలేదు.

అదేమి విచిత్రమోగాని బంటూకూడా ఇటుకేసి రావడంలేదు. వాడైనా వస్తూవుండుంటే వాడిద్వారా విషయం తెలుసుకోవడానికి వీలయ్యేది.

మొత్తానికి వాడైతే ఇంట్లోనే వున్నాడు. కాని ఒకట్రెండుసార్లు రమ్మని చెయ్యూపినా రాలేదు వెధవ. ఏంపోయేకాలం వచ్చిందోమరి.

పోనీ ఏదో ఒక నెపంతో పూర్ణమ్మగారి దగ్గరికి వెళ్ళి కూపీ లాగుదామా అంటే భయం! "ఎందుకునాయనా దాని ప్రసక్తి నీకు?" అని ఆవిడగాని అడిగితే చచ్చినట్టు తను నిజమే చెప్పి తీరాలి. ఆమెతో తానిప్పటికి మాట్లాడింది లేదు. అలాంటప్పుడు సంభాషణ ఎలా దొర్లుతుందో ఊహించడం కష్టం. ఒకవేళ సంభాషణ తప్పుదోవపట్టి తాను లాహిరిని ప్రేమిస్తున్నాడన్న పచ్చినిజాన్ని ఆమె ముందు వెళ్ళగక్కాల్సివస్తే ఇంకేమైనా వుందా? కొంపలంటుకుపోవూ?

పోనీ రాఘవయ్యతో మాట కలిపి ఏదో ఒకరకంగా విషయం బయటికి లాగుదామా అంటే అది మరింత డేంజరు.

లాహిరి తనని ఏడిపించడానికే ఇలా చేస్తూ వుండాలి. అవునంతే అయ్యుండాలి. ఆమె ఎక్కడికైనా వెళ్ళిందేమో అనుకోవడానికి- గులాబీ మొక్కల కుదుళ్ళు రోజూ తడుస్తూనే వున్నాయిగా? ఆమె లేకపోతే ఎవరు పోస్తారు వాటికి నీళ్ళు.

ఏమోలే... ఆమె లేనంతమాత్రాన పచ్చని మొక్కల్ని ఎండగట్టుకుంటారా ఏమిటి? పూర్ణమ్మగారే పోస్తున్నారేమో!

ఇలా ఎన్నెన్నో విధాలుగా ఆలోచించేస్తూ చిక్కి శల్యమైతే అయిపోలేదుగాని మొహం మాత్రం కళాకాంతుల్లేకుండా చెక్కపేడులా అయిపోయింది హరిశ్చంద్రకి.

సాయంత్రం ఆరుగంటలవేళ-

అప్పుడే బ్యాంకు నుండి వచ్చిన హరిశ్చంద్ర కిటికీ దగ్గర పాతిన రాటలా నిలబడి పెరడంతా కలియజూస్తున్నాడు.. లాహిరిగాని కనిపిస్తుందేమోనని.

"లాహిరీ.. ఏమైపోయావు లాహిరీ?!" అని అతను పిచ్చిపిచ్చిగా లోలోన గొణుక్కుంటుంటే-

"చప్ నోర్ముయ్... ఏమీ అయిపోయి వుండదులే- కంగారుపడకు" అని ఎగతాళిగా అంది అంతరాత్మ.

"అసలే నాలాహిరి కనిపించక నేను కృంగిపోతుంటే మధ్యలో నీగోలేంటి?" అంటూ కోపగించుకున్నాడు హరిశ్చంద్ర.

"నేను నోరు విప్పితే చాలు నీకు నసలాగే వుంటోందీమధ్య. హుఁ... అంతరాత్మ మాట వినక బాగుపడిన వాడెవ్వడూలేడు... తెలుసా?" అంది అంతరాత్మ.

"నువ్ నన్నేం బాగుచేయనక్కర్లేదులే... అయినా చెడిపోతే చెడిపోతాను... మధ్యలో నీకెందుకూ?" అన్నాడు హరిశ్చంద్ర.




''కళ్ళు నెత్తిమీదకెక్కేయిరా నీకు! హుం... నా కెందుకా? నీ బాగోగులు నాక్కాకపోతే ఇంకెవరిక్కావాలిరా?''

''సంతోషమేగాని ఆపు నీరొద!''

అంతరాత్మ రొదని భరించడం ఎవరికైనా కష్టమే. అందునా అలాంటి సందర్భాలలో.

అందుకే హరిశ్చంద్ర తన తలని కిటికీ కమ్మిలకేసి ఠపీఠపీమని బాదుకోసాగేడు.

అంతలో కిసుక్కుమని ఓ నవ్వు.

ఉలిక్కిపడి బాదుకోవడం ఆపేసి ఆ నవ్వు వినిపించిన దిక్కు చూశాడు హరిశ్చంద్ర.

లాహిరి!

అంతే! చెక్కపేడులా వున్న అతని మొహంలో తిరిగి ఎప్పటిలా కళాకాంతులు నిండిపోయాయి.

''బాగున్నావా లాహిరీ! ఏమైపోయావు ఈ మూ(డ్రోజులూ?'' ప్రశ్నించాడు కళ్ళతో.

లాహిరి ఓ మారు వాళ్ళ ఇంట్లోకి తొంగి చూసి చకచకా అడుగులేస్తూ కిటికీ దగ్గరకొచ్చింది.

''ఎందుకండీ అలా తలబాదుకుంటున్నారు?'' అడిగింది వీలైనంత తగ్గుస్వరంతో.

''అంతరాత్మ రొదచేస్తుంటే భరించలేక బాదుకుంటున్నానండీ! అది సరేగాని గత మూడురోజులుగా మీరు కనిపించనేలేదు- ఏమైపోయారు?'' అన్నాడు హరిశ్చంద్ర ఆత్రంగా.

''మా ఫ్రెండు మ్యారేజీకి గుంటూరెళ్ళానండీ'' అంది లాహిరి..

''నిజమా... మరి నాకు చెప్పలేదేం?''

''ఇది మరీ బావుంది. నేనెక్కడికయినా వెళ్తే మీకు చెప్పి వెళ్ళాలని రూలుందా ఏమిటి?''

''లేదనుకోండి... కానీ... కానీ..''

''కానీ లేదు, దమ్మిడీ లేదు... అదిసరే గాని నేను వూళ్ళో లేనుకదాని ఈ మూ(డ్రోజులూ మీ ఇష్టమొచ్చినట్లు ఎడాపెడా అబద్ధాలు గానీ ఆడేశారా ఏంటి?''

''లేదండీ... తల్లి తోడు... ఒక అబద్ధం కూడా ఆడలేదు....''

''మరెన్నాడేరు? మూడా నాలుగా?''

''మీరు భలే విట్టీగా మాట్లాడతారే'' అంటూ నవ్వేశాడు హరిశ్చంద్ర. ''బాగా జరిగిందా మీ ఫ్రెండుమ్యారేజి? ఈ మూ(డ్రోజులూ మిమ్మల్ని చూడకుండా గడపాల్సి వచ్చినందుకు నాకెంత బాధగా అనిపించిందో తెలుసా?''

''ఎందుకు బాధ?''

''అదేంటండీ అలా అంటారు, అన్నీ తెలుసుండీ కూడా'' అని బుంగమూతిపెట్టాడు హరిశ్చంద్ర.

అంతలో ''లాహిరీ !'' అంటూ పూర్ణమ్మగారి పిలుపు వినిపించడంతో- ''మా అమ్మ పిలుస్తున్నట్లుంది- మళ్ళీ కలుస్తానండీ'' అంటూ గబగబా వెళ్ళిపోయింది లాహిరి.

ఆమె అన్న ఆ చివరి ముక్క హరిశ్చంద్ర గుండెపై పన్నీటి జల్లు కురిపించింది.

''మళ్ళీ కలుస్తానండీ'' అని అంత శ్రద్ధగా చెప్పి వెళ్ళిందీ అంటే- ఆమె తననేం అల్లాటప్పాగాడిగా భావించడం లేదన్నమాట! ఆమె హృదయంలో ఎక్కడో ఓ చోట తనకి చోటు ఏర్పడిందన్నమాట.

అవునంతేగా మరి? లేకపోతే అసలామెకి పనిగట్టుకుని దగ్గరకొచ్చి తనని పలకరించిపోవాల్సిన అవసరమేమిటి?

అన్నిరోజులు అనుభవించిన బాధనంతా మర్చిపోయి మిఠాయిపొట్లం దొరికిన పసిపిల్లాడిలా తెగసంబరపడిపోయాడు హరిశ్చంద్ర ఆ క్షణంలో.



''బాగున్నావా బంటూ? ఏం రావడం మానేశావేం ఈమధ్య నా రూమ్‌కి?''



"ఎందుకులెండి ఊరికూరికే వచ్చి మిమ్మ ల్ని చచ్చిపోయేలా చేయటం..." బింకంగా తలెగరేశాడు బంటూ.

"ఓస్ అదా! అందుకా నువ్ రావటం మానేశావు? ఆరోజంటే ఏదో మైండ్ బాగోలేక అలా ప్రాణం తీసుకోవడానికి ప్రయత్నించాను. రోజూ అలాగే ఎందుకు చేస్తాను? మరేం ఫర్వా లేదు. ఇకనుండి ఎప్పటిలా వస్తూండు..." అన్నాడు హరిశ్చంద్ర.

"ప్రయత్నిస్తాలెండి"

"ఓరి నీబడాయి మండిపోనూ" అనుకున్నా డు హరిశ్చంద్ర. వాణ్ణి దగ్గరకు తీసుకుని పక్కనే కూర్చుండబెట్టుకుంటూ అడిగాడు- "ఏంటి ఏదైనా పనిమీద వచ్చావా?"

"అవునండీ... మా అక్కయ్య మీ దగ్గర జండూబామ్ వుంటే అడిగి తీసుకురమ్మంది" చెప్పాడు బంటూ.

"ఏం మీ అక్కయ్యా గారికి తలనొప్పి వస్తోందటనా?"

"కాదండీ కాలుజారి బాత్‌రూమ్‌లో పడిందంట! కాలు బెణికింది..."

హరిశ్చంద్రకి అమితమైన బాధ కలిగింది లాహిరికి కాలు బెణికిందని తెలియగానే. ప్రే యసికి కాలు బెణికిందని తెలిస్తే ఏ ప్రియుడి కి మాత్రం బాధ కలక్కుండా వుంటుంది?!

"అరెరేఁ... ఎంతపనైందీ! పాడు బాత్ రూం... పాడు బాత్‌రూం... నేలంతా పాకుడు కట్టేసింది గావల్ను! ముదనష్టపు వెధవని నేనైనా వెళ్ళి క్లీన్ చేశానుగాదు... బాగా బెణి కిందా? మీ అక్కయ్యగారు బాగా బాధపడుతు న్నారా? ఏమిటో - నాదేవి కాలికి స్వయంగా జండూబామ్ రాసి సేవచేసుకునే భాగ్యం నాకు లేకుండాపోయింది! హుఁ... నికృష్టపు జన్మ అసలే నాదేవి చాలా సుకుమారమైనది! ఆమె కే జరగాలా ఇలా?" అపరిమితమైన బాధ కలిగినందువల్ల ఆ బాధతో ఏం మాట్లాడుతు న్నాడో తనకే తెలియనిస్థితిలో ఏదేదో అనేయ సాగాడు హరిశ్చంద్ర.

మళ్ళీ పిచ్చి స్టార్టయ్యింది కాబోలనుకున్న బంటూ, ఒక పక్క పారిపోదామా వద్దా అని ఆలోచిస్తూనే- "మా అక్కయ్యకి కాలు బెణికితే మధ్యలో మీకెందుకండీ పిచ్చెక్కడం?" అనడి గాడు సందేహంగా చూస్తూ.

"నేను మీ అక్కయ్యని ప్రేమిస్తున్నాను గనక..."

"ఏంటీ? - మీరు మా అక్కయ్యని ప్రేమిస్తు న్నారా?"

బంటూ అలా రెట్టించి అడిగేకగాని హరి శ్చంద్రకి తాను చేసిన తప్పు తెలిసిరాలేదు.

అడ్డెడ్డే ఎంత పొరపాటైపోయిందీ? బాధలో ఒళ్ళు మర్చిపోయి పుసుక్కున నోరు జారేశాడు తను! ఇప్పుడెలా? ఎలా వీడి నోరుమూ యించడం!!

హరిశ్చంద్రకి తిరుపతి వెంకన్నస్వామి గు ర్తుకొచ్చాడు. శ్రీశైలం మల్లిఖార్జునస్వామి గుర్తు కొచ్చాడు. సింహాచలపు వరాహనరసింహస్వా మి గుర్తుకొచ్చాడు. ఇంకా చాలా చాలామంది గుర్తుకొచ్చారు.

"అన్ని కొండలపై వున్న అందరు దేవుళ్ళా రా! సర్వమతాలకూ చెందిన సకలదేవుళ్ళా రా! నన్ను కాపాడండి! కాపాడండహో నన్ను కాపాడండి!! రక్షించండహో ఈ దీనుణ్ణి రక్షించండి" అని ఎలుగెత్తి వేడుకున్నాడు ఆల్ గాడ్స్‌ని- పైకి కాదు మనసులో.

"చెప్పరేంటండీ... మీరు నిజంగా మా అక్క య్యని ప్రేమిస్తున్నారా?" మళ్ళీ రెట్టించాడు బంటూ.

"ప్రస్తుతం నేను ప్రే- చేస్తున్నాను బాబూ... సకల దేవుళ్ళనూ ప్రే- చేస్తున్నాను.

"ప్రే చేయడం అంటే?"

"ప్రార్థించడం"

"ప్రార్థించడం అంటే?"

"ఒన్‌టైప్ ఆఫ్ బెగ్గింగ్... అడుక్కోవడం అన్న మాట!... దేవుళ్ళని అడుక్కోవడం..."

"ఏమని అడుక్కుంటున్నారు దేవుళ్ళని?"

"నన్నీ ఆపదనుంచి గట్టెక్కించమని..."

"ఏ ఆపదనుంచి?"

హరిశ్చంద్ర దండెం వేపు చూశాడు. కాని దానిమీద లుంగీ లేకపోవడంతో తన ఒంటి మీద వున్న లుంగీనే పీకేసుకున్నాడు. తర్వాత




దాని రెండు కొసల్నీ రెండు చేతుల్తో పట్టుకుని తాడు షేప్ వచ్చేలా దాన్ని మెలిదిప్పసాగాడు...

బంటూకి అర్థమైపోయింది హరిశ్చంద్ర ఏంచేయబోతున్నాడో- "వద్దండీ మీరు చచ్చిపోకండీ... నేను వెళ్ళిపోతాన్లే మీరు చచ్చిపోకండీ..." అన్నాడు గాభరాగాభరాగా.

"నో... నువ్ వెళ్ళిపోవడం కాదు ఈ సమస్యకు పరిష్కారం. నిజంగా నీకు నేను బ్రతకాలని వుంటే అందుకొక్కటే మార్గముంది. నేను మీ అక్కయ్యాని ప్రేమిస్తున్నానని నీతో చెప్పినట్టు నువ్వింకెవ్వరితోనూ చెప్పకూడదు... సరేనా?" అన్నాడు హరిశ్చంద్ర దీనాతిదీనంగా చూస్తూ.

"సరేలేగాని ముందు జండుబాం ఇవ్వండి..."

"ఇవ్వను... నేను మీ అక్కయ్యాను ప్రేమిస్తున్నానన్న సంగతి నువ్వెవ్వరితోనూ చెప్పనని ఒట్టేస్తే తప్ప ఇవ్వను..."

"ఇవ్వకపోతే మానేయండి... నాకేంకాదు కాలు బెణికింది. మా అక్కయ్యకి..." అనేసి పరుగులంకించుకున్నాడు బంటూ.

"బంటూ...బంటూ...బంటూ..." అంటూ వాడి వెంటపడబోయి ఠక్కున ఆగిపోయాడు హరిశ్చంద్ర. ఎందుకంటే అతను కేవలం కట్ డ్రాయిర్‌తో మాత్రమే ఉన్నాడు...లుంగీయేమో తాడు షేప్‌ని సంతరించుకుని అతని చేతిలో వుంది. మరి ఎలా వెంబడించగలడు పాపం?

★ ★ ★

వీధివరండాలో వాలుకుర్చీలో కూర్చుని ఉన్న రాఘవయ్య రాకెట్‌లా దూసుకొస్తున్న బంటూని చూసి—"ఏంట్రా ఆ పరుగులు? ఏం నెమ్మదిగా రాలేవా?" అని కోపంగా గసిరాడు.

"మరే ఆ పిచ్చాయన...ఆ పిచ్చాయన...ఎంటేంటో వాగుతున్నాడు నాన్న?" అన్నాడు బంటూ రొప్పుతూ.

రాఘవయ్య ఆశ్చర్యంగా- "ఏ పిచ్చాయన్రా?" అన్నాడు.

"ఇంకె పిచ్చాయన...మనింట్లో ఉండటంలా...అతనే!"

"అతను పిచ్చాయనెందుకయ్యాడురా! తప్పు అలా అనకూడదు..." అన్నాడు రాఘవయ్య మందలింపుగా.

"భలేవాడివే...నీకింకా తెలియదా? అతనికి పిచ్చే!"

"ఎవర్రా అంది?"

"ఆయనే చెప్పాడు..."

"నీతో ఏదో తమాషాకి అనివుంటాడులే..."అని నవ్వేశాడు రాఘవయ్య.

బంటూ అడ్డంగా తలాడిస్తూ—"తమాషాక్కాదు నాన్నా! అతనికి నిజంగానే పిచ్చి! అతనికి బాగా పిచ్చెక్కువైపోయిందనుకో...అప్పుడేం చేస్తాడో తెలుసా?" అన్నాడు.

"ఏం చేస్తాడు?" అడిగాడు రాఘవయ్య.

"చచ్చిపోవటం కోసమని లుంగీని మెడకి చుట్టేసుకుంటాడు..."

"నిజంగానా?"

"నిజంగా నాన్నా! అన్నట్టు అతను మన అక్కయ్యాని ప్రేమిస్తున్నాడంట..."

అదిరిపడ్డాడు రాఘవయ్య. "ఏంటీ?" అంటూ నోరు వెళ్ళబెట్టుకు చూశాడు.

"అవున్నాన్నా! అతను మన అక్కయ్యాని ప్రేమిస్తున్నాడంట!"

"అలాగని అతనే చెప్పాడా నీతో?"

"అవును...మళ్ళీ అలా చెప్పినట్టు ఎవరితోనూ చెప్పొద్దని బ్రతిమాలేడు..."

రాఘవయ్య భృకుటి ముడిపడింది. "సర్లే ఈ విషయాలు ఎవరితోనూ అనకు" అన్నాడు తలపంకిస్తూ.

ఓ పావుగంట తర్వాత రాఘవయ్య హరిశ్చంద్ర రూమ్‌లో ఉన్నాడు.

"ఐపోయింది...నా పనైపోయింది! క్లోజ్-నా చాప్టర్ క్లోజ్?"అనుకున్నాడు హరిశ్చంద్ర రాఘవయ్యని చూడగానే.

"ఏంటిసార్ ఇలా వచ్చేరు?" అన్నాడు సాధ్యమైనంత ధైర్యంగా ఉండేందుకు ప్రయత్నిస్తూ.

"ఏంలేదోయ్...ఊరికే పలకరించిపోదామని...అంటూ గదంతా కలయజూసి—"రూమ్

నదుపాయంగా ఉందా...''అన్నాడు రాఘవయ్య.

''సదుపాయంగానే ఉంది సార్'' అన్నాడు హరిశ్చంద్ర—''ఇదేంటబ్బా ఈయన మండి పడిపోకుండా ఇలా కుశలప్రశ్నలు వేస్తున్నా''డని లోలోన ఆశ్చర్యపోతూ.

''అన్నట్టు మీదే ఊరన్నావ్?''

చెప్పాడు హరిశ్చంద్ర—ఫలానా ఊరని.

''కూర్చోండి సార్'' అన్నాడు కుర్చీ చూపిస్తూ.

''మీ నాన్నగారేం చేస్తుంటారు?'' అడిగాడు రాఘవయ్య కూర్చున్నాక.

''జంపాల అచ్యుతరామయ్యగారని...టీచరు సార్?''

''మీకు ఆస్తిపాస్తులేమైనా ఉన్నాయా?''

''రెండుగేదెలూ, ఓ పాత పెంకుటిల్లూ తప్ప మరేంలేవు సార్!

''ఎంతమంది మీరు?''

''నేనూ, మా చెల్లాయీ ఇద్దరమే సార్?''

''మీ చెల్లాయికి పెళ్ళయిందా?''

''కాలేదు సార్. ఇంకా చదువుకుంటోంది. ప్రస్తుతం టెన్త్...''

''నీ జీతమెంత?''

ఎందుకడుగుతున్నాడబ్బా ఈయన ఈ వివరాలన్నీ అనుకున్న హరిశ్చంద్రకి అలనాడు వామన్రావ్‌తనతో అన్న మాటలు గుర్తుకొచ్చాయి!

సో...సందేహంలేదు. బంటూగాడు వెళ్ళి విషయం ఈయన చెవిలో ఊదేసి ఉంటాడు. స్వతహాగా పీనాసిగనక, వామన్రావన్నట్టు కట్నంలేకుండా లాహిర్నీ తనకి అంటగట్టడానికి వీలవుతుందేమోననిలోపాయికారిగా ఎంక్వయిరీ చేయడానికే ఈయన వచ్చివుంటాడు.

''హర్రిగా! నీరొట్టి విరిగి నేతిలో పడబోతుందిరా!'' అనుకున్నాడు హరిశ్చంద్ర. అలా అనుకుంటుండగా బోలెడంత ఆనందం వేసిపోయి తనకు తెలియకుండానే చంకలు గుద్దుకున్నాడు.

రాఘవయ్య ఆశ్చర్యంగా చూస్తూ- ''ఎందుకోయ్ అలా చంకలు గుద్దుకుంటున్నావ్...'' అనడిగాడు.

''నారొట్టె విరిగి నేతిలో పడబోతున్నదన్న సంతోషం కొద్దీ...'' చెప్పాడు హరిశ్చంద్ర.

''అంటే?'' అన్నాడు రాఘవయ్య.

''అంటే ఏముందండీ?... నారొట్టె... మై బ్రెడ్... అది విరిగి నేతిలో పడబోతోంది. అందుకని ఆనందంవేసి చంకలు గుద్దుకున్నానండీ!''

''నీరొట్టె?''

''అవునండీ... నారొట్టె... మై ఓన్ బ్రెడ్...''

రాఘవయ్య మనసులో- ''తమాషాక్కాదు నాన్నా! నిజంగానే అతనికి పిచ్చి!'' అన్న బంటూ మాటలు ప్రతిధ్వనించాయి.

''నువ్వెప్పుడైనా లుంగీని మెడకు చుట్టుకుని ఆత్మహత్యా చేసుకోవడానికి ప్రయత్నించావా?''

''బంటూగా ఒరేయ్... నిన్నేం చేసినా పాపంలేదురా!'' అనుకున్నాడు హరిశ్చంద్ర.

''ప్రయత్నించానండీ!'' అన్నాడు నిజం ఒప్పుకుని తీరాలి గనక.

''నీకు పిచ్చి అని ఎప్పుడైనా ఎవరితోనైనా చెప్పేవా?''

''పిచ్చి అనైతే చెప్పలేదుగాని మైండ్ సరిగ్గా పన్జేయదని మాత్రం చెప్పేనండీ...'' అన్నాడు హరిశ్చంద్ర.

''నిజంగా నీకు మైండ్ సరిగ్గా పన్జేయదా?''

''ఎందుకు పన్జేయదండీ?''

''మరైతే ఎందుకు చెప్పేవలా?''

''కొన్నికొన్ని సందర్భాలలో అలా చెప్పాల్సి వస్తుందదండి''

''ఎలా?''

''మైండ్ సరిగ్గా పన్జేయదని...''

''మైండ్?''

''యస్... మైండ్...''

''అసలు నీకది ఉందా?''

''ఏమోనండీ'' అనేసి... అనేశాక నాలుక్కరుచుకుని- ''లేకేమండీ... ఉంది...'' అన్నాడు

హరిశ్చంద్ర.

రాఘవయ్య ముఖంలో ఏ భావమూ కనబడ లేదు. ''సరే... నేవెళ్ళొస్తానోయ్'' అనేసి లేచి వెళ్ళిపోయాడాయన.

హరిశ్చంద్రకి ఆయన రాకనీ, పోకనీ ఎలా అర్థం చేసుకోవాలో బుర్రబద్దలు గొట్టుకున్నా సరే తెలిసి చావలేదు.

''యూ ఫూల్! ఇంత తెలివితక్కువ దద్దమ్మ వేంట్రా నువ్వు...? ఇందులో బుర్రబద్ధలుగొట్టుకో వాల్సిందేముంది? ఆయన వచ్చింది నువ్వను కున్నట్టు లాహిరిని నీకొస్తే ఎలా ఉంటుందా అని టెస్ట్ చేయడానికే! కాని ఆయన వెళ్ళింది మాత్రం ఎలా వెళ్ళేడో తెలుసా?- నీకు పిచ్చి అని పూర్తిగా కన్ఫర్మ్ చేసుకుని వెళ్ళేడు...'' అంది అంతరాత్మ పడిపడి నవ్వుతూ.

హరిశ్చంద్రకి ఒళ్ళు భగభగామండిపో యింది. కరుగుతున్న తారుడ్రమ్ములో ముంచి లేపినట్టనిపించింది.

''నువ్ నోర్మూయ్యవే ముండకానా!'' అని దాన్ని కోప్పడి, ''జగమేమాయ... బతుకే మాయ...'' అనే పాట మొదలుపెట్టేడు మన శ్శాంతికోసం.

★ ★ ★

''మన హరిశ్చంద్రలేడూ? అతనికి కాస్త పిచ్చిలా ఉందే...'' అన్నాడు సంబరంగా రాఘవయ్య.

''హరిశ్చంద్ర ఎవరండీ?'' అంది పూర్ణమ్మ.

''హరిశ్చంద్రే!.... మన రూమ్లో అద్దెకుండ టంలేదూ- అతను...''

పూర్ణమ్మ ఆశ్చర్యపోతూ- ''ఏంటీ అతనికి పిచ్చా?'' అంది. ఆమె కళ్ళలో జాలిగూడుక ట్టుకుంది.

''అవును... నేనిప్పుడే వెళ్ళి టెస్ట్చేసి వస్తు న్నా!''

''అతనికి పిచ్చయితే మీరు సంబరపడిపో వడం దేనికి?'' అందామె భర్త ముఖం మతా బులా వెలిగిపోతుండటం గమనించి.

''అదంతేలే! అన్నట్టు అతన్ది మనకులమే తెలుసా?'' అన్నాడు రాఘవయ్య.

''మనకులపు కుర్రాడికి పిచ్చి అని తెలి సినందుకు బాధపడాల్సింది పోయి సంబరప డటం దేనికి?''

''నీకేమీ తెలియదే పిచ్చి మొహమా. ఇలా దగ్గరికి రా చెబుతాను'' అంటూ ఆమెను చెంతకు పిలిచి ఆమె చెవిలో గుసగుసగా చెప్పాడు రాఘవయ్య.

''ఛీ'' అంది పూర్ణమ్మ రాఘవయ్య చె ప్పింది విని.

''ఛీ ఏంటే నీ మొహం? ఏం అతనికేం తక్కువ- బ్యాంకులో ఉద్యోగం. కాకపోతే కాస్త మెంటలుందనుకో... దాందేముంది అడ్జస్ట్ అయిపోవచ్చు...''

''చాల్లే ఊరుకోండి... మెంటలని తెలిశాక కూడా బంగారంలాంటి పిల్లని అతనికిచ్చి గొంతుకోద్దామంటారేంటి... ఎవరైనా వింటే నవ్విపోతారు'' అంది కోపంగా పూర్ణమ్మ.

రాఘవయ్య ఫెళ్ళున నవ్వి- ''ఎవడే ఆ నవ్విపోయేది? ఆ నవ్విపోయే వెధవలకసలు డబ్బు విలువ తెలుస్తేగా ... బంగారం లాంటి కుర్రాడు. కనీసం యాభైవేలకి తక్కువ చేయ డు. కాకపోతే మెంటలుందిగాబట్టి ఆసాకుతో సునాయాసంగా అయిదారువేలకి బేరం కుది ర్చేసుకోవచ్చు'' అన్నాడు నాలుక చప్పరిస్తూ.

''హుం... అన్నీ లేకిబుద్ధులే'' అనుకుంది పూర్ణమ్మ. ''ఉన్నది ఒక్కగానొక్క ఆడపిల్ల. దాని కి కట్నం ఇవ్వడానికి ఏడిచ్చస్తారేంటండీ మీ రు'' అంది తిరస్కారంగా చూస్తూ

''నీకేం తెలియదు. నువ్వూరుకో.. అమ్మా యిమీద నీకే కాదు నాకూ ఉంది ప్రేమ. ఆ అబ్బాయి మనమ్మాయిని ప్రేమిస్తున్నాడంట. ప్రేమిస్తున్న వాడికిచ్చి చేస్తే అమ్మాయి సుఖప డుతుందిగదా అని నాఆశ'' అన్నాడు రాఘవ య్య.

''ఏంటీ?'' అంటూ దవడలు నొక్కుకుంది పూర్ణమ్మ.

''అవునే... నిజం..'' అన్నాడు రాఘవయ్య.

పూర్ణమ్మ సాధారణంగా దుందుడుకుగా మాట్లాడే రకం కాదు. కాని ఈ సందర్భంలో మాత్రం ఆమె తనని తాను నిగ్రహించుకోలేక పోయింది. ''సిగ్గు లేకపోతేసరి. ఓ కుర్రకుంక మీ అమ్మాయిని ప్రేమిస్తున్నానని చెబితే అత




న్ని నాలుగు దులిపి రాపడంపోయి- అదేదో గొప్ప వార్తలా సంబరపడిపోతూ చెబుతున్నారా? హుం ఇదేనా ఆడపిల్ల తండ్రికుండాల్సిన లక్షణం?... వాళ్ళాళ్ళెగాసి అర్జంటుగా అతన్ని రూమ్ ఖాళీ చేసేయమని చెప్పండి ముందు" అంటూ దాదాపు విరుచుకుపడినంత పనిచేసింది.

"మనమ్మాయిని ప్రేమిస్తున్నట్టు అతనేం చెప్పలేదులే నాతో..." అన్నాడు రాఘవయ్య ఒకింత తగ్గిపోతూ.

"మరెవరు చెప్పేరు?" అంది పూర్ణమ్మ తీక్షణంగా చూస్తూ.

"బంటూ...."

"బంటునా? వాడికెవరు చెప్పేరట?"

"అతనే చెప్పేడట"

"ఏ రాయయితేనేం పళ్ళూడగొట్టుకోవడానికి! మనమ్మాయిని ప్రేమిస్తున్నట్టు అతని నోటి వెంట వచ్చాక ఇంకా ఊరుకోవడం ఏంటి? ఇప్పుడే వెళ్ళి చెప్పేసి రండి. తెల్లారేసరికల్లా రూమ్ ఖాళీ చేసేయమని..." అంది పూర్ణమ్మ.

"అతనికి నిజంగా పిచ్చోకాదో ఇంకా పూర్తిగా నిర్ధారణ కాలేదు లేవే. ఒకవేళ అతనికి పిచ్చి లేకపోతే మన లాహిరిని అతనికివ్వడానికి నీకేం అభ్యంతరం లేదుగా?" అన్నాడు రాఘవయ్య.

పక్క గదిలోంచి ఈ సంభాషణంతా ఆలకిస్తూ ఉన్న లాహిరి గతుక్కుమంది.

పూర్ణమ్మ కొరకొరా చూస్తూ అంది- "ఇప్పుడేగా అన్నారు. టెస్ట్ చేసి వచ్చానని, మళ్ళీ ఇంతలోనే మాటమారుస్తున్నారా?"

"టెస్టంటే ఏదో పైపైన పరీక్షించానంతే! తీరు కాస్త అవకతవగ్గా అనిపించిందంతే! అంతమాత్రానికే పిచ్చి అని అనేసుకోవాలి?... అసలు పిచ్చివాళ్ళకెవ్వరు బ్యాంక్‌లో ఉద్యోగాలివ్వరు తెలుసా?" అన్నాడు రాఘవయ్య.

"నిజమే సుమా" అనిపించింది పూర్ణమ్మకి. దాంతో కన్విన్స్ అయిపోతూ- "కుర్రాడు బానే ఉంటాడండీ... పోనీ కదిపి చూడండి... కుదిరితే చేసేద్దాం..." అంది.

భార్య అంత తొందరగా దార్లోకొచ్చినందుకు రాఘవయ్య చాలా సంతోషపడిపోయాడు.

"మారావా...ఉత్తపుణ్యానికి కంగారుపడిపోయి ఏవేవో అనేశావు? నేనేం తెలివితక్కువవాణ్ణా?" అన్నాడు గర్వంగా చూస్తూ.

"అతను ప్రేమిస్తున్నాడు సరే...అమ్మాయికి ప్రేమో కాదో కనుక్కోవద్దూ?" అంది పూర్ణమ్మ.

"వాసిమొహం...చిన్నపిల్ల దానికేం తెలుసు..." అనేశాడు రాఘవయ్య.

అవతలి గదిలోని లాహిరికి ఒళ్ళు మండిపోయింది ఆ మాటలకి. "చిన్న పిల్లనా...నేను...చిన్నపిల్లనా? కళ్ళు సరిగ్గా కనిపించడం లేదు కాబోలు" అని లోలోన గొణుక్కుంది.

కులం ఒకటైనంత మాత్రాన, అందులో పుట్టినంతమాత్రాన, ఎవరికి పడితే వారికి కట్టబెట్టేయాలని శాసనమేనా??

ఏముందని ఆ హరిశ్చంద్రకి...ఒకారా? పోడా? పోనీ హైటయినా ఆరడుగులుండి చచ్చిందా అంటే అదీ లేదు. మహావుంటే అయిదడుగుల పదకొండంగుళాలు వుంటాడేమో?

"నోర్ముయ్యవే! నువ్ మహాపొడుగరివా ఏంటి... నీ ఫైవ్ ఫోర్ హైట్‌కి నీపక్కన అతను బాగానే వుంటాడులే...." అని లాహిరి అంతరాత్మ కోప్పడలేదు. ఎందుకంటే ఆమెకు అంత రాత్మని మాటిమాటికీ కెలకరించే అలవాటు అసలు లేదు.

"అదేంమాటండీ...తల్లితండ్రులకి తమ పిల్లలెప్పుడూ చిన్నవాళ్ళలాగే కనబడతారు...అంతమాత్రంచేత పెళ్ళివిషయంలో కూడా వాళ్ళ అంతర్యం తెలుసుకోవాల్సిన పని లేదా?"

తల్లి అలా అనడం వినిపించి- "శభాష్? తల్లి వంటే నువ్వమ్మా! తల్లివి" అనుకుంది లాహిరి.

"నెమ్మదిమీద తెలుసుకోవచ్చులే...ముందా కుర్రాణ్ణి మనమ్మాయిని ఇంకాస్త గాఢంగా ప్రేమించనీ..."

తండ్రి అలా అనడం వినిపించి- "యాక్ థూ? నువ్వేం తండ్రివి నాన్నా? నీ పినాసితనం

తగలెయ్యా'' అనుకుంది లాహిరి.

''మతిలేని మాటలు మాట్లాడకండి. అత న్ని మీ అల్లుడిగా చేసుకోదలిస్తే పెద్దతరహాగా వెళ్ళి అతని తల్లిదండ్రులతో మాట్లాడి సంబంధం ఖాయం చేసుకురావాలి. అంతే గాని ప్రేమించనీ అని చూస్తూ వూరుకోవడం ఏంటి? హవ్వ? లోకంలో ఎక్కడయినా వుందా ఇది?''

''నీకేం తెలుసే వెర్రిదానా...మనకై మనం వెళ్ళి వాళ్ళ తల్లిదండ్రులను కదలేస్తే వాళ్ళు కనీసం యాభైవేలైనా అడుగుతారు. మనకు లంలో ఎంతెంత కట్నాలు తీసుకుంటున్నారో నీకు తెలియదా ఏంటి?...అది కాదు చేయా ల్సిన పని. మనం చూసీచూడనట్టుండి మన మ్మాయిని అతను మరింత గాఢంగా ప్రే మించేలా చేయాలి. అప్పుడు అతనే వస్తాడు మన కాళ్ళ దగ్గరికి. అప్పుడు ''మేం కట్నం ఇవ్వలేమయా చేసుకుంటే చేసుకో'' అన్నామ నుకో- చేసుకోక చస్తాడా?''

అలా అని రాఘవయ్య ఫెళ్ళున నవ్వు తుంటే ఫటిల్మని ఒక్కటిచ్చుకుందామా అన్నంత కోపం వచ్చింది లాహిరికి.

వాటె పెక్యూలియర్ ఫాదర్?

ఈలోకంలో ఎక్కడైనా ఎవరికైనా వుంటారా ఇలాంటి తండ్రులు? అనుకుంది వెగటుగా.

ఈ సంభాషణ హరిశ్చంద్రగాని ఆలకిస్తే ఇంకేమయినా వుందా? పేట్రేగిపోడూ?

ఆ అతని బొందలే...అతను పేట్రేగాలన్నా తను పేట్రేగనిస్తుందా ఏంటి?

తల్లి ఏమంటుందో విందామని మళ్ళీ చెవు లు రిక్కించింది లాహిరి.

కాని అంతలో బంటుగాడు- ''పువ్వాయ్... పువ్వువ్వాయ్...'' అంటూ కారులా పెద్ద రొదచే సుకుంటూ అక్కడికి రావడంతో తల్లిఏమన్నదో వినే అవకాశం ఆమెకు కలగలేదు.

తండ్రి భుజం మీది కండువాను దులుపు కుంటూ హరిశ్చంద్ర రూమ్‌వేపు వెళ్ళడం మాత్రం కనిపించింది.

ఈయన అటువేపు వెళ్తున్నాడెందుకబ్బా?

కొంపదీసి లేడికి లేచిందే పరుగన్నట్టు ''మా అమ్మాయిని ప్రేమిస్తున్నావటగా? కట్నం తీసుకోకుండా చేసుకునేట్టయితే చేసుకో నాకేం అభ్యంతరం లేదు'' అని ఇప్పటికిప్పుడే చె ప్పేసి రాడుగాదా?!

ఏమో? అలాగే వుంది ఆ దూకుడు చూ స్తుంటే అనుకుంది లాహిరి. కాని అంతలోనే ఇల్లు అలకగానే పండక్కాదుగదా? ఈయన చెప్పినంతమాత్రాన అయిపోతుందా ఏంటి? తను ఒప్పుకుంటే గదా?'' అని సరిపెట్టు కుంది లాహిరి.

ఊహల్లో లాహిరితో ఏదేదో మాట్లాడేసు కుంటూ తనలోతానే ముసిముసిగా నవ్వు కుంటూ వున్న హరిశ్చంద్ర అనుకోకుండా వచ్చిన రాఘవయ్యని చూసి- ''రండిసార్ రండి'' అన్నాడు కంఠంలో సాధ్యమైనంత ఆప్యాయతనీ గౌరవాన్నీ ధ్వనింపచేస్తూ.

''ఏంటోయ్ నీలో నువ్వే ఏదో నవ్వేసు కుంటున్నావు?'' అంటూ వచ్చి కూర్చున్నాడు రాఘవయ్య.

తన అంతరాత్మ చెప్పిందాని ప్రకారం తనకి పిచ్చి అని ఖరారు చేసుకుని వెళ్లిపోయాడు కదా ఈ పెద్దమనిషి! మరి మళ్ళీ వచ్చేడేంట బ్బా?! అనుకుంటూ-

''బ్రహ్మచారినిగదా...'' అన్నాడు హరి శ్చంద్ర.

''అయితే?''

''బ్రహ్మచారులన్నాక ఏవేవో పగటికలలు కనడం సహజం కదండీ? మీరొచ్చే సమయాని కి నేనూ ఏదో పగటికల కంటూ ఆ కలలో ఓ అమ్మాయి వేసిన జోక్‌కి నాలో నేను నవ్వు కుంటూ వున్నాను'' అన్నాడు హరిశ్చంద్ర

''ఏంటా పగటికల? ఎవరా అమ్మాయి

''పెద్దవారు మీరిలాంటి విషయాలు గ గుచ్చి అడక్కూడదు సార్! ఈ చెవితో విని చెవితో వదిలేయాలి అంతే!'' అన్నాడు హరి శ్చంద్ర. అబద్ధం ఆడితే తప్పుగాని మాట దాటవేయడంలో తప్పులేదుగా!

''ఆ అమ్మాయి మా అమ్మాయేనని నాకు తెలునులేవయ్యా'' అని మనసులో అనుకుని-

''అవున్లే... కుర్రకారన్నాక ఏవేవో కుర్ర కుర్ర కలలు కంటూ వుంటారు. మాలాంటివాళ్ళం




అవన్నీ అడగటం బావుండదులే..." అన్నాడు రాఘవయ్య.

"అబ్బ... నువ్వెంత మంచివాడివి మామయ్యా" అనేయబోయి తమాయించుకున్నాడు హరిశ్చంద్ర. తమాయించుకున్నాక అనిపించిందతనికి తమాయించుకోవడం మంచిదే అయిందని. ఒకవేళ తనుగాని నోరు జారి అలా అనేసి వుంటే ఒక రకంగా తను అబద్దం ఆడినట్టేగా? ఎందుకంటే రాఘవయ్య ప్రస్తుతానికి తనకి మావయ్యలాంటివాడే తప్ప పూర్తిగా మావయ్య అయిపోలేదుగా?!

అంతలో "మరీ ఇంత ఓవర్ సిన్సియారిటీ పనికిరాదురా పిచ్చివెధవా!" అంటూ గోల చేసింది అతని అంతరాత్మ.

"నోర్ముయ్" అన్నాడు హరిశ్చంద్ర. సాధారణంగా అతను అంతరాత్మతో మాట్లాడేటప్పుడు పైకి మాట్లాడడు కాని అతని ఖర్మకొద్దీ ఈసారి మాత్రం ఆ మూడక్షరాలూ అతనికి తెలియకుండానే అతని పెదవిదాటి బైటికి వచ్చేశాయ్.

"వాట్!" అన్నాడు రాఘవయ్య ముఖం గంటుపెట్టుకుంటూ.

"అరె... అదేంటంటే?" అన్నాడు హరిశ్చంద్ర కంగారుగా.

రాఘవయ్య నిప్పులు గక్కుతూ అన్నాడు. "ఏం నువ్వయితే అనచ్చా మరి నోర్ముయ్ అని?"

హరిశ్చంద్ర "శివశివా" అంటూ చెవులు మూసుకుని, "అపచారం అపచారం" అంటూ చెంపలు వేసుకున్నాడు.

"మీరు చాలా అపార్థం చేసుకున్నారుసార్! నాకు పెద్దలంటే మా చెడ్డ గౌరవం! అలాంటిది తమనలా అంటానా సార్! మిమ్మల్ని కాదు నేను నోర్ముయ్యమంట... నా అంతరాత్మని"

"అంతరాత్మనా? నాకు తెలిసి ఎవరూ అంతరాత్మతో పైకి మాట్లాడరు. నీ ధోరణి భలే విచిత్రంగా వుందే...?" అన్నాడు రాఘవయ్య.

"ఏదోలెండిసార్! అంతా నా ఖర్మ. మొత్తానికి తెలిసోతెలియకో మిమ్మల్ని నొప్పించాను- నన్ను మన్నించండి..." అంటూ చేతులు జోడించాడు హరిశ్చంద్ర.

రాఘవయ్యకి అది చాలా ముచ్చటగా అనిపించింది. "ఈకాలంలో పెద్దలపట్ల ఇంత భయభక్తులూ వినయవిధేయతలూ గల కుర్రవాళ్ళు చాలా అరుదు..." అనుకుని సంతోషించాడు. "ఫర్వాలేదు లేవోయ్... అది సరే నువు భోజనం ఎక్కడ చేస్తున్నావ్?" అనడిగాడు.

"హోటల్ మయూరిలో సార్!"

"బావుంటుందా?"

"ఏంబాగులెండిసార్, అదే బాగు! ఇంతకుముందెప్పుడూ హోటల్ కూడు తిన్నవాణ్ణికాదు. చచ్చిపోతున్నానంటే నమ్మండి. ఆ కూడు తినలేక..." అన్నాడు హరిశ్చంద్ర. హోటల్ కూడు అతని కళ్ళముందు మెదిలింది గావల్ను... ముఖం చాలా వికారంగా అయిపోయింది.

"అంత బాధపడుతూ ఆ హోటల్ కూడు తినటం దేనికోయ్ మా ఇంట్లో పేయింగ్ గెస్టుగా వుండరాదా పోనీ?"

రాఘవయ్య మంచితనానికి హరిశ్చంద్రకి బుర్రగిర్రున తిరిగిపోయింది.

"నిజంగా అంటున్నారాసార్?" అన్నాడు ఆశ్చర్యంగా చూస్తూ.

"అదేంమాటోయ్? నిజంగా కాకపోతే ఉత్తుత్తినే అంటారా ఎవరైనా?"

"అయితే నిజంగానే అన్నమాట! అబ్బ మీరెంత మంచివారు సార్! బ్రహ్మచారి వెధవనని సంకోచించకుండా రూమ్ ఇచ్చిందిచాలక పైగా కమ్మటి భోజనం కూడా పెట్టిస్తానంటున్నారు- అంటే... ఓహ్... మీ మంచితనాన్ని ఎలా కొనియాడాలో అర్థంకావటంలేదు సార్..." సంతోషాతిరేకంతో కంఠం పూడుకుపోయింది హరిశ్చంద్రకి.

"ఈపాటిదానికే అంతలా పొగడాలా అబ్బాయ్? మనం మనం పరాయివాళ్ళమా ఏంటి? మరేమీమొహమాటపడబోకు. ఇవ్వాళ రాత్రినుంచి నీ భోజనం మా ఇంట్లోనే". అన్నాడు రాఘవయ్య.

"అబ్బే ఎందుకులెండిసార్! అనవసరంగా

మీకు శ్రమ...'' అన్నాడు హరిశ్చంద్ర.

''శ్రమాపాడా... నువ్వింకేం మాట్లాడకు... నేను మాటన్నాను అంటే మాటే... దానికిక తిరుగులేదు. రాత్రికి మా ఇంటికొచ్చేసేయ్



భోజనానికి...'' ఆర్డర్ జారీ చేస్తున్న ధోరణిలో అని- ''మరి నేను వెళ్ళొస్తానేయ్...'' అంటూ లేచాడు రాఘవయ్య.

★ ★ ★

హరిశ్చంద్రకు రాఘవయ్య తన ఇంట్లో భోజన సౌకర్యం కల్పించడంలో నిజానికతని మంచితనం ఏమీలేదు. ఆ విధంగా అతను

తమ ఇంటికి వస్తూపోతూ తమ కుటుంబంలో ఓ సభ్యుడిగా మెలుగుతూవుంటే లాహిరిపట్ల అతనికిగల ప్రేమ మరింత ప్రబలమవుతుందన్న దూరాలోచనకొద్దీ రాఘవయ్య ఆ ఏర్పాటుచేశాడు. అంతే!

పూర్ణమ్మ మొదట దీనికి చాలా తీవ్రంగా వ్యతిరేకించింది. "బ్రహ్మచారి అని తెలిసికూడా మనమతనికి రూమ్ అద్దెకిచ్చినందుకే - ఇప్పటికే చాలామంది మనల్ని డబ్బుకి కక్కుర్తి పడ్డామంటున్నారు. అలాంటిదిక భోజనం కూడా పెడ్తే, ఏమో అసలే పాడులోకం, రేపొద్దున్న ఏకానిమాటో పుట్టించినా పుట్టించొచ్చు...



ఏ విధంగా చూసినా ఇదేమంత మంచిపనికాదు...'' అంటూ నచ్చచెప్పబోయింది రాఘవయ్యకి. కాని అతను పట్టినపట్టు విడవలేదు. దాంతో ఇంక చేయగలిగింది లేక ఊరకుండిపోయిందామె.

ఆరాత్రి భోజనాలప్పుడు గుత్తివంకాయ కూరని హరిశ్చంద్రకు తనే స్వయంగా కూర వడ్డిస్తూ - ''మా అమ్మాయి లాహిరి గుత్తి వంకాయ వండటంలో ఎక్స్‌పర్ట్. రుచిచూసి చెప్పవోయ్ ఎలావుందో...'' అన్నాడు రాఘవయ్య.

హరిశ్చంద్రకు పాపం మొదట్నుంచీ వంకాయకూరంటే తగని ఎలర్జీ.

రాఘవయ్య అలా అనేసరికి చచ్చాన్రా భగవంతుడా అనుకున్నాడతను. అసలు వడ్డిస్తున్నప్పుడే వద్దండీ వంకాయ నాకు సహించదని వారిద్దామనుకున్నాడుగాని... మొదటిరోజే నాకిది సహించదు అది సహించదు అని లిస్ట్‌చదవడం ఏంబావుంటుంది లెమ్మని ఊరుకున్నాడు.

చచ్చిన ఎలుకని తోక పట్టుకుని పైకి లేపినట్టు గుత్తి వంకాయని తొడిమ పట్టుకుని పైకి లేపి క్షణకాలంపాటు దానికేసి భయభయంగా చూశాడు హరిశ్చంద్ర.

''ఏంటోయ్ అలా చూస్తున్నావ్. బ్రహ్మాండంగా వుంటుంది తిను. నోట్లో పెట్టుకుంటే వెన్నలా కరిగిపోవాల్సిందే. మా లాహిరి చేసింది'' అన్నాడు రాఘవయ్య.

లాహిరి చేసింది అన్నమాటకి - నాగస్వరానికి నాగు ఆకర్షింపబడినట్లు ఆకర్షితుడై పోయి గుత్తివంకాయని తొడిమతోసహా ఆత్రంగా నోట్లో కుక్కేసుకున్నాడు హరిశ్చంద్ర.

ఆ తర్వాత చూడాలి అతని అవస్థ. అటు మింగనూ లేడు ఇటు కక్కనూ లేడు.

స్వతహాగా వంకాయంటే ఎలర్జీ కాబట్టి నిజానికది కిరసనాయిలు కంపుకొట్టకపోయినా కిరసనాయిలు కంపే కొడ్తున్న అనుభూతి.

ససేమిరా మింగుడు పడనంటోంది వంకాయ.

పోనీ ఊసేద్దామా అంటే ఏమనుకుంటారోనన్న భయం.

నోటినిండా వంకాయ వుండటంతో ముక్కూమూతీ ముందుకు చొచ్చుకొచ్చి అచ్చం హనుమంతుడి ముఖంలా అయిపోయింది అతని ముఖం.

అతనికేసి కన్నార్పకుండా చూస్తోంది పూర్ణమ్మ.

ఇదేంటితను సడన్‌గా హనుమంతుడిలా అయిపోయాడని చెప్పి రాఘవయ్యా కూడా కన్నార్పకుండా చూడసాగేడు.

ముచ్చటగా మూడునిముషాలు గడిచినా హరిశ్చంద్ర ముఖంలోంచి హనుమంతుడి ఫేస్ తొలిగిపోలేదు.

దాంతో పూర్ణమ్మకి సందేహం వచ్చేసింది. ఇతనికి మెంటలన్నమాట నిజమేలా వుంది చూడబోతే! లేకపోతే ఏంటి - డైనింగ్‌టేబుల్ దగ్గరా కోతి చేష్టలు?! అనుకుందామె.

''ఏంటండీ ఇతని వరస?'' అన్నట్టు కళ్ళతో ప్రశ్నించింది రాఘవయ్యని.

''అదే నాకూ అర్ధంకావడంలేదే'' అన్నట్టు పెదవి విరిచి- ''అదేంటి హరిశ్చంద్రా అలా వుండిపోయావు... గుత్తివంకాయ చాలా బావుంటుంది... తిను... '' అన్నాడు రాఘవయ్య.

''అక్కుఁ... అక్కుఁ... అక్కుఁ...'' అన్నాడు హరిశ్చంద్ర... దాని అర్ధం నాకు వంకాయసహించదండీ అని.

''ఏమంటున్నావో అర్ధంకావడంలేదు. వంకాయని మింగేసైనా చెప్పు, లేదా ఊసేసైనా చెప్పు'' అన్నాడు రాఘవయ్య.

''అక్కుఁ... అక్కుఁ... అక్కుఁ...'' అన్నాడు హరిశ్చంద్ర మళ్ళీ. దీని అర్ధం— మింగుడుపడ్డంలేదండీ అని.

''ఏంటిబాబూ ఏంటి నీగోల?'' అంది పూర్ణమ్మ.

''అక్కుఁ... అక్కుఁ... అక్కుఁ...'' అని మూడుసెకన్ల కాలం గ్యాప్ యిచ్చి— ''అక్కుఁ అక్కుఁ అక్కుఁ అక్కుఁ...'' అన్నాడు హరిశ్చంద్ర. దీని అర్ధం ఏమిటో ఆ భగవంతుడికే తెలియాలి.




రాఘవయ్యకి చిరాకెత్తిపోయింది. "అక్కూ లేదు బొక్కూలేదు. మింగవయ్యా స్వామీ మింగు" అన్నాడు కోపంగా చూస్తూ.

హరిశ్చంద్ర మళ్ళీ- "అక్కూఁ అక్కూఁ అక్కూఁ" అంటూండగా పూర్ణమ్మ రాఘవయ్యని జబ్బ పుచ్చుకుని పక్కగదిలోకి లాక్కెళ్ళిపోయి– "ఛీ మీరేం మనిషండీబాబూ! అతనికి పిచ్చి అని అంత స్పష్టంగా అర్థమైపోతుంటే-- లేదంటారేం? మీకెంత డబ్బు కాపీనమైతేమాత్రం– హవ్వ– అలాంటివాడికా పిల్లనిద్దామంటున్నారు? అతనికి బ్యాంకు ఉద్యోగం కాదుగదా, కలెక్టర్ ఉద్యోగం వున్నాసరే నేను చచ్చినా ఈ పెళ్లికి ఒప్పుకోను ఆఁ..." అంది రుసరుసలాడుతూ.

"అబ్బ ఆగవేబాబూ ఎందుకలా తొందరపడిపోతావ్..." అంటూ ఆమె నోరు మూసి– "అవన్నీ తర్వాత మాట్లాడుకుందాంలే..." అతన్నలా ఒంటరిగా వదిలేసి మనమిలా మధ్యలో వచ్చేయడం బావుండదుపద" అంటూ ఆమెను నెట్టుకుంటూ డైనింగ్ హాల్లోకి తీసుకువెళ్ళాడు రాఘవయ్య.

ఆశ్చర్యం!

వీళ్లు వెళ్లేసరికి హరిశ్చంద్ర ముఖం అచ్చం హరిశ్చంద్ర ముఖంలాగే వుంది. హనుమంతుడి ముఖంలా లేదు.

దాంతో గుత్తివంకాయని అతను మింగేసి వుంటాడులెమ్మనుకున్న రాఘవయ్య– "ఎలా ఉందోయ్ వంకాయ్?" అన్నాడు ఇంకో వంకాయ్ని వడ్డించడానికి గరిటెను చేతిలోకి తీసుకుంటూ.

"పరమఛండాలంగా వుందండీ... ఛూ కిరసనాయిలు కంపు" అన్నాడు హరిశ్చంద్ర ముఖాన్ని వికారంగాపెట్టి అబద్ధం చెప్పలేక.

"కిరసనాయిలు కంపా నీమొహమా..." అనుకుంది పూర్ణమ్మ లోలోన మండిపడుతూ. నిజానికా గుత్తివంకాయకూరను వండింది ఆవిడే! కాకపోతే లాహిరి ఇమేజ్ని హరిశ్చంద్రలో పెంచేయడానికి రాఘవయ్య అలా అబద్ధం చెప్పాడంతే!

"మా ఎవ్వరికీ లేనికిరసనాయిలు కంపు నీఒక్కడికే ఎలా వచ్చిందయ్యా? అదీగాక మేమసలు కిరసనాయిలేవాడం... మాది గ్యాస్ వంట!" అందామె కరుగ్గా. నిజానికామె చాలా సౌమ్యంగా వుండే మనిషి. దానికితోడు ఆమె ముఖం కూడా ఎప్పుడు చూసినా నవ్వుతున్నట్టే వుంటుంది. అలాంటిది హరిశ్చంద్ర విషయం విన్నప్పటినుంచి ఆమె తన సహజప్రవృత్తికి భిన్నంగా చిర్రుబుర్రులాడుతూనే వుంది. మెంటలేమోనన్న అనుమానం వున్న వ్యక్తికి భర్త కూతుర్ని ఇవ్వజూస్తున్నాడని తెలిస్తే ఏ ఆడది మాత్రం స్థిమితంగా వుండగలుగుతుంది?

"ఏమోనండిమరి... నాకలా అనిపించింది. అదీగాక నాకు వంకాయంటే మొదట్నుంచీ సహించదండీ..." అన్నాడు హరిశ్చంద్ర తలదించేసుకుంటూ.

"మరి ఆ విషయం ముందే చెప్పొచ్చుగా! ఇష్టంలేని వాడివి నోట్లో కుక్కుకోవడం దేనికీ అక్కూ బుక్కూ అక్కూ బుక్కూ అని హంగామా చేయడందేనికి?" దులపరించి పారేసినట్టుగా అంది పూర్ణమ్మ. మెంటల్గాడికి మర్యాద ఇవ్వకపోతే ఏంలే అన్న అలసత్వం కావచ్చు.

"పోనీలేవే కొత్తగదా. మొహమాటం పడుంటాడు--" అన్నాడు రాఘవయ్య, ఇంక ఊరుకో అన్నట్టు చూస్తూ.

"ఇంతకీ ఆ వంకాయ్ని ఏంచేశావ్? తినేశావా?"

"లేదండీ ఊసేశాను..."

"ఊసేశావా... ఏదీ మరెక్కడా కనబడదే..."

"టేబుల్మీద ఊస్తే మీరు బాధపడతారేమోనని బనీన్లో దాచేశానండీ..." అంటూ బనీన్లో చేయిపెట్టి వంకాయని బైటికి తీశాడు హరిశ్చంద్ర.

అది చూసి- "భలేవాడివయ్యా మొత్తాని-" కంటూ పూర్ణమ్మా, "టేబుల్మీద పడేస్తే పోయేదానికి ఇదేం పిచ్చి పనయ్యా" అంటూ రాఘవయ్య పడిపడి నవ్వేశారు.

మొత్తానికి ఎలాగోలా ఆపూటకి భోజనకార్యక్రమం ముగిసింది. హరిశ్చంద్ర వెళ్లిపోయాక– "సందేహంలేదండీ అతనికి పిచ్చే!" అంది పూర్ణమ్మ.




# జండు బామ్
## జలుబు, తలనొప్పి, బాధల్ని క్షణంలో పోగొట్టేది.

పనులూ ఆగిపోకూడదు, తలనొప్పీ పోవాలి. అందుకోసం జండు బామ్. తలనొప్పి మాత్రమే కాదు, జలుబు-రొంప, నడుం నొప్పి, కీళ్ల నొప్పులు, కండరాల నొప్పులు, బెణుకులు, వీటన్నిటి నుంచి ఉపశమనాన్నిస్తుంది. ఇటువంటి ఇంకే ఇతర బామ్ కన్నా కూడా ఎంతో ఎక్కువ ప్రభావం గలది.

రంగు లేనిది కావడం వల్ల మరకలు పడతాయేమోననే భయం లేదు. జిడ్డు లేనిది కావడం వల్ల, మీరు ఇంట్లోనైనా, బయటనైనా మాలిష్ చేసుకోవచ్చు. పైగా ఇది సువాసన గలది కూడా.

జండు బామ్‌ని తక్కువ మోతాదులో వాడితే చాలు. అంచేత ఇది పొదుపైనది. కోమలమైన చర్మాన్ని కూడా లాలిస్తుంది. అందుకే తల్లులంతా తమ కుటుంబం కోసం జండు బామ్ కావాలంటారు. కొనేటప్పుడు, సీసా మీద ఎర్ర సీల్‌ని చూసి మరీ కొనండి.

5, 10, 30, గ్రాములలో దొరుకుతోంది.




**జండు బామ్ నొప్పి హరించే బామ్**

ULKA-Z-1-89 TEL

హరిశ్చంద్ర కంగారుపడ్డాడు- "అబ్బే ఎందుకండీ... ఊరికే అడిగానంతే! అదిసరేగా నిసార్... ఏదో పరాయివాడికి వడ్డించినట్టు నన్నిలా ఒంటరిగా కూర్చోబెట్టి భోజనంపెట్టడం ఏంబావుండలేదు... అదీగాక పూటా ప్రత్యేకంగా ఇలా నాఒకడికే వడ్డించాలంటే ఆడవారికి శ్రమగదా... మీ కభ్యంతరం లేకపోతే ఇకనుంచి నేనూ మీ అందరితోపాటే భోంచేస్తాను..." అన్నాడు క్రీగంట లాహిరికేసి చూస్తూ.

"ఏంపరాయివాడివిగాక ఇంటల్లుడివానాయనా?..." అన్నట్టు కోపంగా చూసింది ఆమె.

"అలా కోపంగా చూడకండీ... నాకు భయం..."

"కోపంగా చూశానా...నేనా?... నేనెప్పుడు కోపంగా చూశానోయ్?" ఆశ్చర్యంగా అన్నాడు రాఘవయ్య.

"అహఁహ... మీరుకాదులెండి..."

"మరెవరూ?..."

"ఆమె...ఆమె...అదే మీ అమ్మాయిగారు. లాహిరిగారు..."

రాఘవయ్య కూతురివేపు తిరిగి అడిగాడు- "ఏమ్మా నువ్గాని కోపంగా చూశావా ఇతనికేసి?"

"అవున్నాన్నా..." అంది లాహిరి ముసిముసిగా నవ్వుతూ.

"ఎందుకూ?" అన్నాడు రాఘవయ్య.

"ఈమధ్య నాకెందుకో తిక్కతిక్కగా వుంటోందినాన్నా... ఉత్తుత్తికే కోపం వచ్చేస్తోంది ఎందుకోగాని"

"అయితే నీకు పెళ్ళిమీద గాలిమళ్ళిందన్నమాట!" అనుకున్నాడు రాఘవయ్య మనసులో. విన్నావుగా... ఉత్తుత్తికేనటలే కోపంగా చూస్త! - "ఊఁ...ఇంక నువ్కానియ్" అన్నాడు హరిశ్చంద్రవేపు తిరిగి.

"కాస్త చారు వడ్డిస్తారా?"

"అదేంటోయ్... చారుతో స్టార్ట్ చేస్తారా ఎవరైనా భోజనం!? కూర కలుపుకోముందు" అన్నాడు రాఘవయ్య- "మొత్తానికి మెంటల్ గాడివనిపించావే" అని లోలోన అనుకుంటూ...

హరిశ్చంద్ర ముందే చారు పోయమన్నది మెంటల్ డిసార్డర్‌వల్లకాదు. ఆ నెపంతో లాహిరిని డైనింగ్‌టేబుల్ దగ్గరికి రప్పించాలని, ఆమె తనకి చారు వడ్డిస్తుంటే పొరపాటున ఏ పమిటకొంగో తనకి తగిలితే హాయిగా వుంటుంది కదాని!

"పోనీలే... నాన్నా ఆయనకి ముందే చారుతో తినటం అలవాటు గాబోలు!...అదిగో ఆ గిన్నెలో వుంది-మీరే వడ్డించుకోండి..." అంది లాహిరి నించున్న చోటునుండి కదలకుండా.

తానాశించిన దానికి వ్యతిరేకంగా జరిగినందుకు హరిశ్చంద్రకి చాలా నిరుత్సాహం వేసింది. చెప్పొద్దు లాహిరి మీద కోపం కూడా వచ్చేసింది. కాని బహిరంగంగా కోప్పడే హక్కు తనకింకా ఏర్పడలేదు గాబట్టి లోపల్లోపలే గింజుకుపోతూ గత్యంతరం లేక తానే చారు వడ్డించుకున్నాడు. నోరుజారిన పాపానికి పాపం చారుతో భోజనం స్టార్ట్ చేయకతప్పలేద తనికి. అతను తింటుంటే పక్కన కూర్చుని కబుర్లు మొదలుపెట్టేడు రాఘవయ్య.

"నీ వయసెంతోయ్?"

"ఇరవై అయిదు..."

"మంచివయసు..."

"అదేంటండీ మంచివయసు, పెద్ద వయసు అని రెండురకాలుంటాయా?"

"అహఁ... నాఉద్దేశం అదికాదోయ్...పెళ్ళి చేసుకోవడానికి తగిన వయసంటున్నాను. అన్నట్టు నీకు దగ్గర సంబంధాలేమైనా వున్నాయా? అంటే మేనత్త కూతుళ్ళుగాని...మేనమామ కూతుళ్ళుగాని..."

హరిశ్చంద్ర లాహిరివేపు చూశాడు. చూసి తల దించుకుని చెప్పాడు- "నాకు మేనత్తల్లేరండీ. ఒక మేనమామ వున్నాడు ఆయనకి మాత్రం ఓ కూతురుంది. కల్పలతనీ, ఎత్తువళ్ళండీ, చాలా వికారంగా వుంటుంది..."

"అయితే ఇహనేం చేసుకో...నీలాంటి మారుతికారు కూడా లేనిమొహానికి అంతకన్నా మంచమ్మాయెందుకూ?" అనుకుంది లోలోన లాహిరి.




''ఆ అమ్మాయిని నీకిచ్చే ఉద్దేశమేమయినా వుందా?'' ''వాళ్లకయితే యిచ్చే ఉద్దేశం వుంది గాని నాకు మాత్రం చేసుకునే ఉద్దేశం బొత్తిగా లేదండీ...''

''ఏం-ఎత్తుపళ్ళనా? అందంగా వుండదనా?''

హరిశ్చంద్ర మాట్లాడలేదు.

''మాట్లాడవేమోయ్? ఏంవేరే ఎవరినైనా ప్రేమిస్తున్నావా ఏంటి కొంపదీసి?''

గొంతులో వెలక్కాయ అడ్డుపడినట్టయింది హరిశ్చంద్రకి. భయంభయంగా చూశాడు లాహిరివేపు.

ఆమె కొంటెగా తనవేపే చూస్తూ వుంది ''ఊఁ చెప్పరేం?'' అన్నట్టుగా కవ్విస్తూ వున్నాయ్ ఆమెకళ్లు. ''అవునండీ'' అంటూ తల దించుకున్నాడు హరిశ్చంద్ర.

''ఎవరోయ్ ఆ అదృష్టవంతురాలు?''

''అదృష్టం అంట అదృష్టం...ఇంతోటి గొప్ప మొహం ఇంకెక్కడా దొరకదనీ...'' అనుకున్న లాహిరి-''ఊఁ...చెప్పండి...'' అన్నట్టుగా చూసింది హరిశ్చంద్ర వేపు.

''ఆ... అదృష్టవంతురాలా అండీ? ఆ అదృష్టవంతురాలు ఒక అదృష్టవంతురాలండి. చాలా అందమైన అమ్మాయండీ...చాలా మంచిది కూడానండీ...ఆమె ముక్కు సంపెంగలా వుంటుందండీ...కళ్లు మీనాల్లా...''

హరిశ్చంద్రకి అడ్డు తగుల్తూ అన్నాడు రాఘవయ్య-''నిన్ను ఆ అమ్మాయి అందాన్ని వర్ణించమని అడగలేదు...ఆ అమ్మాయి పేరడిగానంతే!''

''పేరాండీ? పేరు!...అందమైన పేరేనండీ! ఆ పేరు ఎంత అందంగా వుంటుందీ అంటే...''

మళ్ళీ అడ్డుపడ్డాడు రాఘవయ్య హరిశ్చంద్రకి- ''పేరు వర్ణన కాదు నాక్కావల్సింది...పేరు...ఆమె పేరు...''

''పేరాండీ! చాలా బ్యూటిఫుల్ నేమండీ...వాళ్ల ఫాదర్ పెట్టుంటాడండి బహుశా! కూతురికి అంత అందమైన పేరు పెట్టినందుకు నిజంగా ఆయన ఉత్తమాభిరుచిని అభినందించి తీరాల్సిందేనండీ! కొంతమంది ఫాదర్లు వాళ్ల అందమైన కూతుళ్ళకి గూనమ్మ అనీ గంగమ్మ అనీ ఏదేదో పిచ్చిపేర్లు పెట్టేస్తూ వుంటారండీ! కానీ వాళ్లఫాదర్ అలాంటివాడు కాదండి...విజ్ఞుడు...మేధావి...దేవుడితో పోల్చదగ్గ ఉత్తముడు...''

నోట్లో గరాటుపెట్టి, అందులో తేనె పోస్తున్నట్టుగా అనిపించింది రాఘవయ్యకి-హరిశ్చంద్ర అలా అంటుంటే! ''నువ్ చాలా తెలివైనవాడివిబాబూ! అందుకే ఆయన యొక్క గొప్పతనాన్ని ఇంత ఇదిగా గుర్తించగలిగావు...నీలాంటి తెలివైనవాడిని ఎవరైనా మెంటల్‌గాడంటే వాళ్ల కళ్ళు తప్పనిసరిగా పోతాయ్...ఆఁ...'' అన్నాడు ఆనందంతో బాలెన్స్ తప్పిపోతూ-

''ఛఛ... అంత మాటనకండిసార్! మీ బంటూగాణ్ణి కళ్లులేని కబోదిగా నేనూహించలేకపోతున్నాను...'' అన్నాడు హరిశ్చంద్ర బాధగా ముఖంపెట్టి.

లాహిరి నవ్వాపుకోలేక గోడవైపు తిరిగిపోయింది. ''ఐతే మా బంటూగాడు నిన్ను మెంటల్‌గాడన్నాడా?''

''ఒకసారి కాదు సార్...చాలా సార్లన్నాడు,..''

''అలాగా-రానియ్-ఆ వెధవని నాలుక చీరేస్తా!'' అని హరిశ్చంద్రని అనునయించి- ''ఇంతకీ మీ మేనమామ కూతుర్ని నువ్ చేసుకునేది లేదంటావ్...'' అన్నాడు రాఘవయ్య.

''అవున్సార్! చచ్చినా చేసుకోను...''

''చాలు ఈ ఒక్కమాట మీద నువ్ గట్టిగా నిలబడు... మిగతా వ్యవహారం నేన్నడిపించేస్తాను'' అనుకున్నాడు రాఘవయ్య. ''సర్లేసర్లే... ముందు నువ్ భోజనం కానియ్...కబుర్లలో పడి సరిగ్గా తింటున్నట్టు లేదు...'' అన్నాడాప్యాయంగా.

''ఎందుకు తింటంలేదూ...బాగానే మింగుతున్నాడు ఒకపక్క కబుర్లు చెబుతూనే...'' కసిగా అనుకుంది లోలోన లాహిరి.

★ ★ ★

''ఏమంటున్నారు మీరు? నేనోడిపోయానా? శివశివా...మీతో పందెం-అదేలెండి మీరు పరీక్ష పెట్టిం దగ్గరినుంచి ఒక్క అబద్ధమైనా ఆడలే

దుకదండీ నేను?''

లాహిరి వేపు ఆవేదనగా, బాధగా, కోపంగా, ఆవేశంగా, బిత్తరగా, అదిగా, ఇదిగా, ఏదేదోగా చూస్తూ నెత్తిబాదుకున్నాడు హరిశ్చంద్ర.

''నేనంటే ఇష్టంలేకపోతే చెప్పేసెయండి... అంతేగాని నామీద ఇలాంటి అభాండాలు మాత్రం వేయొద్దు. ఇంత వరకూ అభాండర హితుడిగా చాలా స్వచ్ఛంగా బతుకుతున్నాను నేను-తెలిసిందా? ఆఁ '' అన్నాడు నెత్తిబాదు కున్నాక.

''ఇందాక మా నాన్నగారు మీరు ప్రే మించిన అమ్మాయి పేరడిగితే ఎందుకు చెప్ప లేదు మీరు?'' పిడికిలి బిగించిన కుడిచేతిని స్పీడుగా ఊపేస్తూకళ్లు చికిలించింది లాహిరి.

''అఫ్‌కోర్స్... చెప్పకపోతే చెప్పకపోయి వుండచ్చు... కాని నేనేం అబద్ధం ఆడలేదుగా? తెలివిగా మాటమార్చేసి ఆ టాపిక్ మారిపోయే లాచేశా... అదీ తప్పేనా?'' అన్నాడు ఉద్రేకంగా హరిశ్చంద్ర.

''తప్పా తప్పున్నరా?-ఇలా నిజం చెప్పాల్సి వచ్చినప్పుడల్లా మీరు మాట మార్చేస్తూ పోతుంటే ఇక నాపరీక్షకి అర్థమేముంటుంది? హుఁ ...ఇలాంటి వంకర తెలివితేటలతో అన్నమాట ఇన్నిరోజులూ నెట్టేసుకొస్తున్నారు! నిజం చెప్పాల్సి వచ్చినప్పుడల్లా ఇలా మాట మార్చేస్తూ వుంటేనో, ఆ ప్లేస్ నుండి పారిపోతూ వుంటేనో, లేక ఎందుకొచ్చిన గొడవ లెమ్మని అసలు నోరే విప్పకుండా మౌన వ్రతంపూనితే నో-మీరనే ఏ ముంది. ఏ అల్లాటప్పాగాడైనా ఇట్టే గెలిచేయగలడీ పందేన్ని... ఎదుటివ్యక్తి మిమ్మల్నేదయినా అడిగినప్పుడు, దానికి సమాధానం మీకు తెలిసివుంటే అది ఎంత కఠోరమైనదైనా సరే కంపల్సరీగా చెప్పి తీరాలి. అదీ నిజాయితీ అంటే... ఆఁ...'' అంది లాహిరి.

డైనింగ్‌టేబుల్ వద్దర అతని వ్యవహారం చూశాక లాహిరికి భయం పట్టుకుంది-అలా తెలివిగా మాట తప్పించేసేటట్టయితే ఏడా దేం ఖర్మ అతనబద్ధం చెప్పకుండా జీవితాంత మూ వుండిపోగలడని. అందుకే ఇప్పుడామె ఈ సరికొత్త అమెండ్‌మెంట్ చేసింది.

''ఇది చాలా అన్యాయం! నేను గెలిచేస్తాన న్న భయంతో మీరిలా ప్లేటు ఫిరాయిస్తున్నారు. మొదట మనం అనుకున్నప్రకారం అబద్ధమా డకూడదన్నది ఒక్కటే కండిషను. ఇప్పుడీ అమెండ్‌మెంటేవిటీ?'' అన్నాడు హరిశ్చంద్ర ఉక్రోషంగా చూస్తూ.

''అదేంకాదు... మొదట కూడా నా ఉద్దేశం ఇదే! కాకపోతే మీరు సరిగ్గా అర్థం చేసుకోలేదు. న్యాయంగా మాట్లాడితే మీరిప్పటికే ఓడిపోయి నట్టు లెక్క. కాని పోన్లే పాపమని మరో అవకాశం ఇస్తున్నాను'' అంది లాహిరి.

అసలే ఈమధ్య తిక్కతిక్కగా వుంటోందని ఇందాక ఆమె చెప్పనే చెప్పింది. ఇప్పుడు గనక ఆమెతో వాదన పెంచుకుంటే తిక్కరేగి పోయి- ''పరీక్షా లేదు గిరిక్షా లేదు... నేనసలు మీ ప్రేమనంగీకరించను పోండి'' అని ఎక్కడ రివర్సైపోతుందో అనిపించి- ''సరే లెండైతే'' అన్నాడు హరిశ్చంద్ర ఏడుపు ముఖంపెట్టి.

''మీవాలకం చూస్తుంటే ఏదో మొక్కుబడికి అంగీకరించినట్టుందే తప్ప-నిజంగా ఆచ రించేలా లేదు. అలాక్కాదు, ప్రమాణస్వీకారం చేయిస్తాను...చేయండి...'' అంది లాహిరి.

''చేయించండి'' అన్నాడు హరిశ్చంద్ర, ఏడుపు ముఖాన్ని మామూలు ముఖంలా కన్ వర్ట్ చేయడానికి వ్యర్థప్రయత్నం చేస్తూ.

''హరిశ్చంద్ర అనబడే నేను....'' అని ఆగింది లాహిరి.

''హరిశ్చంద్ర అనబడే నేను...'' అన్నాడు హరిశ్చంద్ర.

''దేవుని మీద ప్రమాణం చేసి...''

''దేవుని మీద ప్రమాణం చేసి...''

ఈ విధంగా ఆమె చెబుతుండగా తను రిపీట్ చేస్తూ ప్రమాణస్వీకారం పూర్తిచేశాడు హరిశ్చంద్ర.

ఆ ప్రమాణం యొక్క పూర్తిపాఠం ఇలా వుంది-

''హరిశ్చంద్ర అనబడు నేను, దేవునిమీద ప్రమాణం చేసి ఈక్షణం నుండి ఓ ఏడాది వరకూ ఎట్టి పరిస్థితులలోను అబద్ధం ఆడ ననీ, ఎవరితోనైనా ఏదైనా చెప్పకూడని నిజం




చెప్పాల్సివచ్చినపుడు- అట్లు చెప్పకుండా ఉండేందుకై మాటమార్చడంగాని, మవునంగా వుండిపోవడం గాని, దూరంగా వెళ్ళిపోవడంగాని చేయబోననీ, ఇందుమూలంగా కుమారి లాహిరిగారికి హామీ ఇస్తున్నాను! ఈ ప్రమాణాన్ని నేను నిలబెట్టుకోలేకపోయినపక్షంలో ఈ పరీక్షలో నేను ఓడిపోయినట్టుగా అంగీకరించి ఆమెపట్ల నాకు గల ప్రేమను నిర్దాక్షిణ్యంగా చంపుకుంటానని అంగీకరిస్తున్నాను''

''నాతో చేయించారు బానే వుంది... మరి మీరు కూడా చేయండి'' అన్నాడు హరిశ్చంద్ర ప్రమాణస్వీకారం పూర్తయాక.

''నేనెందుకూ చేయడం?''

''ఏమో ఒకవేళ నేను అష్టకష్టాలూ పడి తీరా గెలిచాక మీరు మాటతప్పితే?''

''తప్పను...''

''ఏం -నామీద మీకు నమ్మకం లేనపుడు మీ మీద మాత్రం ఎందుకుండాలి నాకు నమ్మకం? అదేంకుదరదు. మీరు కూడా చేసి తీరాల్సిందే ప్రమాణం'' అన్నాడు హరిశ్చంద్ర గుర్రుగా చూస్తూ.

''సరే కానివ్వండి...'' అంది లాహిరి నాకేం భయం అన్నట్టుగా చూస్తూ.

హరిశ్చంద్ర కూడా ఆమెతో ఇలా ప్రమాణం చేయించాడు.

''లాహిరి అనబడు నేను-దేవునిమీద ప్రమాణం చేసి- నేను పెట్టిన ప్రేమ పరీక్షలో శ్రీ హరిశ్చంద్రగారు గనక విజయం సాధించినట్లయితే - వారిని తప్పకుండా పెళ్ళిచేసుకుంటానని ఇందుమూలంగా వారికి హామీ ఇస్తున్నాను....''

ఈ ప్రమాణస్వీకారం కూడా ఇందాకటి పద్ధతిలోనే జరిగింది. అంటే హరిశ్చంద్ర చెబుతుంతగా లాహిరి రిపీట్ చేసిందన్నమాట!

తర్వాత -

''ప్రమాణంచేశారు... గుర్తుంచుకోండి'' అన్నాడు హరిశ్చంద్ర.

''అదేమాట మీకూ చెబుతున్నాను- ప్రమాణం చేశారు మీరుకూడా గుర్తుంచుకోండి...'' అంది లాహిరి.

''ఈ పరీక్షలో విజయం నాదే!'' అన్నాడు హరిశ్చంద్ర.

''నెవ్వర్..'' అంది లాహిరి.

''చూద్దాంగా...'' అన్నాడు హరిశ్చంద్ర.

''చూద్దాంలే...'' అంది లాహిరి.

''వె వ్వే వ్వే...'' అన్నాడు హరిశ్చంద్ర.

''వె వ్వే వ్వే...'' అంది లాహిరి.

సరిగ్గా అప్పుడే ఆగదిలో కాలు పెట్టిన జంటూ-

''ఏంటిలా ఒకర్నొకరు వెక్కిరించుకుంటున్నారు?'' అన్నాడు ఇద్దరికేసి విచిత్రంగా చూస్తూ.

''ఊరికే తమాషాకి; ఇప్పుడే మేం ప్రమాణస్వీకారాలు చేశాం... అందుకని వెక్కిరించుకుంటున్నాం'' చెప్పాడు హరిశ్చంద్ర. చెప్పి వాడికేసి చిరాగ్గా చూశాడు.

''ఎందుకు వాడికేసి అలా చిరాగ్గా చూస్తున్నారు?'' రవంత కోపం ధ్వనించింది లాహిరి కంఠంలో.

''పానకంలో పుడకలా ఎందుకు రావాలి మరి?'' అన్నాడు హరిశ్చంద్ర. అతని కంఠంలో చిరాకు ఛాయలు ఇంకా పోలా.

''మాటలు తిన్నగా రానివ్వండి. పానకంలో పుడకేంటి? మనమేదో ఇక్కడ లవ్వాడేసుకుంటున్నట్టు?'' అంది లాహిరి తీవ్రంగా చూస్తూ.

''లవ్వే ఆడేసుకోవాలా ఏంటి? ఇద్దరు యువతీయువకుల మధ్యకి ఓ పుడింగిగాడురావడం... వాళ్ళే పరిస్థితులలో వున్నా సరే పానకంలో పుడకతో సమానమే! అఁ...''

''అంటే మీఉద్దేశ్యం... ఇపుడు వీడిక్కడికి రావడం చాలా ఘోరమైన విషయమంటారు?''

''అవును... ఘోరాతి ఘోరమైన విషయం అంటాను...''

''వీణ్ణి తన్నినా పాపంలేదంటారు...?''

''అవును... తుక్కు రేగదన్నినా పాపంలేదంటాను...''

లాహిరి ముఖం ఎర్రబారింది. ''రేయ్




బంటూ, పదరాపోదాం. మనమేం గతిలేక వచ్చాం అనుకుంటున్నారు కాబోలు ఈయన గదికి...'' అంటూ తమ్ముణ్ణి రెక్కపుచ్చుకుని లాగింది.

''పోనీలే అక్కా! పాపం ఒక్కోసారి ఆయనకి మైండ్ సరిగ్గా పన్జేయదులే... అలాంటప్పుడు పిచ్చిపిచ్చిగా వాగుతుంటాడ్లే'' అని హరిశ్చంద్ర వేపు తిరిగి, ''కదండీ?'' అన్నాడు బంటూ.

అవునన్నట్టు తలూపి, ''చిన్నపిల్లాడైనా వాడికున్నపాటి అవగాహన మీకులేకపోయిందే. అయినా నేనన్నది వాణ్ణి. మధ్యలో మీకెందుకూ కోపంరావడం?'' అన్నాడు హరిశ్చంద్ర.

''వాణ్ణంటే ఒకటీ, నన్నంటే ఒకటీనా? వాడు నా తమ్ముడు. ఆ ...'' అంది లాహిరి.

''అబ్బ... ఏదో అన్నాన్లెండి నోరు జారి. దానికింత రాద్ధాంతంచేయాలా?'' అన్నాడు హరిశ్చంద్ర.

''ఏంటీ... నేన్రాద్ధాంతం చేస్తున్నానా?''

''కాదామరి?''

''అబ్బబ్బ... ఊరుకోండయ్యా స్వామీ! ఇప్పుడే ఇలా కీచులాడుకు చస్తున్నారే... రేప్పొద్దున్న పెళ్లయ్యాక ఇంక మిమ్మల్ని పట్టలేం అనుకుంటా...''

అంతే!

హరిశ్చంద్ర, లాహిరల నోళ్ళు ఒకేసారి ఠక్కునమూతబడ్డాయి.

హరిశ్చంద్ర ఓ మారు పైకప్పు కేసి చూసి, తర్వాత గదంతా కలయచూశాడు.

లాహిరి మాత్రం బంటూగాడికేసి తినేసేలా చూసింది.

''విన్నారుగదా అశరీరవాణి ఏమందో. ఇక నుంచైనా కాస్త శాంతంగా వుండండి! పోతే విజయం ఎప్పటికైనా నాదేనని ఇప్పటికైనా తెలుసుకోండి! అశరీరవాణి మాట ప్రకారం మనం కాబోయే దంపతులమన్నది స్పష్టమైపోయిందికదా... అంటే...'' అని ఇంకాఏదో అనబోయాడు ఉత్సాహంగా హరిశ్చంద్ర.

''పటప్... అశరీరవాణా. మీ బొందా? - అలా అన్నది మా తమ్ముడు'' అంది లాహిరి అతనికి అడ్డంపడ్తూ.

''ఏరాబంటూ నువ్వా అలా అన్నదీ?!'' బంటు కేసి విస్మయంగా చూశాడు హరిశ్చంద్ర.

''నేనుకాకపోతే ఇంకెవరంటారండీ అలాంటి ముదురుమాటలు?!'' అంటూ నడుంమీద ఓ చేయివేసుకుని స్టైయిల్‌గా కాలూపేడు బంటూ.

''రేపొద్దున్న మీ పెళ్లయ్యాక అంటున్నావ్ కదా? నువ్వే అలా ఊహించావా లేక ఎవరైనా అన్నారా సీతో?'' ఆసక్తిగా అడిగాడు హరిశ్చంద్ర.

''మానాన్న మా అమ్మతో అంటుంటే విన్నానండీ- మరేమో..'' అని ఇంకా ఏదో చెప్పబోయాడు బంటూ. అంతలో లాహిరి ఠక్కున వాడి నోరు నొక్కేసి- ''చిన్నపిల్లల్ని బులిపించి పరాయివాళ్ల ఇంటి వ్యవహారాలు తెలుసుకోవాలని చూడటం సభ్యతకాదు'' అంటూ హరిశ్చంద్ర వేపు కొరకొరా చూసింది.

హరిశ్చంద్ర ఏదో అనబోయాడుగానీ ఈలోగా ఆమె వాణ్ణి రెక్కపుచ్చుకుని బరబరా అక్కణ్ణుంచి లాక్కెళ్లిపోయింది.

ప్రమాణ స్వీకారం చేశాక ప్రారంభమయ్యాయి హరిశ్చంద్రకి నిజమైన కష్టాలు!

అలనాటి ఆ హరిశ్చంద్రుడు అనుభవించిన కష్టాలు ఓ లెక్కకాదు ప్రస్తుతం ఇతననుభవిస్తున్న కష్టాలతో పోలిస్తే.

ఒకటా - రెండా?... అనుక్షణం కష్టాలే! అడుగడుగునా కష్టాలే!

ప్రమాణస్వీకారం చేసిననాటి సాయంత్రం హరిశ్చంద్ర బ్యాంకు నుండి వస్తుండగా - అతని పక్కనే నడుస్తున్న వాసుదేవరావ్ అల్లంత దూరాన అగుపించిన ఓ అమ్మాయిని చూపిస్తూ, ''ఫిగరు యమాగావుంది కదూ?'' అన్నాడు వాసుదేవరావ్ నడికారు మనిషి. న్యాయంగా ఆ వయసులో అతనికలాంటి పోకిరీ బుద్ధులుండకూడదు. కాని కొంతమంది మగవాళ్ళంతే! ఇంట్లో పెళ్ళికెదిగిన కూతుళ్ళున్నా బయట అదే ఈడుగల అమ్మాయిలను చూసి వెంపర్లాడిపోతారు!

"అవున్సార్... బ్రహ్మాండంగా వుంది" అన్నాడు హరిశ్చంద్ర.

ఆ అమ్మాయి వీళ్లకి పాతికగజాల దూరంలో వుంది. వీళ్లు వెళ్తున్నవైపే వెళ్తోవుంది. అంటే వీళ్లకి కనిపిస్తున్నది ఆమె వీపే అన్నమాట! ఆమె నడుస్తుంటే పొడవాటి ఆమె జడ ఎత్తయిన ఆమె పిరుదలపై ఊగిసలాడుతూ భలే సెక్సీగా అనిపించింది హరిశ్చంద్రకి.

"ఏమో! బ్యాక్‌చూసి మోసపోకూడదు మనం... బ్యాక్ బ్యూటీ, ఫ్రంట్ మునిసిపాలిటీ అన్నట్టు - కొంతమంది వెనకనుంచి ఎంత అందంగా కనిపిస్తారో ముందునుంచి అంతే వికారంగా వుంటారు.." అన్నాడు వాసుదేవరావ్ జ్ఞానబోధ చేస్తున్నవాడికి మల్లే గంభీరంగా నవ్వుతూ. బ్యాంకులో హరిశ్చంద్ర కాస్త క్లోజ్‌గా మూవ్ అయ్యేది వాసుదేవరావ్ ఒక్కడితోనే! పక్కపక్క సీట్లు కావడం ఒక కారణమైతే, రెండోది - తతిమా అందరికంటే వర్క్ విషయంలో ఎక్కువగా అతనే గైడెన్స్ ఇస్తూ వుండటం. ఆ కారణంగా వీళ్లిద్దరిమధ్యా మొదట్లో కంటే ఇప్పుడు బాగా చనువు ఏర్పడింది.

కాసేపటికి వీళ్లిద్దరూ ఆ అమ్మాయిని ఓవర్ టేక్‌చేశారు. చేశాక తల వెనక్కి తిప్పి ఆమె ముఖం వేపు చూశాడు హరిశ్చంద్ర.

అదే సమయానికి ఆమె కూడా అతనివేపే చూట్టంతో ఇద్దరి చూపులూ కలుసుకున్నాయ్.

ఆమెకి అతన్ని ఎక్కడో చూసినట్టనిపించింది. పెద్దగా ఆలోచించనక్కర్లేకుండానే చప్పున గుర్తుకొచ్చేసిందామెకి - 'ఓస్... ఫలానా బ్యాంకులో కదా' అని.

అతను తనవేపే కన్నార్పకుండా చూస్తుండటం గమనించి - "ఏమండీ అలా చూస్తున్నారు?" అని అడిగేసింది సూటిగా కాస్త తెంపుగల ఆడపిల్ల కావడాన.

"ఆత్మవంచన చేసుకోకూడదు నిజం చెప్పు" అంది హరిశ్చంద్ర అంతరాత్మ.

వెంటనే - "మరేంలేదండీ! వెనక నుంచి మిమ్మల్ని చూసి ఫిగరు బాగుందని అనుకుని, ఇంకా మేమిద్దరం కామెంట్స్ చేసుకున్నాంలెండి. ఈయనేమో బ్యాక్ చూసి మోసపోకూడదమో. కొంతమంది వెనకనుంచి బానే వుంటారు గాని ముందునుంచి అసహ్యంగా వుంటారూ- అని జ్ఞానబోధ చేశారండీ... అందుకని మీరు ఎలా వున్నారని చూస్తున్నానండీ! ఈయనన్నట్టు పొత్తిగా మున్సిపాలిటీకాదుగాని మీరు ఏమంత బావులేరండీ..." అని నిజం చెప్పేశాడు హరిశ్చంద్ర.

అంతే. ఆ మరుక్షణం సీమటపాకాయల కట్టకి ఒత్తంటించి డబ్బాకింద కప్పెడితే ఎలాంటి ధ్వని వస్తుందో అలాంటిధ్వని వెలువడింది ఆమె నోటివెంబడి.

అంటే అంత ఫోర్సుగా తిట్టిపోయసాగిందామె. "మీకు అప్పచెల్లెళ్లు లేరా", "మీకు పొయ్యే కాలమా?", "ఉద్యోగాలు వెలగబెడుతున్నారు దేనికీ, సభ్యతుండక్కర్లేదా? సంస్కారం వుండక్కర్లేదా?", "చెప్పుచ్చుక్కొడితే ఏమవుతారో తెలుసా?" "ఛీ", "ఛూ", "నరికి పాతరెయ్యాలి" - ఇలా మధ్యమధ్యలో కొన్ని వాక్యాలు లేదా పదాలు అయితే అర్థమయ్యాయిగాని ఆమె ఏమేం తిట్టిందో పూర్తిగా మాత్రం అర్థంకాలేదు వాళ్లిద్దర్లో ఏ ఒక్కరికీ.

"ఉత్తిదేనండి... ఇతని మాటలు నమ్మకండీ... ఇతనికి పిచ్చి..." అని వాసుదేవరావు ఏదో చెప్పబోయాడుగాని – ఈలోగా- "ఏంటమ్మా? ఏం జరిగిందమ్మా?" అంటూ దారేపోయే నలుగురూ పోగైపోవడం, ఆమెద్వారా విషయం తెలుసుకుని వీళ్లద్దర్నీ తిట్టిన తిట్టు తిట్టకుండా ముక్క చీవాట్లు పెట్టడం జరిగిపోయింది.

అంతలో—

"చూస్తారేంటి నాలుగు తగిల్నియక..." అన్నాడు ఓ అపర్శఆవేశపరుడు. అలాంటి సందర్భాలలో జులాయి వెధవలు కూడా హీరోలైపోవడం సహజం. "మీరు తప్పుకోండి నేను తేల్చేస్తా ఆ వెధవలపని..." అంటూ చొక్కా చేతులపైకి మడిచాడో జులాయి. వాసుదేవరావు- "నేనే పాపమూ ఎరుగను మొర్రో"-మని లబోదిబోమంటుండగా, హరిశ్చంద్ర మాత్రం నిశ్చలంగా కళ్లుమూసుకుని భగవంతుణ్ణి ధ్యానించుకోసాగాడు. "తమ మెప్పులు మారితే మారిపోవచ్చుగాక... మొత్తానికి తానాత్మవంచనకి పాల్పడలేదు!" అన్న తృప్తి అతని ముఖంలో ప్రతిఫలిస్తూ ఉంది.

సమయానికి ఆర్.వి. సుబ్రహ్మణ్యం గనుక ఇంటర్‌ఫియర్ కాకపోయివుంటే వీళ్ళ గతి ఏమైవుండేదోగాని... మొత్తానికి అతనింటర్ ఫియరై వీళ్ళని ఆ ఆపద నుండి గట్టెక్కించాడు. ఆర్.వి. సుబ్రహ్మణ్యం ఓ ట్రాఫిక్ కానిస్టేబులు. వాసుదేవరావుని అతను బాగా ఎరిగున్నవాడు. అంచేత అతని చేయిపైకెత్తిన జులాయిని వారించి, ఆ అమ్మాయికీ, జనాలకీ ఏదో సర్ది చెప్పి... ఎలాగోలా వీళ్ళిద్దర్నీ అక్కడి నుంచి పక్కకితప్పించాడు. పక్కకి తప్పించాక అడిగాడు వాసుదేవరావుని- ఏం జరిగిందని.

హరిశ్చంద్ర మీద పీకల్దాకా కోపంతో మండి పడ్తూవున్న వాసుదేవరావ్ సభ్యతాసంస్కారాలకు తిలోదకాలిచ్చేస్తూ- "ఇదిగో ఈ మెదడు లేని రాస్కెల్ వల్ల జరిగిందండీ అంతా! మా కొలీగేలెండి! ఇన్నాళ్ళూ మనిషే అనుకుంటూ వచ్చాను... ఇప్పుడే తెలిసింది దున్నపోతుకన్నా అధ్వాన్నమని..." అంటూ ప్రారంభించి విషయం వివరించాడు ఆర్.వి. సుబ్రహ్మణ్యానికి.

పేగులు తెగిపోయేలా అంతలేసి మాటలైతే అనలేదుగాని మొత్తానికి అతను కూడా తెగతిట్టిపోసాగాడు హరిశ్చంద్రని.

"తిట్టుకోండయ్యా తిట్టుకోండి... మీఇష్టం వచ్చినట్లు తిట్టుకోండి... నా లాహిరి కోసం నేనెన్ని తిట్లయినా భరిస్తాను..." అనుకుని మవునంగా వుండిపోయాడు హరిశ్చంద్ర. "శభాష్... అలా వుండాలి ప్రేమంటే" అంటూ అభినందించింది అతని అంతరాత్మ.

అది లగాయితు అతనికీ వాసుదేవరావ్‌కి మాటల్లేకుండాపోయాయి. పైపెచ్చు బ్యాంక్ స్టాఫ్‌తో వాసుదేవరావ్ ఉన్నవానికి లేనివి నాలుగు కలిపించి చెప్పాడు కాబోలు. ఆరోజునుండి స్టాఫంతా కూడా ఇతనికేసి అదోలా చూడ్డం ప్రారంభించారు. దానికితోడు ఆ మర్నాడే బ్యాంకు మేనేజర్ నెత్తిమీద గండుచీమ పాకుతుంటే అది చూసి హరిశ్చంద్ర నవ్వడం. ఎందుకు నవ్వుతున్నారని ఆయన అడిగితే ఇతను నిర్మొహమాటంగా నిజం చెప్పేయడం. దానికాయన కారాలు మిరియాలు నూరడం జరిగింది! ఆ తర్వాత చెదురుమదురుగా ఇలాంటివే నాలుగైదు సంఘటనలు జరగడంతో అతనికి మెంటల్‌గాడన్న పేరు స్థిరపడిపోయింది బ్యాంక్‌లో. కొందరైతే ఇతన్ని చూడగానే ముఖం పక్కకి తిప్పేసుకుని పైకే నవ్వేయడం ప్రారంభించారు.

"నవ్వుకోండిరానవ్వుకోండి! నవ్వినా నాపచేనే పండుతుంది. రేపొద్దున నేను లాహిరిని పెళ్ళి చేసుకుని ఝామ్మంటూ తిరుగుతుంటే అప్పుడు కుళ్ళుకు చదురుగాన్లే..." అనుకోవడం తప్ప పాపం ఇంకేమీ చేయలేకపోయేవాడు హరిశ్చంద్ర.

బ్యాంకుకు సంబంధించినంతవరకూ అతని దుర్గతి ఇలా వుండగా; ఇహ ఇంట్లో- మరీ ముఖ్యంగా డైనింగ్‌టేబుల్ దగ్గర- ఏ పూటా అతనికి ఏదో ఒక భంగపాటే! శృంగభంగమే! అవహేళనే!

ఓపూట అతను మామూలుగా భోంచేస్తుంటే- "మెంటల్‌గాళ్ళు అలా శుభ్రంగా తినకూడదండీ... ముఖమంతా పూసుకుంటూ రెండుచేతుల్తో తినాలి..." అన్నాడు బంటూగాడు. అప్పుడా పక్కనే ఉన్న పూర్ణమ్మ- "ఉత్త అల్లరి వెధవ నాయనా! నోటికెంతొస్తే అంత వాగుతుంటాడు... నువ్వేం అనుకోలేదుగదా?" అంది. "అనుకోకు నాయినా" అని అని వుంటే అదో దారి. కాని- 'అనుకోలేదు గదా?' అని ఆవిడ ప్రశ్నించిందాయె! నిజం చెప్పకుండా ఎలా వుండగలడు?

"అనుకోకపోవడం ఏంటండీ?... అనుకున్నాను..." అన్నాడు హరిశ్చంద్ర.

"ఏం అనుకున్నావు బాబూ?" అందామె లోలోన నవ్వుకుంటూ.

"నరికి పోగులు పెట్టినా పాపంలేదు వెధవని- అని అనుకున్నానండీ..." అన్నాడు హరిశ్చంద్ర.

కన్నకొడుకుని ఓ పరాయివ్యక్తి అలా అంటే ఏ తల్లి మనసు చిన్నబోదు? ఏ తల్లికి కడుపు మండదు? అగ్గిమీద గుగ్గిలమైపోయిందామె... "పసిపిల్లాణ్ణి పట్టుకుని అంతమాటంటారా?" అని మొదలుపెట్టి శక్తికొద్దీ తిట్టిపోసిందతన్ని. రాఘవయ్య జోక్యం చేసుకుని ఏవేవో చెప్పి సముదాయించడంలో ఉపరిరెలాగో శాంతించిందామె.

ఇంకోపూట- కూరలో కాస్త ఉప్పెక్కువైనట్టని పించి వికారంగా ముఖం పెట్టాడు హరిశ్చంద్ర- "వండిన వాళ్లకి ఒళ్ళు దగ్గరుండదు కాబోలు" అని మనసులో అనుకుంటూ-

అదిచూసి-

"ఏంటోయ్ సరిగ్గా తినకుండా ఏదో ఆలోచిస్తున్నావు?" అని అడిగాడు రాఘవయ్య.

"కూరలో ఉప్పు ఎక్కువైనట్టుందండీ- వండినవాళ్లకి ఒళ్ళు దగ్గరుండదు కాబోలు అని అనుకుంటున్నాను మనసులో..." అని పాపం సత్యమునే పలికాడు హరిశ్చంద్ర.

"పోన్లేపాపమని భోజనం పెడుతుంటే నోటికొచ్చినట్టల్లా వాగుతావా? ఏం కాస్త ఉప్పెక్కువయినంత మాత్రాన ఓర్చుకోలేకపోతున్నావా? హోటల్లో అధ్వాన్నపు కూడు గతికిన రోజులు మర్చిపోయావా?" అంటూ విరుచుకుపడింది పూర్ణమ్మ.

ఆపూట కూడ రాఘవయ్య ఏదో నచ్చచెప్పి ఊరుకోబెట్టాడామెను.

ఇలాంటి చిన్నాచితకా సంఘటనలు అనేకం జరిగాక- ఒకరోజు చాలా తీవ్రమైన సంఘటనే జరిగింది.

ఆరోజు - తలారా స్నానం చేసి తడితలకి తుండుగుడ్డ చుట్టుకుని భోజనం వడ్డిస్తోన్న పూర్ణమ్మకేసి హరిశ్చంద్ర తదేకదీక్షగా చూస్తుంటే- "ఎందుకు నాయనా అలా చూస్తున్నావ్?" అనడిగిందామె.

"ఈ ముసలివయసులోనే మీరింత అందంగా వున్నారుగదా, అలాంటిది యవ్వనంలో లాహిరికన్నా ఇంకా అందంగా ఉండేవారేమో అనిపించి- చూస్తున్నానండీ..." అని నిజం చెప్పేశాడు హరిశ్చంద్ర.

దాంతో ఆ పక్కనే వున్న లాహిరి కిసుక్కుమని నవ్వింది.

"నవ్వుతావేమే సిగ్గులేనిదానా! నీకూ సిగ్గులేదు, మీ నాన్నకి అంతకన్నా లేదు. లేకపోతే ఇలాంటి తిక్కమేళానికి ఇంట్లో భోజనం ఏమిటి?" అని కూతురిపైనాభర్తపైనా మండిపడి తర్వాత- "చూడునాయనా, నీకు తిక్కో, పిచ్చో, వెర్రో నాకు తెలియదు. తెలిసి వాగుతావో తెలియక వాగుతావో కూడా నాకు తెలియదు. కాని నీ వాగుడికి ఓ అంతూపంతూ వుండటంలేదు. నిన్నటికి నిన్న మా బంటూగాణ్ణి పట్టుకుని నరికినా పాపంలేదన్నావు. ఇవ్వాళ తల్లిలాంటిదాన్ని నన్ను పట్టుకుని నా అందాన్ని పొగుడుతున్నావు. నువ్వీ అసహ్యాకరమైన ధోరణి గనక మార్చుకోకపోతే ఇకనుంచి మా ఇంటికి భోజనానికి రావద్దు ఆ..." అని హరిశ్చంద్రతో నిర్మొహమాటంగా, కుండ బ్రద్ధలుకొట్టినట్టు చెప్పేసిందామె.

ఆమె అలా అంటుండగా హరిశ్చంద్ర ఒక చేయి ఎంగిలిదయినా ఆలోచించకుండా రెండు చెతుల్తోనూ చెవులురెండూ మూసుకున్నాడు.

'ఏం - ఎందుకు చెవులలా మూసుకుంటున్నావ్... అక్కడికి నేనేదో కాని మాటన్నట్టు?" అంది కోపంగా పూర్ణమ్మ.

"మీరు నాకు తల్లిలాంటిదాన్నంటుంటే విని సహించలేకపోయానండీ..." చెప్పేశాడు నిజం హరిశ్చంద్ర.

పూర్ణమ్మ నిప్పులు గక్కుతూ చూసింది.

"అంటే ఏమిటి నీ ఉద్దేశ్యం? తల్లిలాకాక ఇంకెలా కనబడుతున్నానేంటి నీ కళ్లకి?"

"అత్తయ్యలా కనబడుతున్నారండీ! ఒట్టండీ... మీరు నాకు తల్లిలాంటివారు కాదు- అత్తయ్యలాంటివారు..." అంటూ నెత్తిబాదుకున్నాడు హరిశ్చంద్ర. అతను నెత్తిబాదుకున్నది- అలాంటి సందర్భాలలో కూడా నిజం చెప్పాల్సిన దుర్గతి తనకు పట్టినందుకు.

అంతే — "ఏం కూశావు?... గెటవుట్, ఐ సే గెటవుట్" అని శక్తికొద్దీ అరిచింది పూర్ణమ్మ.

ఏనాడూ ఆమె నోటివెంబడి ఇంగ్లీషుముక్క రాగా వినివుండని లాహిరీ, రాఘవయ్యా నిశ్చేష్టులైపోతూ చూశారు ఆమెవైపు.

హరిశ్చంద్రకు కళ్లనీళ్ల పర్యంతమైంది. తల భూమిలోకి కృంగదీసుకుని లేచి నిలబడ్డాడు.

అది చూసి లాహిరికి మనసులో ఎక్కడో కలుక్కుమంది. పాపం తన మూలంగానే కదా అతనిలా అవమానాల పాలవుతున్నది?! అనిపించి క్షణకాలంపాటు తనమీద తనకే కోపం




వచ్చిందామెకి.

"వెళ్లబాకు కూర్చో... అలా భోజనం మధ్యలో లేచివెళ్ళిపోవడం మంచిదికాదు..." అంది పూర్ణమ్మ. "అవునోయ్... అన్నం లక్ష్మితో సమానం- కూర్చో..." అన్నాడు రాఘవయ్య.

దాంతో అవమానభారాన్ని ఎలాగో దిగ మింగుకుని మళ్ళీ కంచంముందు కూర్చున్నాడు హరిశ్చంద్ర. ఏదో మాట తీసేయలేక కూర్చున్నాడన్నమాటేగాని ఆ తర్వాత ఒకటి రెండు ముద్దలకన్నా ఎక్కువ తినలేకపోయాడు. అదైనా వాళ్ళేమయినా అనుకుంటారేమోనని.

అతను కంచంలో చేయిపెట్టి కోడి కెలికినట్టు కెలుకుతుండగా లాహిరికి మళ్ళీ కలిగింది పశ్చాత్తాపంలాంటి ఏదో తెలియని బాధ.

కంచంలో చేయి కడుక్కుని లేవాక—

"నేనొక శాపగ్రస్తుణ్ణండీ! ఎల్లవేళలా నిజమే తప్ప అబద్ధం చెప్పలేని అసహాయుణ్ణి! మీ మనసు నొప్పించినందుకు నన్ను మన్నించండి! ఇన్నాళ్ళూ నాకు భోజనం పెట్టినందుకు కృతజ్ఞుణ్ణి... ఇకనుంచి నాదారి నేను చూసుకుంటాలెండి! రాత్రికి నాకోసం వంట చేయొద్దు..." అని బాధగా అంటూ పూర్ణమ్మకి నమస్కరించాడు హరిశ్చంద్ర. కంట్రోల్ చేసుకోవడానికి ఎంతగా ప్రయత్నించినా దుఃఖంలాంటిదేదో రెపరెపలాడింది అతని కంఠంలో.

"మంచిది నాయనా!" అనేసింది పూర్ణమ్మ నిర్దయగా.

గుండెలో ఎవరో చేయి పెట్టి కెలికినట్టనిపించి— అక్కడ నిలబడలేక అతనికన్నా ముందే ఆ గదిలోంచి వెళ్ళిపోయింది లాహిరి.

"ఇన్నాళ్ళూ భోజనం పెట్టినందుకు కృతజ్ఞుణ్ణంటున్నాడూ అంటే— కొంపదీసి ఇన్నాళ్ళూ తిన్నదానికి డబ్బులివ్వడాఏంటి? పేయింగ్ గెస్ట్‌గా కదా వుండమన్నాను?" అని రాఘవయ్య లోలోన మధనపడిపోతుండగా— "వస్తాను రాఘవయ్యగారూ" అని అతనితో కూడా చెప్పి భారంగా అడుగులు వేస్తూ అక్కడినుంచి వెళ్ళిపోయాడు హరిశ్చంద్ర.

హరిశ్చంద్ర వెళ్ళిపోయాక రాఘవయ్యకీ, పూర్ణమ్మకీ మధ్య కొంతసేపు వాదులాట జరిగింది.

"అతని సంగతి మొదట్నుంచీ తెలిసిందేగా... ఏదో అన్నాడని అతన్నిలా అవమానించి పంపడం తప్పుకాదూ?" అని రాఘవయ్య.

"నేను కాబట్టి అంతటితో సరిపెట్టాను- అతను వాగినవాగుడికి ఇంకొకత్తె అయితే మెడబట్టి గెంటుంటేది బయటికి" అని పూర్ణమ్మ—

"అతనేం గతిలేక బతకడానికి రావడంలేదుగా మనింటికి? నేను— నేనాహ్వానించాను పేయింగ్ గెస్ట్‌గా వుండమని. అలాంటప్పుడు అతన్ని గెస్ట్‌గానే చూడాలితప్ప ఇన్‌సల్ట్ చేయడం ఏమిటి?" అని రాఘవయ్య.

"మీది గడ్డి తినే బుద్ధి కాబట్టి పాడు ఆలోచనలు మనసులో పెట్టుకుని ఆ పిచ్చాణ్ణి నెత్తికెక్కించుకోజూస్తున్నారు. అతను అడ్డమైన వాగుడూ వాగితే సహించి వూరుకోవడానికి ఇక్కడెవ్వరూ తేరగాలేరు" అని పూర్ణమ్మ.

— ఇలా మాటమీద మాట, మాటపైన మాటా అనుకున్నారు చాలాసేపు.

పైనల్‌గా—

"జరిగిందేదో జరిగిపోయింది... అతన్ని మళ్ళీ ఎప్పటిలా రమ్మని చెబుతాను" అని రాఘవయ్య అంటే—"మళ్ళీ ఆ ప్రసక్తిగాని తెచ్చారంటే ఉరిపోసుకుని ఛస్తానంతే- ఆఁ" అని ఖచ్చితంగా చెప్పేసింది పూర్ణమ్మ. దాంతో రాఘవయ్య ఇంక మాట్లాడలేదు.

ఈ వాదులాటంతా ఆలకించిన లాహిరి— "అమ్మ పైకి మెత్తగానే వుంటుంది గాని... పట్టుదల వస్తే గట్టిమనిషే మొత్తానికి" అనుకుంది మనసులో. 'అయితే హరిశ్చంద్ర ఇక నుండి తమ ఇంటికి భోజనానికి రాడన్నమాట' అని అనుకుంటుంటే ఆమెకి అతనిపట్ల జాలి వేసింది. అంతలోనే— "నువ్వేగా దీనికంతటికీ కారణం— మళ్ళీ జాలిపడతావేం?" అని మనస్సాక్షి ఎత్తిపొడిచినట్లనిపించి గిల్టీగా ఫీలయింది.

★ ★ ★





ఆ కుదుపుడు కోపంతోనా సంతోషంతోనా అన్నది అర్థంకాక ఓ లిప్తకాలంపాటు తేలకళ్లు వేశాడు హరిశ్చంద్ర. రాఘవయ్య ముఖంలో కోపపు ఛాయలు మచ్చుకైనా కానరాకపోవడంతో అంతలోనే సర్దుకున్నాడు. సర్దుకున్నాక అన్నాడు-

"మిమ్మల్ని మావయ్యగారూ అన్నాను..."

"పొద్దున్న నాభార్యని అత్తయ్యగారూ అన్నందుకేగా వచ్చింది తంటా – ఇంకా బుద్ధిరాలేదా?"

ఇంత జరిగినా రాఘవయ్యకి మాత్రం హరిశ్చంద్రపట్ల అభిమానం చావలేదు. ఆ సాయంత్రం అతను హరిశ్చంద్ర రూమ్‌కి వెళ్ళి జరిగినదానికి తన బాధను వ్యక్తం చేశాడు. "నువ్వెందుకయ్యా ఒక్కోసారి అలా అనాలోచితంగా తిక్కతిక్కగా ప్రవర్తిస్తావు?... నీ ధోరణి



గనక కాస్త మార్చుకుంటే నిజంగా నీ అంత మంచిమనిషి వుండడు!" అన్నాడు చివర్లో.

"అవును మావయ్యగారూ..." అని ఇంకా ఏదో చెప్పబోయాడు హరిశ్చంద్ర. కాని ఈలోగానే రాఘవయ్య- "ఏమన్నావ్?!!" అంటూ అతని భుజాలు పట్టుక్కుదిపేశాడు.

''అది వేరు, ఇది వేరు...''

''అంటే?'' అన్నట్టు చూశాడు రాఘవయ్య.

''అవునుమావయ్యగారూ! మీఅంతర్యం నాకు తెలుసులెండి. అందుకే ధైర్యంగా అంటున్నాను- మిమ్మల్ని మావయ్యగారూ అని. మీ బంటూచెప్పాడు. మీరు మీ లాహిరిని నాకివ్వాలని అనుకుంటున్నారటగా?''

''ఆముదురు మాటల వెధవ అలా చెప్పాడా నీతో? మరి నాతో నువ్ మా లాహిరిని ప్రేమిస్తున్నావని చెప్పాడే?'' కుడిచేత్తో నుదురు మీద గీరుకుంటూ గాల్లోకి చూశాడు రాఘవయ్య.

''అవునదీ నిజమే మావయ్యగారూ! నేను మీ లాహిరిని ప్రేమిస్తున్నాను. మనసారా ప్రేమిస్తున్నాను'' సిగ్గుగా తలదించుకుంటూ చెప్పాడు హరిశ్చంద్ర.

''సరేనోయ్ ... ఇంత జరిగాక ఇంక ముసుగులో గుద్దులాటదేనికి? నీ రూపమూ, గుణమూ, ఉద్యోగమూ, సద్యోగమూ అన్నీ నాకు నచ్చాయ్! నిన్ను నా అల్లుడిగా చేసుకోవడానికి నాకేం అభ్యంతరంలేదు ... కానీ ఓ కండిషన్ - నువ్ నానుండి పైసా కట్నం కూడా ఆశించకూడదు'' అంటూ తన మనసంతావిప్పి చెప్పేశాడు రాఘవయ్య. అతన్ని తన ఇంటికి పేయింగ్‌గెస్ట్‌గా పిలిచింది దేనికోకూడా చెప్పేశాడు.

''భలేవారే మావయ్యగారూ! మీనుండి నేను కట్నం ఆశిస్తానా? మీలాహిరితో నిజంగా మీరు నాకు పెళ్ళిచేయగలగాలేగాని మిమ్మల్ని జీవితాంతమూ దేవుడిలా పూజించుకోనూ?'' అన్నాడు హరిశ్చంద్ర సంబరపడిపోతూ.

''అదేం పెద్దసమస్యకాదులేవోయ్...'' అన్నాడు రాఘవయ్య యాభైవేల రూపాయల అల్లుడు ఫ్రీగా లభించేయబోతున్నందుకు తను కూడా సంబరపడిపోతూ.

ఇది సినిమాకాదుగాబట్టి ''సంబరం ... అంబరమంతా సంబరం ... మా మామ మేలిమిబంగారం ... మా అల్లుడు అవనికో సింగారం ...'' అని వాళ్ళిద్దరూ పాటపాడేసుకోలేదు.

''సమస్య కాదంటారేంటి మావయ్యగారూ! చాలా పెద్ద సమస్య! ప్రేమపరీక్షొకటి వచ్చింది గామధ్యలో... ఆ గడువుకాలం పూర్తవ్వాలిగా?'' అంటూ వేపాకులముద్ద మింగినవాడిలా ముఖంపెట్టాడు హరిశ్చంద్ర.

''ప్రేమపరీక్షేంటీ?''

''అది నాపాలిట ఓ కఠినశిక్ష'' అని ప్రారంభించి మొత్తం అంతా చెప్పేశాడు హరిశ్చంద్ర. చెప్పేశాక- ''ఇప్పుడు చెప్పండి మావయ్యగారూ! నేను పిచ్చివాణ్ణా? అందరూ నన్ను మెంటల్‌గాడంటున్నారు ... నేను మెంటల్‌గాణ్ణా? ఆ దిక్కుమాలిన ప్రేమ పరీక్షవల్ల సర్వదా సదా నిజమే చెప్పాల్సివచ్చి అలా పిచ్చిపిచ్చిగా ప్రవర్తిస్తున్నానేతప్ప పిచ్చివాణ్ణా?'' అంటూ ఆవేశంతో ఊగిపోయాడు.

''కాదల్లుడూకాదు. నువ్‌పిచ్చివాడివికాదు'' అన్నాడు రాఘవయ్య నిండుమనస్సుతో. తర్వాత - ''దీనికేనా నువ్వింతగా వర్రీ అయిపోతున్నావ్. నీకేం భయంలేదు. నేను అమ్మాయితో పోట్లాడి - ఈ పరీక్షని కేన్సిల్‌చేపిస్తాలే! అమ్మాయిని ఒప్పిస్తాలే!'' అన్నాడు హరిశ్చంద్ర భుజంతట్టూ.

దానికి హరిశ్చంద్ర - ''వద్దు మావయ్యగారూ! అలాంటి ప్రయత్నమేదీ చేయొద్దు. రాజ్యమూ, వనితా వీరభోజ్యం అన్నారు. నేనెన్ని అపాయాలెదురైనా సరే... ఈ పరీక్షలో చివరి కంటూనిలబడి విజయం సాధించి నా వీరత్వాన్ని నిరూపించుకుంటాను- ఆఁ'' అంటూ గర్వంగా తలెగరేశాడు.

''నీకు నిజంగా పిచ్చేనని ఇప్పుడు ... ఇప్పుడు నమ్ముతున్నానల్లుడూ!'' అన్నాడు రాఘవయ్య.

''ఏం - ఎందుకని?''

''లేకపోతే ఏంటల్లుడూ? పరీక్ష కేన్సిల్‌చేపిస్తానయ్యా అంటుంటే ఏవేవో ఇక్ష్వాకులకాలంనాటి పనికిమాలిన కబుర్లు చెబుతావేం? గమ్యాన్ని చేరుకోవడానికి ఏది సులభమైనమార్గమైతే దాన్నే ఎంచుకోవడం తెలివైనవాడి లక్షణం. నువ్వింకేం మాట్లాడకు... లాహిరిదేముంది? చిన్నపిల్ల నాలుగు కేకలేస్తే అదే దారికొస్తుంది'' అన్నాడు రాఘవయ్య.

''వద్దుమామయ్యగారూ! నేను మొద




ట్నుంచీ చాలా దృఢసంకల్పంగల వ్యక్తిని. ఓటమిని అంగీకరించడం నా జీవితంలోనే లేదు. అంతేగాక మేమిద్దరం దేవునిమీద ప్రమాణాలు కూడా చేసుకున్నాం! మీ అమ్మాయి నా పట్ల ఆకర్షితురాలై తనకైతాను ఈ పరీక్షను కేన్సిల్‌చేసేస్తే ఆ దారివేరు! అంతేగాని మీ ద్వారా కేన్సిల్ చేపించడం అంటే అది నాచేతగానితనమే అనిపించుకుంటుంది! అసలే మీ అమ్మాయి ఎందుకోగాని మొదట్నుంచీ నాపట్ల అయిష్టంగానే వుంటోంది... ఒకవేళ మీ ప్రయత్నంగాని వికటిస్తే ఆమెలోని ఆ అయిష్టత మరింత పెరిగిపోయేప్రమాదం వుంది. మీకు విషయమంతా చెప్పానుకాబట్టి మీ చేతనైనంత మేరకు నాకు సహకరించండి చాలు... ఈ పరీక్ష విషయం మీతో చెప్పానని మీరెవరితోనూ అనకండి..." అంటూ ఆయాసం తీర్చుకోవడానికి ఆగాడు హరిశ్చంద్ర.

"ఏమిటో నీదంతా చాదస్తం... సరే అలాగేలే!" అనేశాడు రాఘవయ్య.



ఓ నాలుగు రోజులపాటు పాపం భోజనానికి మళ్ళీ హోటల్‌పాలైపోయిన హరిశ్చంద్రని-

అయిదోనాడు...

అదృష్టం పాము రూపంలో కనికరించింది.

ఆరోజు... ఉదయం తొమ్మిదిగంటల వేళప్పుడు...

బంటూగాడు మల్లెపందిరి కింద కూర్చుని అట్టముక్కలతో బొమ్మకారు తయారుచేస్తున్నాడు. అట్టముక్కలూ, కత్తెరా, బ్లేడూ, క్విక్‌ఫిక్సూ, కూల్‌డ్రింక్ మూతలూ వగైరా వగైరా సరంజామా అంతా ముందు పరచుకుని వాడు తన వర్క్‌లో చాలా సీరియస్‌గా ఇన్‌వాల్వ్ అయిపోయివున్నాడు.

అదేసమయానికి బయటికి వెళ్ళేందుకై రూమ్‌లోంచి ఇవతలికొచ్చిన హరిశ్చంద్ర వాడు చేస్తున్నదేమిటా అని కాసేపు అటుకేసి పరీక్షగా చూశాడు.

అంతలో అతని దృష్టి వాడివెనుక పడగవిప్పివున్న నాగుపాముపై పడింది.

"బంటూ!" అని నోటి చివరిదాకా వచ్చిన కేకని చప్పున దిగమింగేసుకున్నాడు- అలా అరిస్తే వాడుగాని కంగారుపడి గభాల్న నిలబడితే ఆ పాము వాణ్ణెక్కడ కాటేస్తుందోనని-

పాముకీ బంటూకీ మధ్య ఎంతోదూరం లేదు.

ఏమైనా దూరం వుందీ అనుకుంటే అది కేవలం అంగుళాలలోనే.

వరండాలో కూర్చుని చేటలో బియ్యం పోసుకుని బాగుచేస్తూవున్న పూర్ణమ్మ హరిశ్చంద్ర అలా బంటూకేసి చూడటం గమనించి- "ఎలా చూస్తున్నాడో చూడు పసిపిల్లాడికేసి క్రోధంగా" అనుకుంది కసిగా మనసులో. వాడి వెనుకనున్న పాము ఆమె దృష్టిలో పడలేదు.

అంతలో హరిశ్చంద్ర రాకెట్‌కన్నా వేగంగా బంటూకేసి పరుగుతీయడం కనిపించిందామెకి.

ఏంజరగబోతున్నదో అర్థంచేసుకోలేక ఆమె అయోమయంగా చూస్తుండగా- హరిశ్చంద్ర బంటూని రెక్కపుచ్చుకుని ఇవతలికి లాగడం, పందిరికర్రల్లో ఓ దాన్ని విరిచి "ఠపా, ఠపా, ఠపా, ఠపా"మని ఆ పాముని చావగొట్టడం- క్షణాల్లో జరిగిపోయింది.

పరుగుపరుగున అక్కడికి వెళ్ళిన పూర్ణమ్మకి విషయం అర్థమైంది.-

ఇందుకా అతనాలా చూస్త!

కొద్ది క్షణాలక్రితం ఎంతగా అపార్థంచేసుకుంది తను?

ఆమె మనసు సిగ్గుతో చితికిపోయింది!

కళ్ళ వెంబడి కృతజ్ఞత వెల్లువలై పారింది!

"బంటూ! నాబాబే " అంటూ వాణ్ణి గుండెలకు హత్తుకుని- "సమయానికి దేవుళ్ళా అడ్డుపడి నా కొడుకుని కాపాడేవు నాయినా-



నీరుణం తీర్చుకోలేను..." అంది సజలనయనాలతో హరిశ్చంద్రవేపు చూస్తూ.

"దాందేముందిలెండి... అంతా వాడి అదృష్టం!" అనేశాడు హరిశ్చంద్ర. "ఈ పాముని కాస్త దూరంగా పారేయించండి ఎవరితోనయినా..." అంటూ చచ్చిన పామువేపు చూపించి- "వస్తానండీ..." అంటూ వెళ్ళిపోయాడు గబగబా.

"ఆగుబాబూ" అనబోయిందిగాని ఎందుకోగాని గొంతు పెగల్లేదు పూర్ణమ్మకి.

కాసేపటి తర్వాత-

బంటూని హరిశ్చంద్ర పాము బారి నుంచి కాపాడాడన్న వార్త రాఘవయ్యకీ, లాహిరికీ కూడా చేరింది.

దాంతో వాళ్ళకిక్కూడా హరిశ్చంద్రపట్ల ఎంతో కృతజ్ఞత ఏర్పడింది.

హరిశ్చంద్రకి థాంక్స్ చెప్పాలని అతనిరాకకై చాలాసేపు ఎదురుచూసింది లాహిరి.

కాని బయటికి వెళ్ళిన హరిశ్చంద్ర అటునుండి అటే బ్యాంక్‌కి వెళ్ళిపోయినట్టుంది. సాయంత్రం ఆరుగంటలకిగాని తిరిగిరాలేదు.

భోజనం వీళ్ల ఇంట్లోచేసేటప్పుడైతే బ్యాంక్ ఇంటికిదగ్గరే కాబట్టి ఏదోవీలుచూసుకుని మధ్యాహ్నంపూట భోజనానికై ఓ పదినిమిషాలు ఇంటికి వచ్చిపోతుండేవాడు హరిశ్చంద్ర. బ్యాంక్ బిజినెస్ అవర్సు ఉదయంతొమ్మిదింటినుంచి మధ్యాహ్నం రెండింటివరకూ కాబట్టి వాళ్లకి ప్రత్యేకించి లంచ్ అవరంటూ వుండదు. ఎవరైనా ఇలాబయటికి వెళ్లాల్సివస్తే స్టాఫ్ తమలోతాము కోపరేట్‌చేసుకుంటారంతే!

* * *

"మెనీమెనీ థాంక్సండీ!"

"దేనికండీ?" అన్నాడు హరిశ్చంద్ర షర్ట్‌ని హేంగర్‌కి తగిలిస్తూ.

"మా అమ్మచెప్పిందే... పొద్దున్న మా తమ్ముణ్ణి మీరు పాముబారినుండి"

లాహిరింకా మాటపూర్తిచేయకముందే- "ఓస్...అదా?" అంటూ నవ్వేశాడు హరిశ్చంద్ర. అందులో నేనుచేసిన ఘనకార్యమేముందండీ! ఏదో ఆ సమయానికి అక్కడున్నాను కాబట్టి వాణ్ణి కాపాడగలిగాను" అనేశాడు చాలింక పొగడకండి అన్నట్టుచూస్తూ.

"మొత్తానికి వాడిపాలిట మీరు ప్రాణదాతయ్యారు. మీ ఋణం జన్మజన్మలకీ..."

"ఆగండాగండి- నేను వాడిపాలిట ప్రాణదాతనవ్వనో కాదోగాని, మీరుమాత్రం నాపాలిట యమదూతకాకండి" అన్నాడు హరిశ్చంద్ర ముఖాన్ని భయంగాపెట్టి.

"వాట్?" అన్నట్టుగా చూసింది లాహిరి.

"అంతేకదండీమరి! నన్నుచూస్తూనే చిటపటలాడిపోయే మీరు ఇపుడిలా ఆకాశానికెత్తేశారనుకోండి. ఆనందంతో నాహార్టు ఫెయిలైపోవడమూ ఖాయమే. నేను హరీఅనడమూ ఖాయమే. వాడ్డూయూసే?" నవ్వును దాచుకుంటూ అన్నాడు హరిశ్చంద్ర.

"భలేవారే" అంటూ నవ్వేసి- "అన్నట్టు ఇవ్వాల్టినుంచి మీ భోజనం మళ్ళీ మాఇంట్లోనే" అంది లాహిరి.

హరిశ్చంద్ర ఆశ్చర్యంగాచూస్తుంటే "అవునండీ మా అమ్మే చెప్పిందలా అది చెప్పిపోవడానికే వచ్చాను. రాత్రికి మామూలుగా వచ్చేయండి భోజనానికి" అనేసి వెనుదిరగబోయింది. "ఊహుఁ ... నేన్రానండీ!" అని హరిశ్చంద్ర అనడంతో మళ్లీ ఆగిపోయిందక్కడే!

"ఏం ఎందుకనిరారూ?"

"ఈ దయ ఎన్నాళ్ళుంటుందో ఎవరుచెప్పగలరు? మళ్లీ నేనేదో వెధవ్వాగుడు వాగకాపోను. మీ అమ్మగారు గెటవుట్ అనకాపోరు! ఎందుకొచ్చిన గొడవలెండి- నన్నిలా ఉండనివ్వండి"

"అయితే మీకింకా మా అమ్మమీద కోపం పోలేదన్నమాట"

"కోపమెందుకండీ! వున్నమాట చెప్పానంతే" అంటూ ముఖం తిప్పేసుకున్నాడు హరిశ్చంద్ర.

"ఏమోబాబూ! నాకేం తెలియదు! మా అమ్మనే పంపిస్తాను. ఆవిడకే చెప్పుకోండి మీరేం చెప్పుకుంటారో..." అనేసి వెళ్ళిపోయింది అక్కణ్ణుంచి లాహిరి.




ఆమె ఏంచెప్పి పంపించిందో ఏమో... ఓ పది నిముషాలు తర్వాత నిజంగానేవచ్చింది పూర్ణమ్మ- "ఏంబాబూ! భోజనానికి రమ్మని కబురుచేస్తే రానన్నావట?" అంటూ.

"అబ్బే ... అనవసరంగా మీకు శ్రమదేనికని" అంటూ నసిగాడు హరిశ్చంద్ర.

అతనెన్ని చెప్పినా వినిపించుకోలేదు పూర్ణమ్మ. బతిమాలి బామాలి మంచిగా ఆమాటా ఈమాటాచెప్పి ఎలాగోలా అతనితో ఊ అనిపించాకగాని కదల్లేదామె అక్కణ్ణుంచి.

ఆమె వెళ్ళిపోయాక-

"పూర్ణమ్మా నీవెంత మంచిదానివి. నీలాంటి మంచిసర్దాన్ని పైలోకానికి సాగనంపినందుకు నన్ను క్షమించు" అనుకున్నాడు మనసులో హరిశ్చంద్ర.

ఆరాత్రి భోజనాలప్పుడు రాఘవయ్య కుటుంబసభ్యులందరూ అతనిపట్ల ఎంతో ఆప్యాయంగా ప్రవర్తించారు. అదృష్టవశాత్తూ అతనవరతప్పగా ప్రవర్తించాల్సిన పరిస్థితులేం ఉత్పన్నంకాలేదు అప్పుడు!

★ ★ ★

"ఊ .. ఎంతవరకొచ్చింది నీ ప్రేమాయణం?" అన్నాడు వామన్రావ్.

హరిశ్చంద్ర ఈమధ్య వామన్రావ్ వాళ్ళ ఇంటికి వెళ్లడం పూర్తిగామానేశాడు. అందుకని వీలుచూసుకుని అతనే వచ్చాడు హరిశ్చంద్ర రూముకి.

"అండర్ ప్రోగ్రెస్! సర్లేగాని ఏమిటి విశేషాలు!" అన్నాడు హరిశ్చంద్ర ఓడియునవుతూ.

"ఈమధ్య అస్సలు రావటంలేదు అటువేపు. ఏం - నీకింత పరాయివాళ్ళమైపోయామా?" నిష్ఠూరంగా చూశాడు వామన్రావ్.

"అదికాదురా... సర్వకాల సకలావస్థల యందూ నిజమే చెప్పాల్సిన దౌర్భాగ్యపు స్థితి కదానాది! వెల్లాయముందు ఏ క్షణంలో ఏనిజం చెప్పి అభాసుపాలవ్వాల్సి వస్తుందోనని భయపడి రావడంమానేశాను" అంటూ తలదించుకున్నాడు హరిశ్చంద్ర.

"మరేం ఫర్వాలేదులే! నేను తనతో నీసంగతంతా చెప్పేశాను. కాబట్టి నువ్వే తింగరవాగుడువాగినా తనేం అనుకోదులే" అన్నాడు వామన్రావ్ నవ్వుతూ.

"సర్లే... అయితే రేపు తప్పకుండా వస్తాలే"

"వస్తాలేకాదు వచ్చితీరాలి- ఆఁ?"

"అలాగే అలాగే అలాగే..." నిలువుగా బుర్రని స్పీడుగా ఆడించేశాడు హరిశ్చంద్ర.

అదిచూసి- "తలతిరుగుడు వెధవ" అనుకున్నాడు లో వామన్రావ్.

కాసేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పుకున్నాక, హరిశ్చంద్ర ఒక్కొక్కటిగా వివరిస్తూ వచ్చాడు పరీక్ష మొదలైంది లగాయితు అప్పటిదాకా తాననుభవించిన కష్టాలన్నిటినీ "ఇప్పటికిలావుంది. ముందు ముందుకెలా వుంటుందో..." అన్నాడు దిగుల్లో నిట్టూరుస్తూ.

"నేనందుకేముందే చెప్పాను. ఆరోజు నీకింత పొడుగున పొడుచుకొచ్చిందిగా రోషం... ఇప్పటికైనా మించిపోయిందేమీలేదు. నా మాటవిని..."

"ఆపేసేయ్...ఆపేసేయ్. ఇంక చెప్పకు. నాకు మళ్ళీ పిరికిమందు నూరిపోయకు" ఏదో కొంపలంటుకుంటున్నట్టు కంగారుపడిపోతూ అడ్డుతగిలాడు హరిశ్చంద్ర వామన్రావ్కి.

"ఇంకా తగ్గలేదన్నమాట పైత్యం! సరే... అఘోరించు" అని ఇంకా ఏదో అనబోయిన వామన్రావ్ అప్పుడే అక్కడికొచ్చిన బంటూని చూసి- బాగా పెద్దోడైపోయాడు. ఆరోజుల్లో ఇంతుండేవాడు" అన్నాడు అప్పటి బంటూసైజునుద్దేశిస్తూ కుడిచేతిని భూమికి రెండడుగుల దూరంలో ఉంచుతూ.

ప్రస్తుతం హరిశ్చంద్ర వుంటున్న రూమ్లో ఒకప్పుడు వామన్రావ్ కొలీగ్ శ్రీహరి అనే ఆయన వుండేవాడు. ఆయన బ్రహ్మచారి కాకపోయినా వుండటం ఒంటరిగానే వుండేవాడు. అంటే పిల్లల చదువుల దృష్ట్యా కుటుంబమేమో స్వంతవూళ్ళోనూ, ఉద్యోగరీత్యా ఆయనేమో ఈ వూళ్ళోనూ అన్నమాట. ఆయనకి చదరంగం అంటే తగని పిచ్చి. వామన్రావ్కి కూడా ఆ ఆటంటే కాస్తోకూస్తో ఆసక్తి వుండటంవల్ల రోజూవస్తూండేవాడక్కడికి. ఆయనతో చదరంగం ఆడటానికి. అలావస్తూపోతూ వుండటంవల్ల అతనికి రాఘవయ్య

కుటుంబంతో బాగా పరిచయం ఏర్పడింది. ఆ పరిచయంవల్లనే అతను హరిశ్చంద్రకిపుడా రూమ్ ఇప్పించగలిగాడు.

"ఇపుడు మాత్రం ఏపాటివున్నాడులే ... కాని మాటలు మాత్రం మహాముదురు..." అన్నాడు హరిశ్చంద్ర. "ఏంబంటూ ఇలావచ్చావ్?" అడిగాడు వాడివేపుతిరిగి.

"ఏంలేదండీ- ఊరికే వచ్చా" అంటూ బుడుంగున ఎగిరిమంచమెక్కి కూర్చున్నాడు బంటూ.

"మీ బామ్మర్దికి బాగానే ఏర్పడిపోయినట్టుందే నీతో చనువు?"

హరిశ్చంద్ర నవ్వేసి ఊరుకున్నాడు.

"పదరా బయటికెళ్ళి అలా తిరిగొద్దాం ... ఎంతసేపూ రూమ్‌లోనే ఏం కూర్చుంటావ్?" అంటూ లేవబోయాడు వామన్రావ్.

"ఇపుడెందుకులేరా..." అయిష్టంగా చూశాడు హరిశ్చంద్ర.

"ఏడిశావులేగాడిదా, లే ... వీలయితే అలా ఏదయినా పిక్చర్‌కెళదాం" రెక్కపట్టి అతన్ని లేవదీయబోయాడు వామన్రావ్.

"షటప్"

హరిశ్చంద్ర కాదలా అన్నది ... బంటూ!

"ఎవర్నిరా?" అన్నాడు వామన్రావ్ కోపంగా చూస్తూ.

"ఇంకెవర్ని... నిన్నే. లేకపోతే ఏంటి? నా దేవుణ్ణి పట్టుకుని గాడిదా అంటారా?" అంటూ చెంగున మంచంమీంచి కిందకిదూకాడు బంటూ.

"నీ దేవుడా?"

"అవును... నాదేవుడే!!"

హరిశ్చంద్రకూడా ఆశ్చర్యంగా చూశాడు- "ఏంటి బంటూ?!"

"అవునండీ... మీరు నాపాలిట దేవుడని మా అమ్మ చెప్పింది. మీరు నన్ను కాపాడకపోయుంటే ఆపాము నన్ను కరిచేసి వుండేదటగా"

"ఓరి నీ ఇల్లు బంగారంగానూ" అంటూ ఫక్కున నవ్వేశాడు వామన్రావ్. "తప్పైపోయిందిరా బాబూ! తప్పైపోయింది. ఇంకెప్పుడూ అనన్లే నీ దేవుణ్ణి గాడిదా అని" అంటూ లెంపలేసుకున్నాడు.

"అద్గదీ ... అలారా దారికి" అనైతే అనలేదుగాని అన్నట్టుగానే ఓ చూపుచూసి – మళ్ళీ మంచమెక్కేశాడు బంటూ.

కాసేపు వాడి తుంటరితనం గురించి చెప్పుకుని నవ్వుకున్నారు మిత్రులిద్దరూ.

"అన్నట్టు నీకు అవంతి గుర్తుందట్రా?" ఉన్నట్టుండి ఏదో గుర్తుకురాగా సడన్‌గా అడిగాడు వామన్రావ్ హరిశ్చంద్రని.

"ఏ అవంతి?"

"అదేరా మన క్లాస్‌మేట్. సన్నగా నాజూగ్గా వుంటుందని నువ్ 'మెరుపుతీగ' అని కూడా అంటుండేవాడివి... 'చేసుకుంటే ఇలాంటి అమ్మాయిని చేసుకోవాలిరా' అనంటుండేవాడివి..." గుర్తు చేశాడు వామన్రావ్.

హరిశ్చంద్ర అసహనంగా ముఖంపెట్టి— "ఆఁ ఆఁ... గుర్తొచ్చిందిలే... అయితే ఇప్పుడేంటి?" అన్నాడు చిరాగ్గా చూస్తూ. ఆ చిరాకు మాటున 'బంటూగాడున్నాడు... ప్లీజ్ ఇప్పుడేం మాట్లాడకురా!' అన్న అభ్యర్థన.

కాని వామన్రావ్ అది కానుకోలేదు... "అదేంట్రా అలా చిరాకుపడిపోతున్నావ్! అప్పట్లో ఆ అమ్మాయి కటాక్షవీక్షణాలకై పడి చచ్చిపోతుండేవాడివిగా?!" అన్నాడు తన ధోరణిలో తాను.

హరిశ్చంద్ర ఏదైతే జరుగుతుందని భయపడ్డాడో సరిగ్గా అదే జరిగింది!.

బంటూ మంచంమీంచి ఒక్కదూకులో వామన్రావ్ ముందు నిలబడి- "ఏంటేంటీ?! ఏమన్నారూ?!" అంటూ బుగ్గమీద వేలేసుకున్నాడు.

"ఏదో అన్నాడులేరా! అయినా పెద్దవాళ్ళం మేమేదో మాట్లాడుకుంటుంటే మధ్యలో నీకెందుకూ?! పుడింగాళ్ళా అన్నింట్లో తలదూరుస్తావ్! ఫో... ఫో... బయటికి!" అని గట్టిగా గసిరేశాడు హరిశ్చంద్ర— "భగవాన్! నా ప్రేమను నువ్వే కాపాడాలి!" అని మనసులో అప్పుడే దేవుణ్ణి ప్రార్థించేసుకుంటూ.

"పోతాను పోతాను... నాకర్థం కాలేదనుకోబాకండి!... ఇప్పుడేమో మా అక్కయ్యని ప్రేమిస్తు




న్నట్టు నటిస్తూ ఇంతకుముందేమో ఇంకో అమ్మాయిని కూడా ప్రేమించారన్నమాట! చెప్తా చెప్తా... చెప్తా చెప్తా...'' అంటూ ఉక్రోషంగా చూసి— హరిశ్చంద్ర, వామన్రావ్‌లు ఆ షాక్ నుండి తేరుకోకముందే ''వువ్వాఁయ్... వప్పు వ్వాఁయ్...'' అంటూ వాహనంగా మారి హై స్పీడ్‌లో వెళ్ళిపోయాడక్కణ్ణుంచి బంటూ.

షాక్‌నుండి కాస్త ముందుగా తేరుకున్న వామన్రావ్- ''సారీరా... నీ ప్రేమలతని కూకటి వేళ్ళతో పెళ్ళగించాలన్నది నా అభిమతంకాదు. మొన్న నేను ఆఫీసుపని మీద నెల్లూరు వెళ్ళొస్తుంటే ట్రెయిన్‌లో తారసపడి పలకరించిందామె! పెళ్ళయిందట. ఇద్దరు పిల్లలట. ఆ విషయం నీతో చెబుదామని ఆమె ఊసుతెచ్చాను. బహుశా బంటూగాడు ఈ విషయం వెళ్ళి వాళ్ళక్కయ్యతో చెబుతాడనుకుంటా! అసలే నువ్వంటే ఆ అమ్మాయికి పడటంలేదంటున్నావు... దానికితోడు ఇదొకటి! ప్చ్- సారీరా!'' అంటూ ముఖంలోని అణువణువునా పశ్చాత్తాపాన్ని నింపేసుకోసాగాడు.

''పుండు మీద కారం జల్లకు! వెళ్లిపో! నేన్నిన్ను పీకపిసికి చంపేయకముందే ఇక్కణ్ణుంచి వెళ్ళిపో!''

హరిశ్చంద్ర ఉద్రేకంతో వూగిపోతున్న తీరును చూసి నిజంగానే చంపుతాడేమోనన్న భయం పుట్టి— ఎలాగైనాసరే శ్రీమతి గోమతి యొక్క పసుపుకుంకుమలను కాపాడాలన్న సదాశయంతో— ''అలాగే అలాగే'' అంటూ ఒత్తంటించిన తారాజువ్వలా సర్రున దూసుకెళ్ళిపోయాడు వామన్రావ్ బైటికి.

ఓ అయిదునిమిషాల తర్వాత లాహిరి జోరుగా చేతులూపుకుంటూ స్పీడుగా రావడం చూసి— ''చెప్పేసుంటాడు ముదురు మాటల వెధవ!'' అనుకుని లబలబలాడిపోయాడు హరిశ్చంద్ర. అతని ముఖంలో విషాద ఛాయలు ఆటోమేటిగ్గా అలుముకుపోయాయి... గుండెల్లో చీముపొక్కు పుట్టినట్టు బాధ!!

లాహిరి గదిలో కాలుపెడుతూనే అడిగింది— ''ఏంటి మా బంటూగాణ్ణి గెటవుట్ అన్నారట?! వాడేడుస్తూ వచ్చాడు...!''

''ఓరి పుడింగివెధవా!'' ఇక్కడేమో నన్ను బెదిరించి బయల్దేరి తీరా మీ అక్కయ్య దగ్గరికి ఏడుస్తూ వెళ్ళావా?!

'పో బైటికి' అన్నా 'గెటవుట్' అన్నా అర్థం ఒకటేగనుక—

''ఆఁ అవునండీ అన్నాను...'' అని ఒప్పేసుకున్నాడు హరిశ్చంద్ర.

''ఏం - ఎందుకు?'' అడిగింది లాహిరి.

''ఎందుకో చెప్పలేదా వాడు మీతో?''

''చెప్పలేదే...''

''అవును చెప్పలేదు... ఇదిగో ఇప్పుడు చెబుతాను...'' అంటూ బుడుంగున లోపలికొచ్చి— ''మరేమో అక్కయ్యా...'' అంటూ చెప్పడం ప్రారంభించేయబోయాడు బంటూ.

హరిశ్చంద్ర చటుక్కున వాడినోరు నొక్కేసి –– ''మీరు వెళ్ళిపోండి లాహిరిగారూ! అర్జంటుగా ఇక్కణ్ణుంచి వెళ్ళిపోండి... మీరిక్కడుండటం చాలా ప్రమాదం'' అంటూ గుమ్మంవేపు చేయి చూపించాడామెకి.

''ముందు వాడి నోటిమీద నుంచి చేయి తీయండి...'' గదమాయించింది లాహిరి.

''హుఁ... ఏమిటో కష్టాలన్నీ మంచివాళ్ళకే పెడతాడా భగవంతుడు...'' స్వగతంలా అన్నా పైకే అనేశాడు హరిశ్చంద్ర.

''మీకే చెప్పేది... వాణ్ణొదలండి...''

''అసలు భగవంతుడు కొందరి విషయంలో ఇంత నిర్దయగా...'' అని ఇంకా ఏదో అనబోయాడు హరిశ్చంద్ర బంటూ నోటిమీంచి చేయి తీయకుండానే. కాని ''ఆపండి'' అంటూ లాహిరి గట్టిగా అరవడంతో మధ్యలో ఆగిపోయాడు.

బంటూని హరిశ్చంద్ర చేతుల్లోంచి ఫోర్సుగా ఇవతలికి లాగి— ''ఊఁ... చెప్పరా, నీకేం ఫర్వాలేదు...'' అంది లాహిరి.

''ఏముందక్కా... ఈ మహానుభావుడు ఇప్పుడేమో నిన్ను ప్రేమిస్తున్నట్టు నటిస్తున్నాడా?— కాని ఇంతకుముందే ఇంకో అమ్మాయిని ప్రేమించాడట...''—

చెప్పేసి 'వదిలిందా తుప్పు?' అన్నట్టు చూశాడు వాడు హరిశ్చంద్రకేసి.

''నిజమేనా?'' అంది లాహిరి. ఆమె ముఖం భావరహితంగా వుంది.

''ప్రేమించడం అంటే నిజంగా ప్రేమించడం కాదండీ! తొందరపడి మీరు నన్ను పార్థం చేసుకోకండి! నాలుగైదేళ్ళ కిందటి మాట... అవి మేము డిగ్రీ చదువుతున్నరోజులు... అవంతి అనీ— ఆమె చాలా అందంగా వుండేదిలెండి. అందుకని నేను ఆమెవేపు కాస్త ఆకర్షింపబడ్డాను... జస్ట్ ఆకర్షణ అంతే! తర్వాత ఆమెకి మూర్ఛరోగం వుందని తెలిసి ఆమె పేరునుకూడా నా మనసులోకి రానివ్వడం మానేశాననుకోండి. ఈమధ్య వామన్రావ్ కి ఆమె రైల్లో కనబడిందట...'' అంటూ వివరించాడు విషయమంతా.

లాహిరి హుఁ అనిగాని, ఛూ అనిగాని, ఛీ అనిగాని, ఛా అనిగాని అనలేదు. అసలామె ముఖంలో కోపంలాంటిది మచ్చుకైనా కానరాలేదు. కానైతే ''అందంగా ఎవరు కనబడితే వాళ్ళవేపు ఆకర్షింపబడిపోవడంతప్ప మీకింకేంపని లేదన్నమాట'' అని ఓ మాటమాత్రం అంది. అదయినా చాలా మామూలుగా.

''అవునండీ... మిమ్మల్ని ప్రేమించక ముందు అందంగా ఎవరు కనబడితే వాళ్ళవేపు ఆకర్షింపబడిపోతూ వుండేవాణ్ణండి! కాని మిమ్మల్ని ప్రేమించడం స్టార్ట్ చేశాక మీరుతప్ప నా కంటికి ఇంకెవ్వరూ అందంగా కనిపించడం మానేశారండీ.'' అంటూ పాపం నిజమే చెప్పాడు హరిశ్చంద్ర.

లాహిరి నిర్వికారంగా చూసి ''పదరా పోదాం'' అంటూ తమ్ముణ్ణి వెంటబెట్టుకుని వెళ్లిపోయిందక్కడి నుంచి.

ఏదో జరిగిపోతుంది కాబోలు— ఏదో కొంప మునిగిపోతుంది కాబోలు— అని తానెంత భయపడితే ఏమీ జరగలేదేంటబ్బా?! అనుకుని విస్తుపోయాడు హరిశ్చంద్ర.

ఆమెలో జెలసీ కలగకపోవడానికి కారణం ఆమె తనని బొత్తిగా ప్రేమిస్తూండకపోవడమేనని అతను అప్పటిక్కూడా తెలుసుకోలేకపోయాడు.

ఆడది అసూయకు మారుపేరు... నిజమే! కాని తనవాడనుకున్నవాడు చేయి జారిపోతున్నప్పుడుతప్ప— ఎవరో దానయ్య ఎవరో దానమ్మని ప్రేమిస్తే ఏ ఆడదానికిమాత్రం ఏమిటి నష్టం? ఏమిటి కష్టం? లాహిరికి హరిశ్చంద్రపట్ల వున్న భావం కూడా సరిగ్గా అలాంటిదే! కాకపోతే తనమూలంగా వెర్రివాడైపోతున్నాడే అని ఓమూలన పిసరంత జాలి మాత్రం వుంది- అంతే!

★ ★ ★

ఆ మరుసటినాడు-

''మదర్ సీరియస్- స్టార్ట్ ఎట్‌వన్స్...'' అన్న టెలిగ్రాంని చూసి ఉన్నఫళంగా బయల్దేరి తన స్వగ్రామానికి వెళ్ళాడు హరిశ్చంద్ర.

తీరా అతను వెళ్ళేసరికి అక్కడ సావిత్రమ్మ కులాసాగానే వుంది.

''నిన్ను రమ్మని ఉత్తరాలు రాస్తుంటే నువ్ రావడంలేదని— నాన్న చేశారిలా'' అంటూ విషయం వివరించింది రాగిణి.

అతను వెళ్ళేసరికి అచ్యుతరామయ్య ఇంట్లో లేడు.

''అవున్రా... అక్కడికీ నేను చెబుతూనే వున్నాను... వద్దండీ వాడు గాభరా పడతాడని... మీ నాన్న వింటేగా?!'' అంది సావిత్రమ్మ.

''అబ్బ... ఎంత హడిలిచచ్చానో తెలుసా అమ్మా! పోనీలే... నువ్ కులాసాగా వున్నావ్... అంతేచాలు'' అన్నాడు ఆనందంగా హరిశ్చంద్ర. పాపం ఆ టెలిగ్రాం చూసినప్పటి నుంచి ఇల్లుజేరేవరకూ అతననుభవించిన ఆందోళన అంతాఇంతా కాదు. ఉత్తుత్తి టెలిగ్రాం ఇచ్చినందుకు తండ్రిమీద కోపంమాట ఎలావున్నా తల్లినిప్పుడు ఇలా మామూలు స్థితిలో చూస్తున్నందుకు అతనికి చెప్పలేనంత సంతోషంగా వుంది.

''రెండు మూడు ఉత్తరాలు రాశారటగా మీ నాన్నగారు నిన్ను రమ్మని...''

''అవునమ్మా- కాని రావడానికి వీలుపడలేదు.''

''అంతేనా - లేక వస్తే కల్పలతని చేసుకోమంటాడేమోనన్న భయంతో...''

''అవునమ్మా! నేను సర్వకాల సకలావస్థలయందూ నిజమే చెప్పాల్సినవాడిని! అవును!




ఆ భయంతోనే రాలేదు...''

''కల్పలత వదిన్ని చేసుకోనని నువ్ రాసిన ప్పటినుంచి అమ్మా, నాన్నా నువ్వెవరినయినా ప్రేమిస్తున్నావేమోనన్న డౌట్‌లో పడిపోయార న్నయ్యా'' అంది రాగిణి జోక్యంచేసుకుంటూ.

''వాడేం అలాంటి వెధవపనులు చేయ డులే! ఏరా అవునా?'' మురిపెంగా చూస్తూ అంది సావిత్రమ్మ.

''అబద్ధం ఆడబాకు తప్పు... అబద్ధం ఆడ బాకు తప్పు...''

''ఛప్ నోర్మూయ్! నీగోలేంటి మధ్యలో' అని అంతరాత్మని కోప్పడి- ''ఎందుకు చేయన మ్మా? లక్షణంగా చేస్తాను'' అని తలదించుకు న్నాడు హరిశ్చంద్ర.

''అంటే... నిజమేనా? ఎవర్నయినా ప్రేమి స్తున్నావా?''

''అన్నయ్యకేం తక్కువనమ్మా ప్రేమించ కుండా వుండటానికి? అందగాడు, పైగా మంచి ఉద్యోగంకూడా ఉంది. ఏరా అన్నాయ్... ఎవరా అమ్మాయి? అందంగా వుంటుం దా? బాగా చదువుకున్నదేనా? నీతో పాటే మీ బాంకులోగాని పనిచేస్తోందా ఏంటి?...''

''నువ్ నోర్మూసుకోవే కాసేపు'' అని కూతుర్ని గసిరి, ''ఏరా మాట్లాడవేంరా?'' అంది సావిత్ర మ్మ కొడుకువేపు తిరిగి.

''నేను సర్వకాల సకలావస్థలయందూ నిజమే చెప్పాల్సినవాణ్ణి! నిజమే చెబుతాను వినండి! ఆమెపేరు లాహిరి. మా ఇంటిగలవా ళ్ళమ్మాయి...'' అని ప్రారంభించి తన లవ్‌స్టో రీని టూకీగా నేరేట్ చేశాడు హరిశ్చంద్ర. తండ్రి వచ్చాక మళ్ళీ ఎలాగూ డిటైల్డ్‌గా చెప్పాల్సిందే గదా అని.

''కొంపముంచావుగదరా! ఈ సంగతి మీ నాన్నగారికి తెలిస్తే ఇంకేమయినా వుందా?!'' అంటూ గుండెలమీద చేయివేసుకుంది సావి త్రమ్మ.

''పార్కులకి గట్రా వెళ్తుంటారా? కలిసి సినిమాలుగట్రా చూస్తుంటారా?'' కుతూహ లంగా అడిగింది రాగిణి.

''నోర్మూసుకుని పో అవతలకి'' అని ఆ పిల్లని కోప్పడి- ''మాతో చెప్తే చెప్పావుగాని- ఈ సంగతి మీ నాన్నగారితో మాత్రం అప్పుడే చెప్పకు... ఏమైనా అడిగితే ఏదో బొంకే సేయ్...'' అంది సావిత్రమ్మ హరిశ్చంద్రతో.

''బొంకలేనమ్మా! బొంకలేని వంకర బతుకై పోయింది నాది! అంటూ మరికొన్ని డిటయి ల్స్ చెప్పాడు హరిశ్చంద్ర. అంటే లాహిరి తనకు పెట్టిన పరీక్ష గురించి అన్నమాట! కాని తనమూలంగా తానుఅనుభవిస్తున్న అవమానా లనూ, కష్టాలనూ మాత్రం ఏకరవుపెట్టలేదు- తల్లి బాధపడుతుందని!

''మరి చూస్తూ చూస్తూ అంత పొగరుబోతు పిల్లని ప్రేమించటం దేనికిరా! దానికి ఎంత పొగరుకాకపోతే అలాంటి కండిషన్ పెడు తుంది. నామాట విను- అలాంటి మొండి పిల్లని చేసుకుంటే రేప్పొద్దున్న నీనెత్తి మీదకె క్కి ఆడుతుంది. కల్పలత కాకపోతే ఇంకోపిల్ల... అంతేగాని ఆ పొగరుబోతుని మాత్రం మర్చిపో...'' అంది సావిత్రమ్మ.

''ఇంపాసిబుల్ అమ్మా! నేనన్నిటికీ సిద్ధప డేవున్నాను... నాన్నతోకూడా నిజమే చెప్తేస్తా ను...''

''నా మాట వినరా... మీ నాన్న మండిపడతా రా...'' అంటూ నానారకాలుగా నచ్చచెప్పబో యింది సావిత్రమ్మ.

కాని ససేమిరా అన్నాడు హరిశ్చంద్ర.

కాసేపటి తర్వాత అచ్యుతరామయ్య రావడం, హరిశ్చంద్ర ఆయనతో కూడా అన్నీ నిజాలే చెప్పేయటం, ఆయన ఉగ్రనరసింహా వతారం ఎత్తి లెఫ్ట్ అండ్ రైట్ తీసుకోవడం, ప్రేమోన్మాదంలో పెద్దా చిన్నా మర్చిపోయి హరిశ్చంద్ర కూడా ఎలాపడితే అలా వాగే యడం- అన్నీ ఆటోమేటిక్‌గా జరిగిపో యాయి! తుదకు వ్యవహారం ఎంతవరకూ వెళ్ళిందంటే- ''ఛీ... నువ్ నాకొడుకువేకాదు'' అని అచ్యుతరామయ్య అంటే; ''లాహిరితో నా పెళ్ళికి మీరు గనుక ఒప్పుకోకపోతే నా శవాన్నే చూస్తారు'' అని హరిశ్చంద్ర సవాలులాంటిది చేశాడు. అంత ఉద్రిక్తతనీ, తీవ్రతని సంత రించుకుంది వాతావరణం.

''ఎవర్రా ఆ ముదనష్టపు వెధవ- నీమీదికి




సిగ్గులేకుండా కూతుర్ని ఉసిగొల్పింది? కట్నం పైసారాలదని ఆ వెధన తరఫున నువ్వేచెబుతున్నావే!? బాగా విషం నూరిపోశాడన్నమాట నీకు! ఆగు... అక్కడికొచ్చి ఆ వెధవని ఏంచేస్తానో! నలుగురిలోపెట్టి సిగ్గంతా పోయేటట్టు కడిగి పారేస్తాను..." అని అచ్యుతరామయ్యా బెదిరిస్తే-

"నిజంగా అలాగేగాని జరిగితే నాశవం బావిలో తేలుతుంది! అమ్మ మీదా, చెల్లాయి మీదా, సమస్త దేవుళ్ళమీదా. నా ప్రియమైన లాహిరి మీదా ఒట్టేసి చెబుతున్నాను. అక్కడికొచ్చి నిజంగా మీరుగాని ఏవైనా రాద్ధాంతం చేశారో- నేనీ లోకంలోనే వుండను- ఆఁ..." అని భీకర ప్రతిజ్ఞ చేశాడు హరిశ్చంద్ర.

ఆ మాటలకి సావిత్రమ్మ బావురుమని ఏడ్చేసింది.

"ఏడవటం కాదమ్మా నీకర్తవ్యం! నువ్ నిజంగా నీకొడుకు శ్రేయస్సును కాంక్షించేదావివే అయితే- ఈయనగార్ని అక్కడికి రానివ్వకుండా చూడు! నచ్చజెప్పు" అనేసి, తల్లీ చెల్లెలూ ఎంతగా వారించినా వినకుండా అప్పటికప్పుడే తిరుగు ప్రయాణమయ్యాడు హరిశ్చంద్ర. వెళ్ళేముందు-- "రాగిణి పెళ్ళికోసమే కదా నాకా దంతసుందర్ని కట్టబెట్టాలని చూస్తున్నారు! ఆబాధ్యత నాకొదిలి పెట్టండి!... ఇంకా మూడు నాలుగేళ్ల తర్వాత కదా దాని పెళ్లి మాట! నాలుగంకెల జీతం తీసుకుంటున్నవాణ్ణి ఆపాటి చెల్లెలి పెళ్ళి చేయలేకపోను" అని భరోసా ఇచ్చివెళ్ళాడు.

అతను వెళ్ళిపోయాక కూడా అచ్యుతరామయ్య ఇంకా చిందులు వేయబోతుంటే- "వాడసలే పట్టుదలగల మనిషి! మీరు తొందరపడి ఏ నిర్వాకమూ చేయకండి! వాడన్నంత పనీ చేసినా చేస్తాడు! ఉన్నది ఒక్కగానొక్క కొడుకు... పంతాలకిపోయి వాణ్ణి దూరం చేసుకుంటే ఆ తర్వాత బాధపడాల్సింది మనమే" అంటూ కన్నీళ్లతో ప్రాధేయపడి అతన్ని శాంతింపజేసింది సావిత్రమ్మ.

కథల్లోనూ, నవలల్లోనూ సాధారణంగా మాతృప్రేమకే ఎక్కువ ప్రాధాన్యతనిస్తూ వుంటారు. కాని నిజానికి పితృవాత్సల్యం కూడా ఏకొందరి విషయంలోనో తప్పితే, దానికేమాత్రం తీసిపోదు. పైకి అలా గట్టి గట్టిగా అరిచినా అచ్యుతరామయ్యక్కూడా పేగులు ఉంగలు చుట్టుకుపోయినట్టనిపించింది కొడుకు అనిపోయిన మాటలకి.

పైకి అయితే తేలలేదుగానీ, 'అంతగా అయితే వాడి యిష్టప్రకారమే కానిద్దాంలే' అని నిజానికాయన అంతకుముందే అనుకున్నాడు.

★ ★ ★

"ఎలా ఉందోయ్ మీ అమ్మగారికి?"

రాగానే హరిశ్చంద్రని పరామర్శించడానికి వచ్చాడు రాఘవయ్య.

"ఆవిడకేమండీ రాయిలావుంది..." అంటూ ప్రారంభించి– అక్కడ జరిగినదంతా పూసగుచ్చినట్టు వివరించి చెప్పాడు హరిశ్చంద్ర.

"శభాష్ అల్లుడూ! భలేగా బెదరేసి వచ్చావు మొత్తానికి మీ నాన్నని!" మెచ్చుకోలుగా చూశాడు రాఘవయ్య. "అయితే నీ బాణానికింక తిరుగులేదంటావ్?! మీనాన్న వచ్చినట్టు ఒప్పుకునే తీరాలంటావ్?!" అన్నాడు సంతోషంగా.

"మరంతేగదండీ!"– 'హరిశ్చంద్రనా, మజాకానా?' అన్నట్టు గర్వంగా బోరవిరిచాడు హరిశ్చంద్ర.

"సరే... అంతా బాగానేవుంది. అయితే! ఈపరీక్ష ఎప్పటికయ్యేనోగాని. ఎందుకొచ్చిన గొడవ? నువ్వన్నట్టు వీలైనంత వరకూ అమ్మాయిని ఆకట్టుకోవడానికే ట్రైచేయ్! నా సహకారం నీకెప్పటికీ వుంటుంది! ఏంచేస్తావో ఏమోగాని, నెలతిరక్కుండానే పరీక్షావద్దూ, పాడూవద్దూ అని దానిచేతనే అనిపించాలి నువ్వు... ఆఁ..." అనేసి వెళ్లిపోయాడు రాఘవయ్య.

ఆవిధంగా ఇంచుమించు రెండువైపులా లైన్ క్లియరైపోయినట్లే అయింది.

ఎటొచ్చీ పరీక్షలో విజయం సాధించటం ఒక్కటే మిగిలివుందిక!

ఒకవిధంగా రాఘవయ్య చెప్పిందీ మంచి మాటే! ఏదో ఒకరకంగా లాహిరి మనసుని

ఆకట్టేసుకుని ఆమె చేతనే...

ఊహుఁ... అదంత సులభసాధ్యంగా అనిపించటం లేదు! ఆమె మనసులో వేరే ఇంకెవరయినా వున్నారేమో అనుకోవడానికైతే ఆస్కారం లేదుగాని... ఎందుచేతనో ఆమె తనపట్ల అనాసక్తంగానే వుంటోంది.

ఆ అనాసక్తతని తొలగించి తానామె గుండెల్లో దూరిపోవాలీ అంటే--... ఏదో... ఏదో... సమ్‌థింగ్... చేసితీరాలి తను?!

సినిమాల్లోలా నలుగురు కిరాయిగూండాల చేత ఆమెనల్లరి చేయించి... వాళ్ళల్లరి చేస్తుండగా సమయానికి దేవుల్లా తను వెళ్ళి వాళ్లను చితకబాది ఆమెను రక్షిస్తేనో?!

ఛఛ... బావుండదు! మరీ అంత సినిమటిక్ ట్రిక్కులు నిజజీవితంలో పన్జేయవు! అదీగాక తను సర్వకాల సకలావస్థలయందూ నిజమే చెప్పాల్సిన వాడాయె! ఏదోక సందర్భంలో ఆమెతో ఆ నిజాన్ని చెప్పేయాల్సివస్తే--

ప్రేమమాట దేవుడెరుగు, తనపట్ల అసహ్యం ఏర్పడిపోతుంది ఆమెలో.

అయినా తన పిచ్చిగాని ప్రయత్నపూర్వకంగా ఎదుటివ్యక్తి హృదయాన్ని ఆకట్టుకోవడం జరిగే పని కాదు!

దేనికైనా అదృష్టమూ, టైమూ కలిసిరావాలి! కాబట్టి తన ప్రస్తుత కర్తవ్యం మొక్కవోని ధైర్యంతో ఈ పరీక్షలో విజయానికై కృషిచేయడం ఒక్కటే! అంతే తప్ప, అంతకుమించి అతి తెలివికి పోయి ఇంకేవెధవ్వేషాలు వేసినా ప్రమాదమే!

రాఘవయ్య వెళ్లాక అలా పరిపరివిధాల ఆలోచించి, లాహిరి హృదయాన్ని ఆకట్టుకోవడానికి ప్రత్యేకించి తను ఏ అడ్డదార్లూ తొక్కకపోవడమే మంచిదన్న నిర్ణయానికి వచ్చాడు హరిశ్చంద్ర.

అప్పటికంత జరిగినా విజయం తనదేనన్న నమ్మకం సడలలేదు అతనిలో.

* * *

ఆమె అచ్చం సిల్క్‌స్మితలా వుండటం అతని దురదృష్టం! ఉందిపో. ఆమె నడిరోడ్డు మీద అతని కళ్లబడటం అతని దౌర్భాగ్యం! పడిందిపో! ఆసమయానికి ఆమె భర్త కూడా ఆమె పక్కనే వుండటం అతని ఖర్మ! ఉన్నాడుపో... ఆ మహానుభావుడు కోపిష్టి కావడమూ, పైపెచ్చు కరాటేలో ప్రవేశం వుండటమూ-- నిస్సందేహంగా ఇవతలివాడి తలరాత ఏమాత్రమూ బాగులేదనడానికి నిదర్శనమే!

బాగులేకపోబట్టేగా పాపమతని షేపు చలిమిడి ముద్దలా అయిపోతే?!

చొక్కా చిరిగిపోయి... ముక్కు వాచిపోయి... దవడ కందిపోయి... జుట్టురేగిపోయి... ఎడమ కాలు కాస్త ఎగరేస్తూ, కుడిచేత్తో పొట్టని పట్టుకుని వస్తున్న అతన్ని చూసి

అతన్ని హరిశ్చంద్రగా మొదట గుర్తించనే లేకపోయింది లాహిరి. బాగా దగ్గరికొచ్చాక అప్పుడు గుర్తించింది.

"అరె... ఏంటండీ హరిశ్చంద్రగారూ! ఏంటీ అవతారం" అంది ఆశ్చర్యంగా.

"ఆమె సిల్క్‌స్మితలా వుండటం నాదురదృష్టమండీ! అతనికి కరాటే వచ్చుండటం నా ఖర్మ అబ్బా... అంతా నా తలరాత... నుంచోలేకపోతున్నాను, ముందు నన్ను నా రూమ్‌కెళ్లనివ్వండి" అన్నాడు హరిశ్చంద్ర ఏడుపుముఖంతో.

చప్పున అపార్థం చేసుకోవడం ఆడవాళ్ల జన్మహక్కు! హరిశ్చంద్ర చెప్పిన ఆ రెండు ముక్కలకే గభాల్న అపార్థంచేసేసుకుంది లాహిరి- "ఏముంది- ఎవతో సిల్క్‌స్మితలా కనబడితే దాని వెంటబడి వుంటాడు. అది చూసి వాళ్లన్నయ్యో, వాళ్ళాయనో నాలుగు కరాటే స్ట్రోక్స్ ఇచ్చి వుంటాడు..." అని.

కుంటుకుంటూ గెంటుకుంటూ హరిశ్చంద్ర రూమ్‌వైపు వెళ్తుంటే- విషయం పూర్తిగా ఆరా తీద్దామని అతన్ని వెన్నంటింది లాహిరి.

హరిశ్చంద్రని ఎక్కణ్ణుంచి ఎప్పుడు చూశాడోగాని, బంటూ పరుగుపరుగున ఇంట్లోకెళ్ళి తల్లితోనూ, తండ్రితోనూ చెప్పేశాడు హరిశ్చంద్ర షేపులు మారిపోయిన సంగతి.

అందుచేత- లాహిరి "ఏమైందండీ? ఏం జరిగిందసలు?" అని అడుగుతుండగానే వాళ్ళు కూడా వచ్చేశారు హరిశ్చంద్ర రూమ్‌కి.

"ఏం జరిగింది నాయనా! ఏ వెధవ చేశా

డిలా?'' ఆందోళనగా అడిగింది పూర్ణమ్మ. బంటూని పాముబారినుంచి కాపాడినప్పటి నుంచి ఆమెకి అతనిపట్ల చెప్పలేని వాత్సల్యం ఏర్పడిపోయింది. ఇంకా పైకైతే పొక్కలేదు కాని, లోపల్లోపల అతన్ని తమ అల్లుడిగా అంగీకరిస్తూనే వుంది ఆమె హృదయం.

''చెంపమీద చేత్తో చరిచినట్టులేదు. పిడికిలితో గుద్దేడనుకుంటా'' చెంప కందినతీరును గమనిస్తూ అన్నాడు రాఘవయ్య.

''డిష్యూం డిష్యూం అనే శబ్దాలొచ్చేయా మీరు ఫైట్‌చేస్తుంటే? ఇంతకీ ఎవరితో ఫైట్‌చేశారు మీరు?'' అంటూ ఆసక్తిగా చూశాడు బంటూ.

అమ్మా, అబ్బా, అస్సూ, ఉస్సూ అని ఒకపక్క బాధపడుతూనే అసలేం జరిగింది చెప్పసాగాడు హరిశ్చంద్ర.

హరిశ్చంద్ర రోడ్డు మీద నడుస్తున్నాడు రాజకుమారుడిలా ఠీవీగా. అంటే బ్యాంక్ నుంచి ఇంటికొస్తున్నాడన్నమాట! సవేరా హొటల్ పక్కసందులోకి తిరుగుతుండగా అతని కెదురుపడిందో జంట. ఆ అమ్మాయికి పాతికేళ్ళుంటాయి. ఆమె మొగుడుగాడికి- మొగుడుగాడని చూడగానే అర్థమయిందిలే- ముప్పైపైచిలుకు. సన్నగా రివటలా వున్నాడతను. హరిశ్చంద్ర ఆ అమ్మాయివేపు చూడాలని చూడలేదు. ఏదో యథాలాపంగా అనుకోకుండా ఆమె పై పడింది అతని దృష్టి. తీరా పడ్డాక చూపు తిప్పుకోలేకపోయాడు- దానిక్కారణం ఆమె పట్ల అతనాకర్షితుడైపోవడం కాదు! ఆమె అచ్చం సిల్క్‌స్మితలా వుండటం! ''అరె... ఇదేంటబ్బా- సిల్క్‌స్మిత ఇక్కడ ప్రత్యక్షమైంది...?'' అన్న ఆశ్చర్యంతో అతను గుడ్లప్పగించి చూస్తుండగా- ''ఏంటండీ- అలా చూస్తున్నారు? మా మిసెస్‌గాని మీకింతకు ముందే తెలుసా?'' అని అడిగాడు రివటగాడు.

''ఏమోనండి! మీ మిసెస్ ఒకవేళ నిజంగా సిల్క్‌స్మితే అయితే ఆమె నాకు బాగా తెలుసనే చెప్పాలి. చాలా సినిమాల్లో చూశానామె డాన్స్!'' ఆమె సిల్క్‌స్మిత కాకపోయి కూడా వుండచ్చు అనే ఊహ మనసులో ఓమూలన వుండటంతో పాపం అమాయకంగా అలా అన్నాడు హరిశ్చంద్ర.

''ఏంటోయ్? ఏంటి పిచ్చిపిచ్చిగా వాగుతున్నావ్? ఏంటి నీ ఉద్దేశం?'' అంటూ నిప్పులు గక్కాడు రివటగాడు.

''వేరే చెడు ఉద్దేశం ఏమీ లేదండి. మీ మిసెస్‌గారు అచ్చం సిల్క్‌స్మితలా వుంటేనూ...''

హరిశ్చంద్ర ఇంకా ఏదో అనబోతుండగా- ''షటప్ రాస్కెల్'' అంటూ విరుచుకుపడ్డాడు రివటగాడు. ''ఎంతధైర్యంరా నీకు? నా మిసెస్‌ని నగ్నంగా డాన్స్‌చేసే ఆ నర్తకితో పోలుస్తావా?'' అంటూ అతని కాలర్ పుచ్చుకున్నాడు. దాంతో హరిశ్చంద్ర గింజుకుంటూ ''నేను సర్వకాల సకలావస్థలయందూ నిజమే చెప్పాల్సినవాణ్ణి... కాబట్టి నిజమే చెప్పాను తప్పేంటి'' అన్నాడనాలోచితంగా.

''కారుకూతలు కూసింది చాలక పైగా తప్పా అని అడుగుతావట్రా?'' అని ఘీంకరించి ఆ రివటగాడు...

అంతవరకు మాత్రమే తనమాటల్లో చెప్పి- ''అంతేనండీ అంతే! ఆ రివటగాడు... ఆ బద్మాష్‌గాడు... 'యాఁహూఁ' అంటూ... అబ్బ- నేను చెప్పలేనండీ చెప్పలేను...'' అంటూ రెండుచేతులు ముఖంలో దాచుకున్నాడు హరిశ్చంద్ర. సదరు క్రియవల్ల వాచిపోయి వున్న అతని ముక్కూ, కందిపోయి వున్న అతని దవడా నెప్పెట్టాయి గావల్సు- 'అబ్బా' అని బాధగా అన్నాడు మళ్ళీ.

''వద్దులే బాబూ- వద్దులే! మిగతా దృశ్యాల్ని మేం ఊహించుకోగలంలే'' అన్నాడు సానుభూతిగా రాఘవయ్య.

''అవునండీ వూహించుకోవచ్చు...సినిమాల్లో చూస్తుంటాంగా కరాటే ఫైట్స్'' అన్నాడంత బాధలోనూ హరిశ్చంద్ర.

''మీకిప్పుడు ముప్పైరెండూ వున్నాయా అండీ లేక కొన్ని వూడాయా?'' అని నవ్వాడు బంటూ.

''పోరా గాడిదా! ముదురు మాటలు రానురానూ బాగా ఎక్కువైపోతున్నాయ్! తప్పుకదూ- ప్రాణదాతని అలా అనొచ్చా?'' అంటూ వాణ్ణి కోప్పడి- ''ప్చ్... ఇవ్వాళ నువ్లేచిన వేళా విశేషం మంచిది కాదనకుంటా బాబూ'' అంది



పూర్ణమ్మ హరిశ్చంద్రకేసి జాలిగా చూస్తూ.

"అదేంకాదు...ఇదిగో...అంతా...ఇదిగో...దీని వల్లేవచ్చింది" అన్నాడు రాఘవయ్య లాహిరి కేసి కోపంగా మింగేసేలా చూస్తూ.

"అదేం చేసిందండీ మధ్యలో?"

"ఏం చేసిందా...దాన్నే అడుగు తెలుస్తుంది..."అంటూ ఇంక మనసునదుపులో పెట్టుకోలేక లాహిరి హరిశ్చంద్రకి పెట్టిన ప్రేమపరీక్షను గురించి మొత్తం చెప్పేశాడు రాఘవయ్య.

"ఏమే నిజమేనా?" అంది పూర్ణమ్మ.

"నిజమే!" అంది లాహిరి తలదించుకుంటూ.

"నీకేం పోయేకాలమే? ఇష్టం లేకపోతే లేదని చెప్పాలి...అంతేగాని బంగారంలాంటి పిల్లాణ్ణి ఇలా ముప్పుతిప్పలు పెడ్తావా? దానికి బుద్ధిలేకపోతే పోనీ నీకయినా జ్ఞానం లేదటోయ్" మొదట కూతుర్ని తిట్టి తర్వాత హరిశ్చంద్రని అడిగింది పూర్ణమ్మ.

"ఉందిగాని అండీ...మీ లాహిర్ని చూసిన తర్వాత మబ్బుల్లో దాగిన చందమామలా మనకేసిపోయింది! అబ్బా..." అన్నాడు హరిశ్చంద్ర.

"ఏంటీ- కడుపుపట్టుకుని అబ్బా అంటున్నావు కడుపులోకూడా గుద్దేడా?" అడిగాడు బంటూ.

"ఆ ... అబ్బా" అన్నాడు హరిశ్చంద్ర-అందులోనే బంటూ ప్రశ్నకి అవునన్న జవాబును ఇముడుస్తూ.

"నువ్పోరా ఇక్కణ్ణుంచి" అని వాణ్ణి గసిరి..."నువ్ కాసేపు రెస్ట్ తీసుకోబాబూ! కాసే పాగేక వేణ్ణీళ్ళుకాపడం పెడతాలే..." అని హరిశ్చంద్రతో చెప్పి-

"అల్లుడు కాసేపు రెస్ట్ తీసుకుంటాడు మనందరం వెళ్ళిపోదాం పదండి" అంది పూర్ణమ్మ రాఘవయ్య వేపుచూస్తూ.

రాఘవయ్య కళ్ళు వత్తికాయల్లా విచ్చుకున్నాయ్.

"ఏంటి పూర్ణా... ఏమన్నావ్?!" అన్నాడు విభ్రాంతిగా చూస్తూ. లాహిరికి మాత్రం గుండె జారిపోయింది ! ఇదేంటి అమ్మకూడా ఇలా మారిపోయింది...అమ్మకూడా అతనిపక్షం వహిస్తే ఇంక తన గతేమిటి?!

అమ్మా నాన్నా ఏకమైపోయి బలవంతం చేస్తే...?

కొంపదీసి తప్పదా ఏంటి తనకీ కారులేని హరిశ్చంద్రను చేసుకోవడం- అనిపించి క్షణంపాటు అల్లల్లాడిపోయింది. అంతలోనే-నో... నెవ్వర్! తన కంఠంలో ఊపిరుండగా జరగనివ్వదలా- అని తనకు తానే ధైర్యం చెప్పుకుంది.

"చెముడా ఏంటి? అల్లుడు రెస్ట్ తీసుకుంటాడు మనం వెళ్దాం పదమంటున్నాను" అనేసి తనేముందుగా బయటికి దారితీసింది పూర్ణమ్మ.

తదుపరి తతిమ్మావాళ్లనంతా ఆమెననుసరించారు.

హరిశ్చంద్ర ముఖం దేదీప్యమానంగా వెలిగిపోతూండటం గమనించి, గదిలోంచి కాలు బైటపెట్టే ముందు లాహిరి అతనికేసి తీక్షణంగా ఓ చూపు చూసింది.

చూసుకో... నీకిష్టం వచ్చినట్టు చూసుకో! అత్తయ్య నాపక్షమే, మామయ్యా నాపక్షమే! నాకింకేం భయంలేదు... అనేసుకున్నాడు హరిశ్చంద్ర లోలోన గుంభనంగా నవ్వుకుంటూ.

చావుదెబ్బలు తిన్నతనని ఒంటరిగా వదిలేసి అందరూ వెళ్ళిపోయినా, అతని మనసు ఆనందడోలికల్లో తేలియాడిపోసాగింది!

"రివటగాడు తంతే తన్నేడుగాన్రా... మొత్తానికి నువ్ గారెల బుట్టలో పడిపోయావ్!" అంటూ ప్రశంసించింది అతని అంతరాత్మ.

★ ★ ★

రివటగాడి కరాటే స్ట్రోకుల పుణ్యామా అని ఓ అరగంట తర్వాత హరిశ్చంద్రకి ముమ్మరంగా జ్వరం కాసేసింది.

కాసిన జ్వరం కాసేపటికో కూసేపటికో పోయుంటే అది వేరు. కాని ముచ్చటగా మూడ్రోజులు పట్టిపీడించింది. ఆ మూడ్రోజులు బ్యాంక్‌కి వెళ్ళలేదు హరిశ్చంద్ర. రాఘవయ్యే స్వయంగా తీసుకెళ్ళి యిచ్చాడు లీవ్‌లెటర్ని బ్యాంక్ మేనేజర్‌కి. ఆ మూడ్రోజులూ పూర్ణమ్మ




చేసిన ఏ చిన్న పని అంతా ఇంతా కాదు. కాపడాలు పెట్టడం, తడిగుడ్డతో ఒళ్లు తుడవడం, మందూమాత్రలూ వేళపట్టున దగ్గరుండి మింగించడం, బ్రెడ్డూ, పాలు స్వయంగా తిని పించటం, తాగించడం- ఆ సమయంలో అతని తల్లే గనక దగ్గరఉండిఉంటే ఎన్నిసేవ లు చేసునో అన్ని సేవలూ చేసిందామె హరి శ్చంద్రకి.!

జ్వరతీవ్రతతో హరిశ్చంద్ర- "తన్నరాతన్నూ! నా లాహిరికోసం... నేనెన్ని కష్టాలైనా భరిస్తాను... తన్నూ! నా లాహిరి నా ప్రాణంరా..." అని ఏమిటేమిటో పిచ్చిపిచ్చిగా కలవరించేస్తుంటే ఆమెకి అతనిపట్ల ఎంతజాలి కలిగిందీ అంటే ఉన్నపళంగా లాహిరిని అక్కడికి లాక్కొచ్చి అతనిచేత ఆమె మెడలో అప్పటికప్పుడే పను పుతాడు కట్టించేయాలన్నంత జాలి కలిగింది.

'ఎంత అమాయకుడు! వయసుకి యువకు డన్నమాటేగాని పాపం పసిమనసు'! లాహిరిని ఎంతగా ప్రేమిస్తూండకపోతే... జ్వరంలో కూడా అవ్వే కలవరింతలా?!

"లాహిరీ! నిజంగా నువ్ చాలా అదృష్ట వంతురాలివమ్మా" అనుకుంది పూర్ణమ్మ, అత నికీ లాహిరికీ ఇంకా పెళ్లి కానేలేదన్న విషయా న్నీ ఆక్షణాన్న విస్మరిస్తూ.

అదే మాటని లాహిరితో అంటే గయ్యిమంటూ లేచింది లాహిరి. "మొత్తానికి అతను నిన్నూ నాన్ననూ బాగా బుట్టలో వేసుకు న్నాడు. అంతా నాటకం! జ్వరంతో అంతంత పెడుగు కలవరింతలు కలవరిస్తారా ఎవర యినా? అతను కావాలనే కళ్లుమూసుకుని అలా అని వుంటాడు. నిన్ను బోల్తా కొట్టించడా నికి..." అంటూ ఓ కుశంకని కూడా లేవదీ సింది.

"చాల్లే ఊరుకోవే! మరీ అంత నిర్దయగా మాట్లాడకు. జ్వరంతా ఓ ప్రక్క అతని ఒళ్లు పెనంలో మాడిపోతుంటే పాపం నాటకా లంటావేం..." అంటూ పూర్ణమ్మ కోపంగా చూ సింది.

"నేను నాటకం అన్నది అతని జ్వరాన్నికా దు...కలవరింతని. జ్వరంవుండే వుంటుందిలే. కాని కలవరింత మాత్రం ఉత్తుత్తిదే!" అని ఈసడించి పారేసింది లాహిరి.

"నీకు తిక్కో చాధస్తమో నాకర్థం కావడంలే దు... అతనుపాపం నిన్ను చేసుకోవాలని అంతగా ఆరాటపడుతుంటే పురుగును దులి పినట్టు దులిపి పారేస్తావేం? ఏం- అతనికేం తక్కువ? మీ నాన్నతో చెప్పాడట... పాపం నీకోసం వాళ్ల అమ్మానాన్నలతో తగవు కూడా పెట్టుకుని వచ్చాడట. మొన్న వెళ్లినపుడు.. నీకంతకన్నా మంచి మొగుడొస్తాడనుకుంటు న్నావా?!... కోరి అదృష్టం వరిస్తానంటే కాలద న్నుకోకు... అసలు నీ ఉద్దేశం ఏంటి? ఎందుక తన్ని కాదంటున్నావ్?.." అంటూ నిలదీసింది పూర్ణమ్మ.

ఇక దాచిపెట్టి ప్రయోజనంలేదని తల్లితో తన మనసులోని ఉద్దేశాన్ని స్పష్టంగా చెప్పే సింది లాహిరి.

అదివిన్న పూర్ణమ్మ - "ఏమిటే?! నీమొహాని కి కారున్న ఆరడుగుల అందమైన యువకు డు కావాలా?- అంటూ దవడలు నొక్కుకుంది.

"ఏం... నామొహానికేం తక్కువ?! ఏం... నేనందంగావుండనా?... కాదని ఎవరితోనైనా అనిపించుచూద్దాం... " అంది ఉక్రోషంగా లాహిరి!

"నీబోడి అందం ఎవడిక్కావాలే! ఈ రోజు ల్లో ఎవరికైనా కావాల్సింది డబ్బు! మీనాన్న పీనాసినతనం తెలుసుండీ నీకంత గొప్ప సంబంధం వస్తుందని ఎలా అనుకుంటు న్నావ్?-

కనీసం ఓ అయిదు లకారాలన్నా ఇవ్వందే కారున్న సంబంధం వస్తుందా ఈ రోజుల్లో?"

"నీకేం తెలియదులే నువ్వూరుకో... అంతంత డబ్బున్నవాళ్లు మనమిచ్చే ముష్టిక ట్నానికేం ఆశపడరు!"

"ఆ ఆ పడరుపడరు... పాపం నీ అంత అందగత్తె ఇంకెవర్తీ లేదనీ, దామ్మా దా చేసు కుంటాం కట్నం లేకుండా నిన్నంటూ కారున్న వాళ్లంతా నీ కాళ్లమీద పడిపోతారు. చాల్లే నోర్మూసుకోవే! కోరికలక్కూడా ఓ హద్దుండాలి!..."

తల్లి అలా అంటుంటే లాహిరి కళ్లకి

ఆమెలో ఓ మూర్ఖురాలు కనిపించిందే తప్ప ఆమె మాటల్లోని వాస్తవాన్ని మాత్రం జీర్ణించుకోలేకపోయింది.!

రాంబాయమ్మగారి నవల్లోని ఎందరు కారున్న హీరోలు బీద అమ్మాయిలను చేసుకోలేదు!? అమ్మ మూర్ఖత్వం కొద్దీ అంటున్నదే తప్ప - అదేం అసంభవం కాదు! అని అనిపించడంతో... 'నీ వాగుడుతో నాకేం పనిలే' అన్నట్టు తలెగరేసి అక్కడి నుంచి వెళ్ళిపోయింది లాహిరి.

★ ★ ★



జ్వరం తగ్గి ముక్కూ, దవడా, ఎడమకాలూ, మళ్ళీ మామూలు షేపును సంతరించుకున్నాక... తిరిగి ఎప్పటిలా బ్యాంక్‌కి వెళ్ళిరావడం మొదలుపెట్టాడు హరిశ్చంద్ర.

ఇపుడు హరిశ్చంద్ర రాఘవయ్య ఇంట్లో ఓ కుటుంబ సభ్యుడే అయిపోయాడు!

ఒక్క లాహిరి తప్ప అందరూ అతనితో ఎంతో మంచిగా వుంటున్నారు. అమ్మానాన్నలు అతన్నెలాగూ అల్లుడిగానే చూస్తున్నారుకదా అన్జెప్పి ఈ మధ్య బంటూ కూడా అతన్ని "బావా" అని పిలిచేయడం మొదలుపెట్టాడు.

అందుగ్గాను లాహిరి పాపం ఒకట్రెండుసార్లు వాడి వీపువిమానం మోత మోగించకపోలేదు! కాని వాడికిదో లెక్కా!? తుంటరివెధవ, ఏదో ఒకటిచేసి ఏనాడూ తంటూనే వుంటాడాయె- జెల్లకాయలూ, మడతకాజాలూ!!

మొత్తానికి కథ సుఖాంతం కాబోతున్నదా- అన్న వాతావరణం ఏర్పడిపోయింది ఆ ఇంట్లో-

ఓ నాలుగు నెలలుసజావుగా సాగిపోయాయి.

ఈ నాలుగునెలల్లో హరిశ్చంద్ర షేపులు మాత్రం ఎప్పుడూ మారలేదు. కాని బయటి ప్రపంచంలో అతను క్రాక్ మాస్టర్‌గా పేరుపడిపోయాడు!

ఎటొచ్చి కొత్తవాళ్ళతోనే ఇబ్బంది తప్ప- అతన్నెరిగున్నవాళ్ళు మాత్రం అతని మాటల్ని పట్టించుకోవడమే మానేశారు. అంటే ఏదైనా సందర్భాలలో అతను అపకతపగ్గా మాట్లాడినా "పోనీలెద్దూ... తెలిసిందేగా క్రాక్‌గాడు..." అని లీనియంట్‌గా తీసుకోవడం అల

వాటు చేసుకున్నారు.

అతని ప్రేమా, దాని కథాకమామీషూ అయితే అందరికీ తెలియదుగాని... అతను సర్వకాలసకలావస్థలయందూ నిజమే చెపుతాడన్న సంగతిమాత్రం- అదిన్నూ మాట దాటవేయకుండాఅని- అందరికీ అర్థమైపోయింది.

దాన్నలుసుగా తీసుకుని అతని కొలీగ్స్ కొందరు నిత్యం అతన్ని ఏడిపించడమే తమ ధ్యేయంగా పెట్టుకుని వినోదించసాగారు. కొందరు బూతుప్రియులైతే ఎంతో తెలివిగా అతను బూతు సమాధానం మాత్రమే చెప్పాల్సి వచ్చేలాంటి ప్రశ్నలు వేసి- అతన్ని చాలా ఇరుకునపడేస్తుండేవారు! "శోభనం అంటే ఏమిటి?" అనడిగాడొకడు ఓ రోజు నలుగురూ ఉండగా.

నిజానికి దానికి చాలా సున్నితమైన సమాధానం చెప్పవచ్చు. కాని పాపం హరిశ్చంద్ర అలాంటి సమాధానం చెప్పినా; ప్రశ్న అడిగినవాడు శాటిస్‌ఫై అయితేకదా! ఒకదానికొకటి ఒకదానికొకటి అనుబంధ ప్రశ్నలు వేసి- అతన్ని విసిగించి- చివరికెలాగో బూతు సమాధానమే రాబట్టాడు- సదరు ప్రశ్నవేసిన బూతు ప్రియుడు. అందరూ ఘొల్లున నవ్వితే పాపం హరిశ్చంద్ర చిన్నబుచ్చుకున్నాడు. అంతకన్నా ఏం చేయగలడు మరి?

అలాంటి ఎలర్జిక్ బూతు సందర్భాలను ఓ పక్కకు పెడితే-

కొందరు సునిశిత హాస్యప్రియులు సున్నితమైన హాస్యాన్ని మాత్రమే ఎక్స్‌ట్రాక్ట్ చేస్తుండేవారు అతని బలహీనతలోంచి- సర్వకాల సకలావస్థలయందూ నిజమే చెప్పడం అన్నది అతని బలహీనతేనని జనసామాన్యాభిప్రాయం! ఎందుకంటే ప్రేమపరీక్ష విషయం అందరికీ తెలియదు గదా?!

ఒకసారి నరేంద్ర అనే కొలీగ్ వున్నట్టుండి "మీ జేబులో ఓ కాగితం ఉంది! అందులో ఏముందో అబద్ధం ఆడకుండా అందరికీ చదివి వినిపించండి" అన్నాడు హరిశ్చంద్రతో. అవి బ్యాంక్ వర్కింగ్ అవర్స్ కావటాన చాలామంది కస్టమర్స్ కూడా వున్నారా సమయంలో అక్కడ! అందులోనూ నలుగురైదుగురు లేడీసు!

"నా జేబులో కాగితమా?!" ఆశ్చర్యంగా అన్నాడు హరిశ్చంద్ర.

"అవును- వుంది... పైకి తీసి చదవండి" అన్నాడు నరేంద్ర.

హరిశ్చంద్రకి తన జేబులోని కాగితాన్ని పైకి తీసి అందులో మాటల్ని బిగ్గరగా చదవక తప్పలేదు-

"హరిశ్చంద్ర అనబడు నేను ఓ క్రాక్ మాస్టర్‌ని. ఇట్లు- హరిశ్చంద్ర!"

అంతే. ఆ ప్రదేశమంతా నవ్వులతో మారుమోగిపోయింది!

తను ఏమరుపాటుగా వున్నప్పుడు నరేంద్రే అలా రాసి ఆ కాగితాన్ని తన జేబులో వేసి వుంటాడని గ్రహించడానికి హరిశ్చంద్రకు ఎంతోసేపు పట్టలేదు.

అందరూ తనకేసి పరిహాసంగా చూస్తుంటే పాపం అక్కడింక వుండలేక లేచి గబాగబా వెళ్ళిపోయాడు!

ఇంచుమించు ప్రతిరోజూ అలాఏదో ఒక సందర్భంలో ఇరుకునపడి అవహేళన పాలుకాకతప్పడంలేదు హరిశ్చంద్రకి.

తననంతా క్రాక్‌మాస్టర్ అంటున్నారని ఇప్పుడతనికీ తెలుసు! కానైతే రోజూ చచ్చేవాడికోసం ఎవరేడుస్తారన్నట్టు. ఇప్పుడతను ఎలాంటి అవమానాలనైనా సరే పట్టించుకునే స్థితిని అధిగమించిపోయాడు.

అతని సంతోషమల్లా ఒక్కటే- ఎలాగోలా రోజులు గడిచిపోతున్నాయి! ఎలాగోలా గడువు కాలం పూర్తయ్యేదాకా ఓర్చుకుంటే లాహిరి తనదైపోతుంది!

ఈమధ్యకాలంలో అతను మళ్ళీ ఒకసారి వెళ్ళి వచ్చాడు తన స్వగ్రామానికి. జరగాల్సిన రగడంతా అంతకుముందే జరిగిపోయింది కాబట్టి ఈ సారతను నిర్భీతిగానే వెళ్ళాడు- తనంతట తానే - తల్లిని చూడాలనిపించి! ఈసారి చెప్పుకోదగినంత రాద్ధాంతం జరగకపోయినా, అచ్యుతరామయ్యే మాత్రం "ఏరా... నీమనసు మార్చుకునే ఉద్దేశం ఏమీలేదా?" అని మళ్ళీ అడిగిచూశాడు. 'అది అసంభవం' అని మరోసారి నొక్కి వక్కాణించి వచ్చాడు




హరిశ్చంద్ర.

పోతే లాహిరి మనసును మాత్రం అతనేపాటికూడా కదిలించలేకపోయాడనే అనుకోవాలి! ఆమె ప్రవర్తన అప్పట్లో ఎలా ఉందో ఇప్పుడూ అంతే!

ఇదేప్రకారం ఇంకో నాలుగునెలలు కూడా గడిచిపోయేసరికి హరిశ్చంద్రలో తొంభైతొమ్మిదీ పాయింట్ తొమ్మిది (రికరింగ్) శాతం నమ్మకం ఏర్పడిపోయింది- ఇంక తన భావిసతీమణి లాహిరే అని!

అయితే అందుకు లాహిరి ప్రవర్తన ఏమయినా దోహదపడిందా అంటే అదిమాత్రంకాదు! ఆమె ఇంకా పాతధోరణిలోనే వుంది!! కేవలం గడువుకాలం పూర్తికావస్తున్నదికదా అన్న ధీమాయే హరిశ్చంద్రలో ఆ నమ్మకం ఏర్పడేలా చేసింది!

అయితే-

ఊహాతీతమైన ఓ ప్రమాదం తనను ఓటమికి గురిచేయడానికై నిర్దాక్షిణ్యంగా పొంచి చూస్తున్నదని అతను బొత్తిగా అనుకోలేకపోయాడు!

మరి అతనేమీ త్రికాలజ్ఞాని కాదుగదా?!

★ ★ ★

ఆరోజు...

సమయం సాయంకాలం ఆరుగంటలు...

రాఘవయ్య హరిశ్చంద్ర రూమ్‌లో కూర్చుని అతనితో ఏదో పిచ్చాపాటీ మాట్లాడుతున్నాడు.

కాబోయే మామా అల్లుళ్ళిద్దరూ చాలా హుషారుగా వున్నారు. తేరగా దొరుకుతున్న అల్లుడుకదాని లాఘవయ్యకి హరిశ్చంద్రని చూస్తే హుషారు. "నాకూతురి హృదయాన్ని తొందరగా కొల్లగొట్టవేయ్" అని ఎంకరేజ్ చేసే చిత్రవిచిత్రమైన 'ఆదర్శమామ' కదాని హరిశ్చంద్రకి రాఘవయ్యని చూస్తే హుషారు! అంచేత వాళ్ళెపుడు మాట్లాడుకున్నా హుషారుగానే మాట్లాడుకుంటారు. వాళ్ళవిషయంలో అది సర్వసాధారణమైపోయింది!

ఏదో మాట్లాడుతూ మాట్లాడుతూ రాఘవయ్య సడన్‌గా గుండెపట్టుకున్నాడు, "అబ్బా" అంటూ

"ఏమైంది మావయ్యగారూ?" హరిశ్చంద్ర కంగారుపడ్డాడు.

రాఘవయ్య మాట్లాడలేకపోయాడు. ముఖకవళికలనుబట్టి అతను పళ్ళబిగువున భరించరాని బాధను అణచుకుంటున్నట్టు అర్థమవుతూ వుంది!

హరిశ్చంద్ర మరింత కంగారుపడ్డాడు... అరెరె... ఏంటీ మావయ్యగారూ ఇది?! ఉన్నట్టుండి...ఏమిటిది?!"

రాఘవయ్య జవాబు చెప్పగల స్థితిలో వుంటేగా!? రెండు చేతులతోనూ గుండె అదిమిపట్టుకుని ఉంగలు చుట్టుకుపోసాగేడు!

అతనికి సడన్‌గా గుండెనొప్పి వచ్చిందని గ్రహించడానికి హరిశ్చంద్రకి ఎంతోసేపు పట్టలేదు.

ఒక్కపరుగున పూర్ణమ్మగారి దగ్గరికి వెళ్ళి, ఆమెకి విషయం చెప్పి-, "మీరు మావయ్యగార్ని చూస్తుండండి, నేను అర్జంటుగా వెళ్ళి డాక్టర్‌ని పిలుచుకొస్తాను" అంటూ బయటికి పరుగుతీశాడు.

పూర్ణమ్మ గాభరాగా పరుగుతీసింది హరిశ్చంద్ర రూమ్‌వేపు.

ఎలావెళ్ళాడో ఎలా వచ్చాడోగాని- ఓ పావు గంటైనా తిరక్కముందే డాక్టర్‌తోసహా మళ్ళీ తన రూమ్‌లో వున్నాడు హరిశ్చంద్ర!

డాక్టర్ తాత్కాలికంగా ఏదో ఇంజక్షన్ చేసి రాఘవయ్య బాధను అప్పటికి ఉపశమింపజేశాడు! వెంటనే మగతగా కళ్ళుమూసుకుని నిద్రలోకి జారిపోయాడు రాఘవయ్య.

"మరేం ఫర్వాలేదా డాక్టర్‌గారూ?" అంది పూర్ణమ్మ దుఃఖాన్ని నిగ్రహించుకుంటూ.

"మీరు..." హరిశ్చంద్ర వేపు సందిగ్ధంగా చూస్తూ అన్నాడు డాక్టర్.

"నేను వారి అల్లుణ్ణిలెండ..."

"ఇలా రండి... ఏమ్మా మీరంతా ఆ మంచంచుట్టూ లేవాలి! ఆయనిప్పుడిప్పుడే లేవరు... ఆయన్ని కదిలించకండి.."

ఆ మాటలకి మంచంచుట్టూ మూగివున్న పూర్ణమ్మ, లాహిరి, బంధువులు దగ్గరగా వెళ్ళి నిలబడ్డారు.

వాళ్ళ దృష్టంతా డాక్టరుమీదే వుంది...

ఆయనేం చెబుతాడోనని.

హరిశ్చంద్రని ఒకింత ఎడంగా తీసుకు వెళ్లి చెప్పాడు డాక్టర్- "బెటర్ అడ్మిట్ హిమ్ ఇన్ మై నర్సింగ్ హోం... ఐ సస్పెక్ట్ ఇట్ ఈజ్ హార్ట్ ఎటాక్! ప్రస్తుతానికేం ఫర్వాలేదు. కాని నాలుగైదు రోజులపాటు ఇంటెన్సివ్ కేర్ తీసుకోవాల్సి వుంటుంది..."

"అలాగే సార్! ఎప్పుడు చేర్పించమంటారు?"

"ఎప్పుడ నేముంది... ఎంత త్వరగా వీలైతే అంత త్వరగా!... పేషెంట్‌కి తెలివి రాక ముందే అక్కడికి చేర్చగలిగితే ఇంకా మంచిది...."

"ష్యూర్.." అన్నాడు హరిశ్చంద్ర.

"చూడండి... ప్రస్తుతానికిది చాలా మైల్డ్ ఎటాక్! ముందుముందు ఇంకా సివియర్‌గా రావచ్చు! కాబట్టి మీరంతా చాలా జాగ్రత్తగా వుండాలి! ముఖ్యంగా పేషెంట్ ముందు ఏడవటం- ఆయనకి ఆందోళన కలిగించడం చెయకూడదు! హార్ట్‌ఎటాక్ అని సడన్‌గా తెలిస్తే బహుశా ఆయన బాగా భయపడచ్చు కాబట్టి ఈ విషయం ఆయనతో అప్పుడే చెప్పకండి..." గదిలో వున్న అందర్నీ ఉద్దేశిస్తూ చెప్పాడు డాక్టర్!

అలాగే అన్నట్లు తలలు ఊగించారు పెద్దవాళ్లు ముగ్గురూ. బంటూగాడు మాత్రం తల ఊగించలేదు. వాడి దృష్టంతా డాక్టర్ చేతిలోని స్టెతస్కోప్ మీద వుంది! ఒక్కసారి తనుకూడా దాన్ని ఉపయోగించి చూస్తే ఎంత బావుంటుందో కదా- అని వాడి ఆలోచన!

"ఆయనకి... ఆయనకి... ఏం ఫర్వాలేదా డాక్టర్‌గారూ?..." పూర్ణమ్మ పమిట చెంగుతో కళ్లొత్తుకుంటూ అడిగింది.

"అదుగో- అదే కూడదంటున్నాను. పేషెంట్‌కి తెలివొచ్చాకా అతని ముందు కూడా మీరిలాగాగాని ప్రవర్తిస్తే... చాలా ప్రమాదం..." డాక్టర్ అన్నాడు ఒకింత కోపంగా చూస్తూ.

"మిస్టర్..."

"హరిశ్చంద్ర..." చెప్పాడు హరిశ్చంద్ర.

"చూడండి మిస్టర్ హరిశ్చంద్రా... మీరు పేషెంట్‌ని నర్సింగ్‌హోంలో చేర్పించే ఏర్పాట్లు చేయండి. మీకు పరిస్థితంతా అర్థమైందికదా!?... మీవాళ్లందరికీ చెప్పండి- పేషెంట్‌కి ప్రశాంతత చాలా అవసరం! ఇప్పుడంటే కండిషన్ చాలా సీరియస్‌గా వుందన్నారు కాబట్టి వచ్చాను. కాని మాటిమాటికీ ఇలా వీలుపడదు! సో... వియ్ షల్ మీట్ ఎగైన్ ఓన్లీ ఇన్ మై నర్సింగ్ హోమ్" అని తన మెడికల్ కిట్‌ని చేతిలోకి తీసుకోబోయాడు డాక్టర్.

ఆయన్ని వారించి హరిశ్చంద్ర తానే అందుకున్నాడు దాన్ని. ఆ డాక్టర్‌గారి నర్సింగ్ హోం అక్కడికి చాలా దగ్గర్లోనే వుంది. ఆయన్ని రిక్షా ఎక్కించి వచ్చాడు హరిశ్చంద్ర.

అతనొచ్చేసరికి లాహిరీ, పూర్ణమ్మ ఒకర్నొకరు పట్టుకుని ఏడుస్తూ కనిపించారు.

"అరెరెరె... ఏం పనిది?! డాక్టర్‌గారు చెప్పిందంతా గాలికొదిలేశారన్నమాట! అత్తయ్యగారికంటే తెలియదు కాని చదువుకున్నదానివి నువ్వేంటి లాహిరీ ఇలాగ?!

లాహిరిని తొలిసారిగా తను ఏకవచనంతో సంబోధిస్తున్నాడన్న విషయాన్ని అతను గ్రహించలేదు; లాహిరీ గ్రహించలేదు.

హరిశ్చంద్రని చూడగానే పూర్ణమ్మలో దుఃఖం కట్టలు తెంచుకుంది.

"మేమేం పాపం చేశామని బాబూ, భగవంతుడు మాకీ శిక్ష వేశాడు... డాక్టర్ గారు దార్లో ఇంకా ఏమయినా చెప్పారా?" బావురుమంది ఆమె.

"ఛఛ... ఊరుకోండత్తయ్యాగారూ! ఇప్పుడేమైందని అంతలేసి మాటలంటున్నారు... మీరూ విన్నారుగా... చాలా మైల్డ్ ఎటాక్, మరేం ఫర్వాలేదని చెప్పారుగా డాక్టర్‌గారు?!"

"ఏమిటో నాయనా... నాకు చాలా భయంగా వుంది..." అందామె ఇంకా వెక్కిళ్లు పెడుతూనే.

"భయందేనికండీ! ఈరోజుల్లో హార్టెటాక్ అంటే ఓలెక్కే కాదు- గుండెను తీసి గుండెను మారుస్తున్నారు డాక్టర్లు..."

"అంటే ఈయనక్కూడా ఆపరేషన్..."

"అబ్బే... ఆపరేషనేం అవసరం వుండదత్తయ్యగారూ! సరియైన ఆహార నియమాలు

## ఉమ్మడి శక్తి ప్రభావమే అమోఘం
## 5 వేళ్లనూ కలిపి పిడికిలి బిగిస్తే వాటి శక్తి అపారం.

# జండూ పంచారిష్ట

### మీ జీర్ణాశయాన్ని సవ్యంగా ఉంచి
### మీకు మంచి ఆరోగ్యం చేకూర్చుతుంది

జబ్బుల లక్షణాలు వేరు-వేరయినా, వాటికి మూల కారణం సాధారణంగా ఒక్కటే. జీర్ణశక్తి లోపించడం. ఫలితమే అనారోగ్యం.ఇప్పుడు జీర్ణశక్తి కోసం వాడండి జండూ పంచారిష్ట.

గొప్ప 5-ఇన్-1 జీర్ణకారి టానిక్.మీ చేతి ఐదు వేళ్లలాగే జండూ పంచారిష్ట జీర్ణసంబంధమైన సమస్యలను సమర్థవంతంగా, సురక్షితంగా పరిష్కరిస్తుంది. అజీర్తి,అధిక భోజనం, కడుపులో వాయువు, తేపులు - ఈ బాధల నుంచి ఉపశమనానికీ, సున్నితంగా పనిచేసే విరేచనకారిగానూ, ఆకలిని వృద్ధి పరచడానికి కూడా ఇది ప్రభావవంతంగా పనిచేస్తుంది. 5 వేళ్లనూ కలిపితే ఆ పిడికిలిలోని శక్తి ఎంత అపారంగా వుంటుందో, అలాగే, జండూ పంచారిష్టలోని ఆయుర్వేద ఔషధ గుణాలు ఉమ్మడిగా కూడి మీ జీర్ణకోశాన్ని చక్కబర్చి, బలం చేకూర్చుతాయి.

క్రమం తప్పక జండూ పంచారిష్ట సేవించండి. మీ సామాన్య ఆరోగ్యం ఎలా వృద్ధి చెందుతుందో మీరే చూడండి.

మరి ఆరోగ్యమే కదా మహాభాగ్యం!




# జండూ పంచారిష్ట

*ఐదు ఔషధములతో కూడిన జీర్ణకారి టానిక్*



450 మి. లీ. మరియు 200 మి. లీ. సైజులలో లభిస్తుంది.

CLARION/B/ZP/20/173 TEL

పాటిస్తూ, క్రమంగా మందులు వాడుతుంటే అదే తగ్గిపోతుంది''

''ఏమో బాబూ... ఆ భగవంతుడేం చేస్తాడో మరి''

పూర్ణమ్మ కళ్ళ వెంబడి కన్నీరు ధారాపాతంగా కారిపోతుంటే ''లాహిరీ! అమ్మనవతలకి తీసుకెళ్ళు...'' అన్నాడు హరిశ్చంద్ర. అంతలో చటుక్కున నాలుక్కరుచుకున్నాడు.

''సారీ లాహిరిగారూ... ఏంక్షయిటీలో మిమ్మల్ని...''

అతడి ఉద్దేశాన్ని అర్థంచేసుకున్న లాహిరి- ''ఫర్వాలేదులెండి! మీకన్నా చిన్నదాన్ని! ఇక నుండి అలాగే పిలవండి... ఫర్వాలేదు'' అనేసి తల్లిని అక్కడి నుంచి బలవంతంగా బయటికి తీసుకెళ్ళిపోయింది.

డాక్టర్ మాట ప్రకారం రాఘవయ్యకింకా తెలివిరాకముందే అతన్ని నర్సింగ్ హోంకి తరలించాడు హరిశ్చంద్ర.

''దగ్గరేగా ఎలాగోలా రిక్షాలో వెళ్ళొచ్చులే'' అని పూర్ణమ్మ వారించబోయినా లెక్కచెయ్యకుండా టాక్సీ మాట్లాడి తీసుకొచ్చాడు.

రాఘవయ్యని అతి జాగ్రత్తగా బాక్సీట్లో పడుకోబెట్టి, తానతని తలదగ్గర కూర్చుని తలని ఒళ్ళోపెట్టుకున్నాడు. బంటూ, లాహిరీ ఫ్రంట్ సీట్లో డ్రైవర్ పక్కన కూర్చున్నారు. పూర్ణమ్మ భర్త కాళ్ళవెంత కూర్చుంది.

స్పృహలో లేని భర్తని అలా కార్లో తీసుకువెళ్ళడం పూర్ణమ్మకి చాలా భయంభయంగా అనిపించింది! దారిపొడుగునా ఆమె కళ్ళొత్తుకుంటూనే వుంది. హరిశ్చంద్ర ఆమెకు ధైర్యం చెబుతూనే ఉన్నాడు.

''అరెఁ... అప్పుడే వచ్చేశారే!!'' వీళ్ళని చూసి ఆశ్చర్యపోతూ అన్నాడు డాక్టర్.

''మీరేగా డాక్టర్ చెప్పారు... ఎంత త్వరగా తీసుకొస్తే అంత మంచిదని...''

''అందరూ మీలా వుంటే ఎంత బావుంటుంది?! కొంతమంది పరిస్థితిని పూర్తిగా విషమించేదాకా పట్టించుకోరు...''

డాక్టర్ అభినందించారు. ఆయన పేరు శ్రీవాత్సవ. హస్తవాసి మంచిదనీ, అందరికీ అందుబాటులో వుండే డాక్టరనీ ఆ ఏరియాలో ఆయనకి చాలామంచిపేరు వుంది.

''మా మావయ్యగారి విషయంలో మీరు స్పెషల్ కేర్ తీసుకోవాలి డాక్టర్... ఫీజు ఎంతయినా ఫర్వాలేదు!... దేనికీ వెనుకాడబోకండి... సాధ్యమైనంత మంచి ట్రీట్‌మెంట్...''

హరిశ్చంద్రను మాటపూర్తిచేయనీలేదు డాక్టర్. ''నో... మిస్టర్ హరిశ్చంద్రా. నాదగ్గర అలా మంచిట్రీట్‌మెంటూ చెడు ట్రీట్‌మెంట్ అని రెండు రకాలుండవు... ఫైనాన్షియల్ పొజిషన్ని బట్టి పేషంట్లని వర్గీకరించడం నాకలవాటు లేదు''

''సారీసార్... నా ఉద్దేశం అలా అని కాదు...'' ఆయనగాని అఫెండయ్యాడేమోనని క్షమాపణ చెప్పుకున్నాడు హరిశ్చంద్ర.

''డోంట్‌వర్రీ.. ఫాక్ట్ చెప్పానంతే!'' కాంపౌండర్‌ని కేకేసి రాఘవయ్యని ఏ రూంలో ఉంచాలో చెప్పాడు డాక్టర్.

కాసేపటికి ఇద్దరు కుర్రాళ్ళు కారు దగ్గరికి స్ట్రెచర్ తీసుకుని వచ్చారు.

★ ★ ★

రాత్రి పదకొండున్నర— పన్నెండు... ఆ ప్రాంతంలో తెలివి వచ్చింది రాఘవయ్యకి.

ఆ గదినీ, ఆ వాతావరణాన్ని చూసి కంగారు పడ్డాడతను.

''ఇదేంటీ నేనిక్కడున్నాను?!... ఇది... ఇది హాస్పిటల్ కదూ?''

''అవును మావయ్యగారూ... మీకు స్వల్పంగా అనారోగ్యం చేస్తే ఇక్కడికి తీసుకువచ్చాం...''

''ఎప్పుడూ? నాకు తెలియదే?!... అంటే నేను స్పృహలో లేనా?!''

''లేరు... మీకు నొప్పిరాగానే డాక్టర్ వచ్చి ఇంజక్షన్ చేశారుగదా! అది మత్తు వచ్చే ఇంజక్షను. అందుచేత మీకు నిద్రపట్టేసింది...''

పూర్ణమ్మ ఒకింత ఎడంగా నిలబడి గుడ్లనీరు కుక్కుకుంటూ వుండటాన్ని క్రీగంట గమనించిన హరిశ్చంద్ర 'కూడదన్నట్టు' ఆమెకు కళ్ళతో సైగ చేశాడు.




అదికాస్తా రాఘవయ్య దృష్టిలో పడనేవ డింది. అతను ఆందోళనగా అన్నాడు.

"ఎందుకయ్యా ఏదో దాయడానికి ప్రయత్నిస్తావు?... నిజంగా నాది స్వల్ప అనారోగ్యమే అయితే- ఇంత సడన్‌గా తీసుకొచ్చి హాస్పిటల్లో ఎందుకు పడేస్తారు?!.... నిజం చెప్పు..."

హరిశ్చంద్ర అతని తలదగ్గర కూర్చుంటూ- "భలేవారే మావయ్యగారూ!" అంటూ నవ్వాడు...

"నిజం చెప్పలేదని నన్నా అంటున్నారు మీరు?!" అన్నాడు బుగ్గలునొక్కుకుంటూ. "నేను సర్వకాల సకలావస్థల యందూ నిజమే చెప్పాల్సినవాణ్ణని మీకు తెలుసుకదా!... నేను అబద్ధం చెబుతానా?!"

"చెప్పవు కాబట్టే నిన్ను అడుగుతున్నాను... నాకొచ్చింది హార్ట్ ఎటాక్ కదూ?... ఏం... మాట్లాడవేం?... అంతేనా?"

"కాదులే గాని మీరు రెస్ట్ తీసుకోండి మావయ్యగారూ! ఏదో జనరల్ వీక్‌నెస్ వల్ల అలా వచ్చిందట! రెండ్రోజులు ఇంటిపట్టున వుండి రెస్ట్‌తీసుకుంటే సరిపోతుందన్నారు డాక్టర్‌గారు. కాని మేమే ఎందుకయినా మంచిదని... ప్రికాషనరీ మెషర్ అన్నమాట... ఇక్కడ చేర్పించాము..."

"నిజమా?" అన్నాడు రాఘవయ్య ఇంకా నమ్మలేకపోతూ.

"అదేంటి మావయ్యగారూ... నేను అబద్ధాలు ఆడలేక అందరితో క్రాక్‌మాస్టర్ అనిపించుకుంటున్నవాణ్ణి. అందరిలో ఎగతాళిపాలు కాబడ్డవాణ్ణి. ఆడపిల్లల్తో చెంపదెబ్బలూ, మగాళ్ళతో కరాటే స్ట్రోకులూ తిన్నవాణ్ణి, తింటున్నవాణ్ణి, ఇంకా తిననున్నవాణ్ణి... నేనెందుకు అబద్ధం చెబుతాను?"

హరిశ్చంద్ర అలా అంటుంటే రాఘవయ్య మనసు తేలికపడింది.

నిజమే— హరిశ్చంద్ర అబద్ధం చెప్పడు కదా? అన్న నమ్మకం అతన్ని తన అనారోగ్యం గురించిన ఆందోళన నుండి దూరం చేసింది.

"ఏంటి మావయ్యగారూ? ఇంకా ఆలోచిస్తున్నారు?!... నేను చెప్పింది అక్షరాలా నిజం... మీకే కాదు చాలామందికి వస్తూంటుందిలా, జనరల్ వీక్‌నెస్ వల్ల చెస్ట్ పెయిను! ఎవరి ఊసో ఎందుకు, ఆమధ్య మా నాన్నగారిక్కూడా ఒకసారి ఇలానే వచ్చింది. ఓ వారం రోజులు ప్రతిరోజూ గుడ్డూ పాలూ వాడేసరికి మళ్ళీ దానంతటదే సర్దుకుంది"

"మీ నాన్నగార్ని కూడా ఇలా కంగారుపడి హాస్పటల్‌లో చేర్పించావా?"

"ఓ...ఎందుకు చేర్పించలేదూ?... అది జనరల్ వీక్‌నెస్ వల్ల వచ్చిందని మనమేం ముందు కలగనం కదా!...ఆయన విషయంలో కూడా డాక్టర్ చెప్పాకనే తెలిసింది...అసలు ఆయన ఎడ్వాయిజ్ మీదే వాడేం అలా గుడ్డూ పాలూ..."

రాఘవయ్య అలాగా అన్నట్టు తల పంకించాడు.

"ఇంకేం మాట్లాడకండి మావయ్యగారూ! కళ్ళు మూసుకుని విశ్రాంతి తీసుకోండి'. తలగడ దిండును సరిచేస్తూ-

"రండత్తయ్యగారూ...ఏదైనా మాట్లాడదలచుకుంటే ఇప్పుడే మాట్లాడండి! మళ్ళీ మావయ్యగారు పడుకున్నాక డిస్టర్బ్ చేయకండి" అన్నాడు హరిశ్చంద్ర.

దగ్గరకొస్తే ఎక్కడ ఏడుపు వచ్చేస్తుందోనని ఉగ్గబట్టుకుని అప్పటిదాకా ఎడంగానిలబడిన పూర్ణమ్మా, లాహిరీ మాటలతో మంచం దగ్గరికొచ్చారు.

"ఎందుకే అలా ఏడుపు ముఖాలు పెట్టారు? ఏం ఫర్వాలేదటలే. జనరల్ వీక్‌నెస్సేనటగా! మీరు చెప్పుంటే నేనసలు నమ్మేవాణ్ణి గాదు...అల్లుడు చెప్పబట్టి నమ్మాను...అదిసరే- అందరూ కట్టగట్టుకుని వచ్చేశారేంటి? ఏ దొంగ వెధవైనా దూరి ఇల్లంతా దోచేస్తేనో?!" అన్నాడు రాఘవయ్య రవంత ఆందోళనగా.

అంత విషాదంలోనూ పూర్ణమ్మకి లోలోన నవ్వు వచ్చింది. అతనలా మామూలుగానే మాట్లాడుతుండటంతో మనను కూడా కాస్త తేలికపడింది!

"ఎక్కడికక్కడ తాళాలు వేసే వచ్చాంలెండి! మీకెలా వుంది...నొప్పి తగ్గిందా?" అంది తలమీద చేయివేస్తూ.

"దొంగ వెధవలకి తాళాలొక లెక్కా?...నా

మాటిని నువ్వూ బంటూ ఇంటికెళ్ళిపోండి. అల్లుడూ, లాహిరీ వుంటార్లే ఇక్కడ అన్నాడు రాఘవయయ్య.

'అహ....ఎందుకండీ...నేనొక్కణ్ణే చాలు...లా హిరిగారు మీరు కూడా వెళ్ళండి..." అన్నాడు హరిశ్చంద్ర.

"అదేంమాట బాబూ! ఆయనేదో అంటే మాత్రం మేమెలా వెళ్తాం?! భలే వాడివే నువ్వు!!" అంది పూర్ణమ్మ.

"ఎలాగోలా చేయొచ్చులెండి" అనేసి, "మావయ్యగారూ మీరలాంటివేం ఆలోచించకండి! కళ్ళు మూసుకుని పడుకోండి ముందు..." అంటూ ఆప్యాయత మేళవింపబడిన చిరుగదమాయింపు గదమాయించాడు హరిశ్చంద్ర.

"సరేనోయ్..." అంటూ బుద్ధిగా కళ్ళు మూసుకున్నాడు రాఘవయ్య.

పూర్ణమ్మ హరిశ్చంద్రవేపు సజల నయనాలతో చూసింది. ఆ చూపులో...కృతజ్ఞతాభిమానాలు...స్పష్టాస్పష్టంగా మెరుస్తూ!

హరిశ్చంద్ర లాహిరి వేపు చూశాడు. ఆమె తెరచి వున్న కిటికీగుండా బయటికి చూస్తూంది. ఆమె ముఖంలో ఏ భావాన్నీ చదవలేకపోయాడు హరిశ్చంద్ర. తనూ చూశాడు ఆమె చూస్తున్నవేపు! చీకటి తప్పితే ఏముందక్కడ?!

★ ★ ★

రాఘవయ్య పూర్తిగా కోలుకొని హాస్పిటల్ నుండి డిశ్చార్జ్ అయ్యేంతవరకూ హరిశ్చంద్ర అతన్ని అంటుపెట్టుకునే ఉన్నాడు. డ్యూటీకి కూడా వెళ్ళలేదు. బ్యాంకుకి సెలవు పెట్టేశాడు!

కన్నకొడుకు కన్నా మిన్నగా అతను తన భర్తకు అలా సేవలు చేస్తుంటే- ఇది ఏనాటి ఋణానుబంధమో అనిపించింది పూర్ణమ్మకి.

రాఘవయ్య ఆ నర్సింగ్ హోంలో మొత్తం అయిదు రోజులు వున్నాడు.

తొలినాటి రాత్రి అయితే హరిశ్చంద్ర అబద్ధం అతి మధ్యపెట్టగలిగేడు గాని, ఆ తర్వాత రాఘవయ్యకి అసలు విషయం తెలియకపోలేదు!

తెలిసిన వెంటనే అతని మనసులో మెదిలింది హరిశ్చంద్ర.

తనకి హార్ట్ డిసీజ్ అన్న బాధకన్నా - ఆ క్షణంలో హరిశ్చంద్ర తనకోసం అబద్ధం ఆడాడన్నమాట!?- అనుకుంటుంటే కలిగిన ఆనందమే ఎక్కువగా ఉక్కిరిబిక్కిరి చేసేసిందతన్ని.

ఆక్షణంలోనే అతను ఒక నిర్ణయానికి వచ్చేశాడు-

"అవసరమైతే హరిశ్చంద్ర వాళ్ళనాన్న ఎంత కట్నమడిగితే అంతా యిచ్చి అయినా సరే అతన్ని తన అల్లుడిగా చేసుకుని తీరాలని".

అదేమాట అతను భార్యతో అంటే - "అబ్బ... ఎన్నాళ్ళకి ఓ మంచిమాట అన్నారండీ మీ నోటితో" అందామె నవ్వేస్తూ. నర్సింగ్ హోం నుండి ఇంటికి వచ్చాక.

"హాస్పటల్ నుండి వచ్చేశాంకదాని ఎడాపెడా తిరిగేయకండి! ఇంకా నాలుగయిదురోజులు విశ్రాంతి అవసరం అన్నారు డాక్టర్గారు..." అంటూ రాఘవయ్యకి జాగ్రత్తచెప్పి, పక్కాగట్రా పరిచి అతన్ని స్వయంగా పడుకోబెట్టి- తన రూమ్కి వెళ్ళాడు హరిశ్చంద్ర.

అయిదారు రోజులుగా తలుపైనా తీసినపాపానపోకపోవడంవల్ల గదంతా బూజులుపట్టి చాలా అధ్వాన్నంగా వుంది!

కాస్త శుభ్రపరుద్దామా అనుకున్నాడు కాని, అంతలోనే నీరసంగా వున్నట్లనిపించి- ఆ ప్రయత్నం మానుకున్నాడు.

మంచం మీది దుప్పటిని మాత్రం ఓసారి దులిపి మళ్ళీ పరిచాడు.

కాసేపు నడుంవాల్చాలనిపించి అలా ఒరిగాడో లేదో "బావా కాఫీ" అంటూ వచ్చాడు బంటూ.

"ఇకనుంచి నన్నలా పిలవద్దు బంటూ" అన్నాడు హరిశ్చంద్ర వాడిచేతిలోంచి కప్పు అందుకుంటూ.

"ఏం- ఎందుకని?"

"ఆయన చెప్పలేరులే నేచెబుతా" అంది అప్పుడే అక్కడికొచ్చిన లాహిరి.

"వెళ్ళి అతనిగది వూడ్చిరావే" అంటూ పూర్ణమ్మ పంపించింది ఆమెనా సమయంలో

అక్కడికి- అందుకే ఆమెచేతిలో చీపురుకట్ట వుంది!

"నేనేం మూగవాణ్ణి కాదులెండి లాహిరిగారూ! నేనూ చెప్పగలను..." హరిశ్చంద్ర అన్నాడు ఏభావమూ వ్యక్తంకాని కళ్ళతో ఆమెవేపుచేస్తూ.

"సో... మీరు మీ ఓటమిని అంగీకరిస్తున్నట్టేనా?"

"లేదు..."

"అంటే మీరు అబద్ధం ఆడలేదంటారా? నర్సింగ్‌హోంలో మా నాన్నతో చెప్పినవన్నీ అబద్ధాలు కావా?"

"కావచ్చు..."

"మరైతే ఎందుకు ఒప్పుకోరు మీ ఓటమిని?"

"ఒప్పుకోనని నేనెప్పుడన్నానూ?"

"హవ్వ! ఇంతలోనే మళ్ళీ అబద్ధమా! ఇప్పుడేగా అన్నారు". "నేనా?! నేనెప్పుడన్నానూ?! మీగ్గాని చెముడా ఏంటి?"

"ఏం... వేళాకోళంగా వుందా?" లాహిరి ఉక్రోషంగా చూసింది.

"కోప్పడకండి లాహిరిగారూ! నేనింకా ఈ రూమ్‌లో వుండేది మహా అయితే ఇవ్వాళా రేపూ. మీతో ఇలా తమాషాగా మాట్లాడే అవకాశం నాకీజీవితంలో మళ్ళీ కలగకపోవచ్చు! అవును... నేను ఓడిపోయాను. నేనిపుడు సర్వకాల సకలావస్థలయందూ నిజమే చెప్పాల్సిన వాణ్ణికాదుగా? అందుకే... ఇలా ఎడాపెడా అబద్ధాలాడేస్తున్నానన్నమాట!" హరిశ్చంద్ర నవ్వాడు. కాని అది నవ్వులాలేదు. ఉందీ అనుకున్నా అందులో జీవంలేదు. జీవముందీ అనుకున్నా అది పీకకోసిన కోడితాలూకు మొండెంలో వుండేపాటిది మాత్రమే.

"శుభం... అయితే రేపు మీరు రూమ్ ఖాళీ చేసేస్తున్నారన్నమాట" అంది లాహిరి ఎటో చూస్తూ.

"అవును..."

"ఏం- ఎందుకని! ఓడిపోయినంత మాత్రాన పారిపోవాలని వుందా? రూమ్ నదుపాయంగానే వున్నపుడు, ఏం ఇక్కడే వుండవచ్చుగా?!"

"ఉండలేను..."

"ఏం... ఎందుకని ఉండలేరు?"

"చెప్పినా మీకది అర్థంకాదులెండి..."

"అయితే చెప్పద్దులెండి... అన్నట్లు మా అమ్మ మీ రూమ్ తుడిచిరమ్మని పంపించింది... రేపు మీరు ఎలాగూ ఖాళీచేసే స్తానంటున్నారుగా... ఈ ఒక్కపూటకీ తుడవకపోతే ఏం- నన్ను వెళ్ళిరమ్మంటారా?" అంది లాహిరి నిర్వికారంగా.

'వెళ్ళిరండీ' అనలేదు హరిశ్చంద్ర.

"వెళ్ళండి లాహిరిగారూ!" అన్నాడు.

మనిషి మనిషిని ప్రేమించడం సహజం.

మనిషి ఓ బండరాయిని మనిషిగా భ్రమించి ప్రేమించడమూ సంభవమే!

కాని తీరా ఆ భ్రమకాస్తా తొలగిపోయి- అది బండరాయి మాత్రమే అని స్పష్టంగా తెలిసిపోయాక కూడా... ఆ బండరాయినింకా ప్రేమిస్తూనే ఎవరయినా వుండగలిగితే ఆ వ్యక్తి నిస్సందేహంగా పిచ్చివాడే!

హరిశ్చంద్ర పిచ్చివాడు కాదు!!

"థాంక్సండీ నాకు శ్రమతప్పించారు" అంటూ లాహిరి విలాసంగా చీపురుకట్టని ఊపుకుంటూ బయటికి వెళ్ళిపోబోతుంటే-

అప్పుడే అక్కడికొచ్చిన పూర్ణమ్మ- "ఆగక్కడ" అంటూ ఉరిమి చూసిందామెవేపు.

లాహిరి రూమ్ తుడవకుండా వెళ్ళిపోతున్నందుకామె కోపగించుకుంటున్నదేమో అనుకున్న హరిశ్చంద్ర-

"ఆమెని వెళ్ళనివ్వండి! నేనే చెప్పాను రూమ్ తుడవనవసరం లేదని..." అన్నాడు- తన మాజీ ప్రేయసిని సపోర్ట్ చేస్తూ.

పూర్ణమ్మ అది పట్టించుకోలేదు... "ఏమే... ఏమన్నావే హరిశ్చంద్రని?" అంది కూతుర్ని నమిలిమింగేలా చూస్తూ.

"అబ్బే... ఆమె ఏమీ అనలేదే నన్ను?... ఎందుకనుకుంటున్నారు మీరలా?"

"ఇది ఏమీ అనుండకపోతే రూమ్ ఖాళీచేసేయాలన్న ఉద్దేశం నీకెందుకు కలుగుతుందీ?"

"అరె... ఇప్పుడేగా నేనామాట అంట. అప్పుడే మీదాకా ఎలా వచ్చింది?" ఆశ్చర్యపోయాడు హరిశ్చంద్ర.

"నేనే చెప్పా బావా" అంటూ తలుపుచాటు నుండి చెంగున లోపలికి దూకాడు బంటూ.

వాడసలు రూమ్‌లోంచి ఎప్పుడు బయటికి వెళ్ళాడో లాహిరిగాని, హరిశ్చంద్రగాని గమనించనేలేదు.

"నిజం చెప్పు బాబు. ఇది... ఇది.. ఏదో అనే ఉంటుంది. నిన్ను... అవునా?" క్రోధంగా లాహిరివేపు చూస్తూ హరిశ్చంద్రని అడిగింది పూర్ణమ్మ.

"పాపం అనవసరంగా ఆమె మీద అభాండాలు వేయకండీ! ఆమె నన్నేమీ అనలేదు... కానైతే ఆమె పెట్టిన పరీక్షలో ఓడిపోయినందుకు మొహం చెల్లక నాఅంతట నేనే నిర్ణయించుకున్నాను రూమ్ ఖాళీ చేసేద్దామని...." బాధగా తలదించుకున్నాడు హరిశ్చంద్ర.

"పరీక్షా దాని మొహమా! అది కాదంటే నాలుగు తన్నైయినా సరే- దాన్ని ఒప్పించి తీర్తాను. దాని మాటలు నువ్వేం పట్టించుకోకు. ఆ దిక్కుమాలిన పరీక్ష పేరుతో ఇప్పటికి నిన్ను పెట్టిన తిప్పలు చాలు... ఆ బ్రహ్మదేవుడడ్డుపడినా సరే దాన్ని నీకిచ్చి పెళ్ళి చేసే బాధ్యత నాది..." అంది పూర్ణమ్మ ఉద్రేకంగా.

"వద్దు పూర్ణమ్మగారూ..." ఇంకా ఏదో చెప్పబోయాడు హరిశ్చంద్ర.

"పూర్ణమ్మగారూ కాదూ... అత్తయ్యగారూ అను..."

"ఊఁ... అనండి అనండి... ఇంకో కూతుర్ని కని మీకిస్తుందిలెండి..." అంది లాహిరి వ్యంగ్యంగా.

దాంతో పూర్ణమ్మ కోపానికి అవధులు లేకుండాపోయాయి! "నాలుక చీరేస్తానే ముండకానా ఇంకా ఏమయినా వాగేవంటే!" అంటూ పెంకు లెగిరిపోయేలా అరిచిందామె. హరిశ్చంద్రగాని అడ్డుపడకపోయి ఉంటే మీద పడి కొట్టేసి ఉండేదే కూతుర్ని.

"సిగ్గులేదే నీమొహానికి. పరీక్షంటూ, నీ బొందంటూ అతన్ని ముప్పుతిప్పలు పెట్టి-తీరా ఇప్పుడు కాదు పొమ్మంటావా? అతను అబద్ధం ఆడేదూ అంటే ఎవరికోసమే? అతని కోసమా? నీతండ్రి కోసం. నీ తండ్రి ప్రాణాలు నిలవడంకోసం. అలాంటివాన్ని పట్టుకుని ఏడిపించటానికి నీకు మనసెలా ఒప్పుతుందే? నువ్ మనిషివి కాదే రాయివి... బండరాయివి!" స్వరంలో తీవ్రతయితే తగ్గిందిగానీ మనిషి మాత్రం ఇంకా ఊగిపోతూనే ఉంది పూర్ణమ్మ.

"ఆయనే పరిస్థితిలో అబద్ధం ఆడారన్నది ఎవరిక్కావాలి? ... అబద్ధం ఆడేరు... ఓడిపోయారు... దట్సాల్... ఏమండీ అంతేనా?"

"అంతేనండీ అంతే" గంగిరెద్దులా బుర్రాడించాడు హరిశ్చంద్ర. తర్వాత పూర్ణమ్మ వేపు తిరిగి అన్నాడు.

"మీరిప్పుడన్నారు చూడండీ, లాహిరిగార్ని బండరాయి అని. ఆ మాటతో నేనూ ఏకీభవిస్తున్నాను. అందుకే చెబుతున్నాను- ఆమెనింకె మీ బలవంతం చేయకండి. నేను జీవితాంతం ఓ బండరాయితో కలిసి బతకలేను... మీరు మెడలు వంచి చేస్తానన్నా ఆమెను చేసుకోవాలన్న ఇంట్రస్ట్ నాకిప్పుడు లేదు"

తర్వాత లాహిరి వేపు తిరిగి అన్నాడు-

"క్షమించండి లాహిరిగారూ! మిమ్మల్ని బండరాయి అన్నందుకు మీకు కోపం వస్తే రావచ్చు- బట్ ఇట్ ఈజ్ ఎ ఫాక్ట్!"

"అయితే అక్కయ్యమీద కొడితే కొబ్బరికాయ పగులుతుందన్నమాట" అన్నాడు బంటూ.

"నీమూతిమీద కొడితే పళ్ళు రాల్తాయ్. పో ఇక్కణ్ణుంచి..." అంటూ వాడిమీదకి చేయెత్తింది లాహిరి.

ఎందుకొచ్చిన రిస్కని లెమ్మనుకున్నాడు గావల్ను వాడు చల్లగా జారుకున్నాడక్కడి నుంచి.

"నువ్వేమైనా అనునాయినా! కాని దాన్ని చేసుకోనని మాత్రం అనబోకు. మీ మావయ్యగారు నీమీద ఎంత అభిమానం పెంచుకున్నదీ నీకు తెలియందికాదు. అసలే ఆయన ఆరోగ్యం బావుండలేదు. ఇప్పుడు నువ్విలా అంటున్నావని తెలిస్తే ఆయన... ఆయన తట్టుకోలేరు బాబూ" అంది పూర్ణమ్మ గద్గదకంగా.

"ఒకపక్క నేను చేసుకోను మొర్రో అంటుంటే ఆయన్ని దేబిరిస్తావేం- అక్కడికాయనొక్కడే చెట్టుమీద ఉన్నట్టు?" అని మూతితిప్పి గబు

క్కున అక్కడినుంచి వెళ్ళిపోయింది లాహిరి.

"దాని మాటలకేంలే బాబూ...నువ్ మాత్రం ఇప్పుడిప్పుడే రూమ్ ఖాళీచేయడం గట్రా అనబోకు! కనీసం ఆయన కోసమైనా...ఆయన మరికొన్ని కోలుకునేదాకా అయినా వుండు..." అంటూ చేతులు పుచ్చుకుంది పూర్ణమ్మ. "ఇవి చేతులు కావు..." ఆమె అలా అంటుండే - హరిశ్చంద్ర కళ్ళు చెమ్మగిల్లాయి. "ఛఛ...ఊరుకోండత్తయ్యగారూ! అదేంమాట...అలాగే లెండి!!" అనేశాడు ముఖాన్ని పక్కకు తిప్పుకుంటూ-అలవాటయిన ధోరణిలో.

ఆ మాటకి పూర్ణమ్మ ముఖం వికసించింది. "నువ్ కాసేపు బయటికెళ్ళు బాబూ? గది శుభ్రం చేశాక మళ్ళీ పిలుస్తాను..." అంది లాహిరి వదిలేసిపోయిన చీపురుకట్టను చేతిలోకి తీసుకుంటూ.

"అలాగే" అన్నట్టు తలవూపి బయటికి నడిచాడు హరిశ్చంద్ర.

★ ★ ★

ఓ గంట తర్వాత-

హరిశ్చంద్ర తన రూమ్‌లో కిటికీ వద్ద నిలబడి వున్నాడు. లాహిరి పెరట్లో గులాబీ మొక్కలకు నీళ్ళుపోస్తూ వుంది?

గులాబీలకే కాదు, గులాబీ బాలలకు కూడా ముళ్ళుంటాయన్నమాట అనుకున్నాడు హరిశ్చంద్ర ఆమెను చూస్తూ

అంతలో ఆమె ఇటువైపు చూసి అలవోకగా నవ్వింది.

ఎంత అందమైన నవ్వు?!

ఎంత ఆహ్లాదకరమైన నవ్వు?!

'సిగ్గులేకుండా ఇంకా చూస్తావేమిట్రా ఆ బండరాయి నవ్వుని...చూసింది చాల్లేగాని ఇంక మూసేయ్ కిటికీని' అంటూ గద్దించింది అతని అంతరాత్మ.

అంతరాత్మ మాటని మన్నించి అతనేదో పనిచేయబోతుండగా "ఏయ్... మాట!" అంది లాహిరి.

"నన్నేనా?" అన్నట్టు కళ్ళతో అడిగాడు హరిశ్చంద్ర.

అవునన్నట్టు తలఊపి - చకచకా కిటికీ దగ్గరికి వచ్చింది లాహిరి?

జాకెట్లో చేయిపెట్టి నాలుగు మడతలు పెట్టిన ఓ చిన్నకాగితాన్ని బైటికి తీసి అతని చేతిలో పెట్టి గిరుక్కున వెనుదిరిగి పరుగుపరుగున అక్కణ్ణించి వెళ్ళిపోయిందామె.

ఏమై వుంటుందా అని ఆత్రంగా మడతలు విప్పి ఆ చీటీలోకి దృష్టి సారించాడు హరిశ్చంద్ర.

"నా ప్రియమైన హరిశ్చంద్రా...మీరు ఓడిపోయి నన్నుగెలుచుకున్నారు?! ఓడిపోబట్టే నన్ను గెలుచుకున్నారు! ఆడదాని కోసం గొంతులు కోసే మగవాళ్ళుంటారే తప్ప - ఎదుటివ్యక్తి ప్రాణం కోసం ప్రాణాధికంగా ప్రేమించిన ప్రియురాల్ని ఒదులుకోవడానికి వెనుకాడని మీలాంటి మగవాళ్ళు చాలా అరుదు? అందుకే ఆ క్షణం నుండి నా హృదయం నిండా మీరే!

మరి ఇందాకటి నా ప్రవర్తనకి అర్థమేమిటా- అని అనుకుంటున్నారు కదూ?

ఒక్కసారి కేలండర్‌కేసి చూడండి?

చూశారా...

అర్థమైందిగా?

ఇట్లు...ప్రేమతో మీ "బండరాయి"

"హుర్రే" అంటూ భూనభోంతరాలు దద్దరిల్లిపోయేలా ఓ పెనుకేక వేశాడు హరిశ్చంద్ర. తర్వాత లాహిరిని చూసి గాల్లోకి ఓ ముద్దు విసిరాడు హరిశ్చంద్ర.

"ఏంటి బావా... అంత గట్టిగా అరిచావు?' అన్నాడు బంటూ పరుగు పరుగున అక్కడికొచ్చి.

"ఒక్కోసారి నాకు మైండ్ సరిగ్గా పన్జేయదులే...అలాంటప్పుడు ఇలా గట్టిగా అరుస్తుంటాన్లే" అని వాణ్ణి గభాల్న గాల్లోకి లేపేసి గిరగిరా తిప్పేయసాగాడు హరిశ్చంద్ర.

"బావా వదులు....పిచ్చి బావా వదులు..." అంటూ వాడు గట్టిగట్టిగా అరుస్తూంటే-

రాఘవయ్య కుటుంబసభ్యులందరూ ఒక్కొక్కరుగా అక్కడికొచ్చి చేరిపోయారు... క్లైమాక్స్ సీన్‌లో అందరూ ఉండాలి గనుక.

అన్నట్టారోజు ఏప్రిల్ ఫస్టు. 

 



# చతుర కతలు



## పవర్‌కట్

కరెంటు పోయింది. ఆఫీసు స్టాఫంతా కుర్చీల్లో ఉన్నవాళ్లు టేబిల్స్ పైకి చేరారు.

"అబ్బ... ఈ పవర్‌కట్ చూడండి. రాత్రుళ్లు మరీ ఇబ్బందిగా ఉందండీ. మన రాష్ట్రానికి ఈ దరిద్రం ఎప్పుడు తప్పుతుందో" సుబ్బారావు చిరాకుగా అన్నాడు.

"ప్రతిరోజూ పది గంటలటండీ కట్! ఇంకెందుకండీ- మనింట్లో కనెక్షన్లు ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే" రామారావు శృతి కలిపాడు.

"ఇలానైతే కుర్రాళ్ల చదువులేమవుతాయండీ" మరో క్లర్కు ఆవేదన.

"ఆఁ ... ఇది చూశారూ! విద్యుత్ ఛార్జీల పెంపట. డొమెస్టిక్ సర్వీసులకు, యూనిట్‌కి పదిపైసలు అదనం ... ఇందులో మాత్రం తక్కువ లేదు ..." అంది టైపిస్టు సుందరి పేపర్ చూపుతూ.

"మీకో శుభవార్త. రేపు మిమ్మల్ని పవర్‌కట్ బారినుండి రక్షిస్తున్నా" అన్నాడు సుందరరావు అకస్మాత్తుగా.

అందరూ ఆశ్చర్యంలో పడ్డారు.

"రాష్ట్రంలో నిరుద్యోగసమస్య పూర్తిగా నిర్మూలించబడింది. దేశంలో అన్నలు దారిద్ర్యమన్నదే లేదు. సినీయాక్టర్లు ఇన్‌కంటాక్సులు అణాపైసల్తోసహా కట్టేశారు- లాంటి వార్తలైనా నమ్మవచ్చునేమోగానీ ఈ వార్త మాత్రం జోక్ ఆఫ్ ది ఇయర్‌గా చెప్పుకోవచ్చు" అన్నారొకరు.

"మీరు మరీనూ ... సీరియస్ డిస్కషన్‌లో కూడా జోకులు" అంటూ నవ్వింది సుందరి, అందరి మౌనంచూసి.

"కాదండీ... నే చెబుతున్నది నిజమే"

"చాల్చాల్లేవోయ్ ... సొల్లు కబుర్లుచెప్పకు. ఇక్కడ మేమేమీ చెవిలో పువ్వులు పెట్టుకు కూర్చోలేదు" అడ్డుపడ్డాడు రామారావు.

"కావాలంటే వంద రూపాయలు బెట్ కాయ్" కోపంతో జేబులోనుంచి నోటుతీసి టేబిల్‌పై పెట్టాడు సుందరరావు.

రోషంగా రామారావు కూడా పందెం కలిపాడు.

"ఈ సుందర్రావుకి ఈరోజేమయ్యింది. అనవసరంగా కొరిడబ్బులు వదిలించుకుంటున్నాడు" అని ఆఫీసులో గుసగుసలాడుకున్నారందరూ.

* * *

మరుసటిరోజు ఒక్కొక్కరే ఆఫీసులోకి ప్రవేశిస్తున్నారు. దిగులు ముఖంతో లోపలికి వచ్చాడు రామారావు.

"సుందర్రావుగారూ... మీరే గెల్చారు"



వస్తూనే విష్ చేసింది సుందరి.

"నేను చెప్పాను కదండీ. మీరెవరూ నామాట నమ్మలేదు" అంటూ కాలరెగరేశాడు సుందర్రావు.

పందెం డబ్బులు సుందర్రావు జేబులోకి చేరాయి.

"అవునండీ! మీకా విషయంముందే ఎలా తెలిసిందండి" ప్రైవేటుగా ప్రశ్నించింది సుందరి సుందర్రావుని.

"ఓహ్ అదీ ... మా ఇల్లు మినిస్టర్‌గారింటి దగ్గరే కదండి. ఆయన అన్నగారబ్బాయి పెళ్లి ఈ వీధిలోనే. ఈరోజే. అందుకే పవర్‌కట్ కాలేదు" అంటూ అసలు విషయం బయటపెట్టాడు సుందర్రావు ముసిముసిగా నవ్వుతూ.

—కర్రి త్రినాథరావు

## వేషాల రాయుడు

ఇల్లు విడిచి బయటకెళ్తే మనశ్శాంతి ఉండటం లేదు శ్రీకాంత్‌కు. రకరకాల అనుమానాలతో ఛస్తూ బతికేవాడతను. అందుకు కారణం అతడి అర్థాంగి సుందరి! భార్యా రూపవతీ శత్రుః అన్నమాట పదేపదే గుర్తుచేసేలా ఉంటుంది సుందరి.

ఇంట్లో ఉన్నప్పుడు తన భార్యని చూసుకొని 'అహా... ఏమి నా అదృష్టం' అని మురిసిపోతుండేవాడు కానీ ఇంట్లోనుంచి అడుగుతీసి బయటకు అడుగేయబోయేసరికి భార్యపై ఎవడి కన్నైనా పడుతుందేమో, ఎవరైనా తన భార్యను వల్లోవేసేసుకుంటాడేమోనని అనుమానంతో గిలగిలలాడిపోయేవాడు శ్రీకాంత్.

ఆ బాధ భరించలేక అడపాదడపా మారువేషంలో తనుండే వీధిలోనే సంచరిస్తూ సుందరిని అబ్జర్వ్ చేసేవాడు.

ఆ రోజు ఏ వేషమూ కుదరక బిక్షగాడి వేషం వేశాడు శ్రీకాంత్. అనుకున్నట్లుగానే ఆ వేషంలో తన ఇంటికెదురుగా తిష్టవేశాడు.

ఎన్నడూ లేనిది ఆరోజు సుందరి చాలా అందంగా ముస్తాబయ్యేసరికి శ్రీకాంత్ గుండె అదిరిపోసాగింది. పైగా సుందరి తదేకంగా, మైకంగా, మత్తుగా తనవేపే చూస్తుండ

టంతో వళ్లంతా కారం ·నట్లుగా అనిపించింది. 'ఇదేం పోయే, అడుక్కునేవాడి వైపు అలా చూస్తుం?' అని మనసులోనే మథనపడ్డాడు.

అలా ఓ పావుగంట చింది.

సుందరి ఈ బిచ్చని రమ్మని పిలిచింది. ఆ సైగకి శ్రీకి గుండెలో ఏదో పేలినట్లైంది. 'ఓర్నా' దీనికిదేం పోయే కాలం. అడుక్కునే పిలుస్తుందేవిట'నుకుంటూ జంకుతూస్లాడు.

"ఏమయ్యో... నే వున్నాను..." సుందరి ప్రశ్నకి ఆశ్చర్యపో రెళ్లబెట్టాడు శ్రీకాంత్.

"నేను చాలా ంగా వున్నాను కదూ... నీకు నచ్చితే చెప నీతో లేచి వచ్చేస్తాను."

ఆ మాటల శ్రీకాంత్ గుండె పూర్తిగా జారిపోయినట్ల ది.

"ఏంటలా న్యపోతున్నావ్! మా ఆయన తెగ అనుమా మనిషిలే! ఆయన ఎన్నో వేషాలు వేసిపలాకాస్తూ నన్ను అనుమానించడంతో తిక్కరేగిపోయింది. ఇంకో మారు ఆ గాని ఏ వేషంలోనైనా నాకు దర్శనమిచా వెంటనే నేను ఏ అడుక్కునే వాడితోనైనా లేచిపోతానని ప్రతిజ్ఞ చేసుకున్నాను. నానువ్వు నచ్చావ్... మరి నేను నీకు నచ్చితే డే ఆ రోడ్డుపక్కన కాపువేయ్. ఈలోగా మాఆయన ఏ మారువేషంలోనన్నా కనబడ్డాడో తక్షణం నీతో లేచివచ్చేస్తా..."

శ్రీకాంత్‌కి మత్తులాంటిదేదో కమ్ముకొచ్చి పడిపోబోయినవాడల్లా తమాయించుకొని నిలబడ్డాడు.

"అయితే నేను ఇన్నాళ్లూ వేస్తున్న వేషాల సంగతి తన అర్ధాంగికి తెలిసిపోయిందన్న మాట... లక్కీగా ఈ భిక్షగాడి వేషం గుర్తుపట్టలేకపోవడంతో తను బతికిపోయాడు. లేకపోతే తన భార్య నిజంగానే ఎవడితోనైనా లేచిపోయేదేమో..." అని మనసులో అనుకొని తన అనుమానాన్ని తిట్టుకుంటూ అక్కణ్ణుంచి కదలబోయాడు.

"మీకు నాటకాలు వేసే అనుభవం వుందని సంతోషించాను కానీ, ఇలా భార్యననుమానించి వేషాలు దుర్వినియోగం చేస్తారని తెలిసివుంటే అసలు మిమ్మల్ని పెళ్లిచేసుకోకపోదును... ఇక మీదట మీరు ఇలాంటి వేషాలు వేస్తే మీకు మీచేతిలోని ఆ చిప్పేగతి అని రుజువుచేస్తాను..." అంటూ కోపంగా గిరుక్కుమని వెనుతిరిగింది సుందరి.

అంటించుకున్న గెడ్డాలు, మీసాలు తీసేసి చేతిలోని చిప్ప విసిరేసి "నన్ను క్షమించు సుందరీ" అంటూ ఆమె వెనకాలే లోపలికి పరుగెత్తాడు శ్రీకాంత్.

—టి.వెంకటేష్








# టూ లేట్

ఇంట్లో దీపాలు వెలగకపోయేసరికి కుటుంబరావు బుర్ర పాడయింది. గతరాత్రి వీచిన పెనుగాలికి ఎలక్ట్రిక్‌పోల్ మీది తన ఇంటికి సంబంధించిన లైన్ కనెక్షన్ నుంచి వేరయిందేమోనని బయటకు వెళ్ళి కరెంట్‌పోల్ దగ్గరపైకి చూశాడు. అతడు ఊహించినది నిజమయింది. తన ఇంటి తాలూకు మెయిన్ వైర్ పోల్‌నుండి తెగిపోయి వేలాడుతోంది.

ఆ దృశ్యానికి కుటుంబరావు హతాశుడయ్యాడు.

ఓరీ భగవంతుడా... కరెంట్ ఆఫీస్‌కెళ్ళి ఆ చిత్రగుప్తుడి చిట్టాలాంటి పుస్తకంలో తను కంప్లైంట్ రాయాలి... దానిని కరెంట్‌వాళ్ళు చూసి దయతలచి తన ఇంటికి రావాలి. ఇది ఇప్పట్లో జరిగే పనేనా! ఎన్ని నెలలుపడుతుందో కదా!

అప్పటివరకు తను నూనెదీపాలతో గుడ్డివెలుతుర్లో గడపటం ఎలా? అని మధ్యతరగతి కుటుంబరావు నిట్టూరుస్తుండగా నలుగురు వ్యక్తులు ఆయన దగ్గరక్చొ "కె.కుటుంబరావు ఇల్లు ఎక్కడుంది?"ని అడిగారు.

కుటుంబరావు ఆశ్చర్యకితుడై "ఆ కుటుంబరావుని నేనే... ఏం పని?" అని అడిగాడు వారిని.

"మీ కరెంట్‌మీటర్ నెంబ 145 గదా?" ప్రశ్నించారు.

"ఆ... అవును"

"కరెంట్ ఆఫీసులో కంప్లైం రాశారు. ఏమిటి ప్రాబ్లమ్?"

కుటుంబరావుని ఆశ్చర్యం, ఆనమయం రెండూ ముంచెత్తాయి.

"నె...నె..నేను కంప్లైంట్ రాశానా?...ఎ...ఎప్పుడు? విస్మయంతో తడబడ్డాడు.

"ఏమో? మాకు అవన్నీ గుర్తుటాయేమిటి? అయితే మమ్మల్ని పొమ్మంటారా?" నిర్లక్ష్యంగా అడిగాడు ఒకడు.

"లేదు లేదు... అదుగో ఆ పోల్‌మీద వేలాడుతున్న తీగమాదే. దాన్ని సరిచేయు" అన్నాడు కుటుంబరావు.

వాళ్ళు పవర్‌సప్లయ్ ఆపుచేసి క్షణాల్లో తీగెను కనెక్ట్‌చేసి వెళ్ళిపోయారు.

కుటుంబరావు ఇంట్లో లైట్లు యధావిధిగా

 

చూసింది.

'తను కంప్లైంట్ ఇవ్వడం ఏమిటి!?'- అనుకుంటూ ఇంట్లోకి అడుగుపెట్టాడు.

డవుట్ క్లియర్ చేసుకుందామని "ఒరేయ్ కృష్ణా... నువ్వుగానీ కరెంటు ఆఫీసులో కంప్లైంట్ ఇచ్చావేంటి?" అడిగాడు తనయుణ్ణి.

"లేదు నాన్నా" అన్నాడు కృష్ణ తెల్లమొహంవేసి.

"లేదా?" క్వెశ్చన్‌మార్కు పెట్టేసింది కుటుంబరావు ముఖం.

"ఎందుకునాన్నా అలా ప్రశ్నించావ్?"

"ఏంలేదురా... మనలైన్ పాడయిందికదా రాత్రి. ఇప్పుడిప్పుడే కరెంటువాళ్లు మనం కంప్లైంట్ ఇచ్చామంటూ వచ్చారు. ఇంతకూ ఎవరిచ్చినట్టు?"

కృష్ణకి వెంటనే జ్ఞాపకం వచ్చింది!

"అవును నాన్నా... సంవత్సరం క్రితం మా ఫ్రెండ్‌వాళ్లింట్లో కరెంట్‌పోతే కరెంట్ ఆఫీసుకి వెళ్ళినపుడు సరదాగా మన ఇంటి అడ్రను కూడా అందులో రాశానులే. దాని ఫలితమే ఇదయివుంటుంది"

"అలాగా ఎందుకయినా మంచిది మరోసారి వెళ్ళి ఇంకో కంప్లైంట్ రాయి" అన్నాడు కుటుంబరావు.

—కొలిమల్ల అప్పారావు

## షాక్

"నమస్కారం సార్!"

"హలో సుబ్బారావ్‌గారా! రండి రండి... ఇలా కూర్చోండి"

"చాలా థాంక్స్ సార్"

"ఫర్వాలేదులే వోయ్. ఇంతకీ నీవని ఎంతవరకు వచ్చింది?"

"ముషీరాబాద్‌లో సైట్ చూశానుసార్. లక్ష న్నరకు సెటిల్ చేశాను. నాకు తెలిసిన ఇంజినీర్ చేత ప్లాన్ వేయించాను. ముందుహాలు, బెడ్‌రూం, డైనింగ్‌హాల్, కిచన్, స్టోర్‌రూం. మొత్తం అయిదు రూములు సార్. పైన మరో నాల్గురూములు గెస్టులు వస్తే అవసరానికి ఉపయోగపడుతుందని కట్టాలను కొంటున్నానుసార్"

"చాలా బాగుందోయ్! ఫర్నిచర్ సంగతి కనుక్కొన్నావా!"

"అన్నిటికీ ఆర్డరిచ్చాను సార్. వారంరోజులలో ఫర్నిచర్ అంతా ఇంటికి చేరుతుంది"



"ఇంటికి కావాల్సిన సామాను కొన్నావా సుబ్బారావ్"

"కొన్నానుసార్. టి.వి. కావాలని శ్రీమతి పట్టుబట్టింది. రేపు డబ్బు పే చేస్తానని తీసుకొచ్చానుసార్"

"నిన్ను చూస్తే చాలా గర్వంగాఉందోయ్. క్యాషియర్‌గా పనిచేస్తూ పొదుపును పాటించి ఉన్నత స్థాయికి వచ్చావు. రియల్లీ ఐయామ్ ప్రౌడ్ ఆఫ్ యు"

"అదేంలేదుసార్! నాకు లాటరీలో పాతిక లక్షలు వచ్చాయి. మీరు ఊళ్ళో నిన్న లేకపోయేసరికి ఈ వార్త మీకు తెలిసిఉండదు"

"కంగ్రాచ్యులేషన్స్ సుబ్బారావ్. అయితే మాకు పార్టీ గట్రా...."

"ఈ రాత్రికి హొటల్ తాజ్‌లో పార్టీ అరేంజ్ చేసానుసార్. మీరు తప్పక రావాలి సార్"

"ఓ.కె. ష్యూర్"

"సార్ మరో మాట! నా ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నాను. ఇదిగోండి రిజిగ్నేషన్ లెటరు"

"మంచిది వెళ్ళిరండి"

★ ★ ★

"సార్! సార్! సుబ్బారావుగారూ"

"ఏమిటీ"

"చిన్నపనుంది. కొంచెం షాపులోకి వస్తారా!"

"ఏమిటోయ్ మీది పెద్ద న్యూసెన్స్. డబ్బున్నవాడి చుట్టూ ఈగల్లా మూగుతారు"

"అదికాదుసార్ ఈ రోజు పేపర్ చూశారా!"

"ఇక్కడి పేపర్లు చూడాల్సిన పని లేదు నాకు. ఇంటికే తెప్పించుకొంటాను రేపటి నుంచి"

"అదికాదండి మీరు షాక్ తినకుండా ఉంటే ఓ విషయం చెప్పాలి"

"ఏమిటయ్యా నాకు బోలెడు పనులున్నాయి. అదేదో తొందరగా చెప్పు"

"నిన్న పేపర్లో లాటరీ టిక్కెట్ నెంబర్లు తప్పుపడిందిసార్. పాతికలక్షలు మీకు రాలేదు. ఈ రోజు పేపర్లో దానికి సంబంధించిన సవరణ ఉంది"

"ఆ... ఆ... నిజంగానా... ఆ... ఆ... హా!"

—ఎస్. భవానీరాజ్

---

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✶ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

'ఆగస్టు చతుర నవల 'హరిశ్చంద్రుడు అబద్ధం ఆడితే'

సమీక్షకుని పేరు : ..............................

చిరునామా : ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
ఆనక్తికర రచనా నంవిధానంతో పాఠకులన
ఆకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
సరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరీనిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే నమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
వక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

## చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482

# పఠన ముత్యాలు

★ స్త్రీ పురుషుని చరాస్తి కాదు, ఆట వస్తువుకాదు, భోగసాధనంకాదు. స్త్రీకి ప్రత్యేక వ్యక్తిత్వం ఉంది. ఈ సత్యం గ్రహించని పురుషుడు మూర్ఖుడు, పశుప్రాయుడు.

-- చలం

★ అవతలి వ్యక్తి మన అభిమతానికి అనుగుణంగా మాట్లాడితే అతన్ని గొప్పవాడంటాం. అతనే మనకు అంగీకారం కాని మాట చెబితే చవట అంటాం.

-- స్విఫ్ట్

★ ఒక మనిషి గొప్పతనం ఎందులో కనిపిస్తుందంటే అతడు తనకన్నా తక్కువవారితో వ్యవహరించేతీరునుబట్టి తెలుస్తుంది.

— కార్లైల్

★ కథారచయితకు భావదారిద్ర్యం, పునరుక్తి దోషం ఉండకూడదు. అందుకే రచయిత తన మిత్రులను, పరిసరాలను తరచు మారుస్తాడు. చదవవలసిన అవసరం లేకపోయినా జ్ఞాపక శక్తిని పెంపొందించుకొనేందుకు విరివిగా పుస్తకాలు చదువుతుంటాడు.

— స్విఫ్ట్

★ తెలియని విషయాలు తెలిసినంత మాత్రాన విద్య అనిపించుకోదు. నడవడిక సరిదిద్దగలిగినప్పుడే అది విద్య.

— జాన్ రస్కిన్

★ హృదయంలేని శరీర సౌందర్యం వ్యర్థం.

— వివేకానంద

★ తాము మాత్రమే ప్రేమించుకున్నామని, తమదే ఆదర్శ ప్రేమ అని, ఇంతకు ముందు ఎవరూ తమవలె ప్రేమించుకోలేదని నమ్మినప్పుడే అది నిజమయిన ప్రేమ అవుతుంది.

— గేథే

★ పేరు సంపాదించినంత మాత్రాన ప్రతిభ ఉన్నట్లు కాదు. ప్రతిభ ఉండటానికి కొంతవరకే అవకాశం ఉంది. అలాగే ప్రతిభగలవారికి పేరు కూడా రావడం చాలా అరుదుగా జరిగే విషయం.

-- కార్లైల్

★ ఎదుటివారి ఆత్మగౌరవాన్ని, ఆత్మాభిమానాన్ని కించబరచనంతకాలం / నీవు మంచివాడివే.

— బ్రూరే

★ మనిషిలోకోరికలు వుండడం పెద్దవిషయం కాదు. కానీ మన కోర్కెల లక్ష్యం మంచిదైవుండాలి. ఇతరులకు హాని జరిగేవిగా వుండకూడదు.

--నెహ్రూ

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

# చుట్టూ ప్రపంచం

## హల్లో! హల్లో!

పబ్లిక్ టెలిఫోన్‌నుంచి మాట్లాడాలంటే మనదేశంలోలా ఫ్రాన్స్‌లో చిల్లర నాణాలకోసం తడుముకోనక్కరలేదు. అసలు నాణాలు వేయకుండానే ఎంచక్కా పబ్లిక్ టెలిఫోన్ సౌకర్యం మనం వినియోగించుకోవచ్చు. ఎందుకంటే-టెలికమ్యూనికేషన్స్ విషయంలో ప్రపంచం మొత్తం మీద ఫ్రాన్స్‌దే అగ్రస్థానం. 'డిజిటల్ స్విచ్చింగ్ అండ్ ట్రాన్స్‌మిషన్' విధానం ద్వారా కమ్యూనికేషన్స్ రంగంలో కంప్యూటర్లను ప్రవేశపెట్టిన ఘనత కూడా వారిదే! అక్కడ ప్రతి వందమందిలో 94 మందికి టెలిఫోనులు ఉన్నాయంటే ఆ రంగంలో ఆ దేశం ఎంత ముందడుగులో ఉందో మనం సులభంగా గ్రహించవచ్చు. ఇందుకోసం అక్కడి ప్రభుత్వం 'స్మార్ట్‌కార్డ్' విధానాన్ని ప్రవేశపెట్టింది. బాంక్ క్రెడిట్ కార్డులా ఉండే 'స్మార్ట్ కార్డ్' ను ఉపయోగించి ఏ పబ్లిక్ టెలిఫోన్‌నుంచైనా, ఎక్కడికైనా హాయిగా మాట్లాడుకోవచ్చు. ఫోన్ చేసేవారు ఈ కార్డుని ఒకవైపు చేత్తో పట్టుకొని రెండోవైపును పబ్లిక్ టెలిఫోన్ బాక్స్‌లో ఉంచి మాట్లాడాలి. పబ్లిక్ టెలిఫోన్లలో ఏర్పాటుచేసిన కంప్యూటర్ల కారణంగానే అక్కడ ఈ 'స్మార్ట్ కార్డ్' విధానం విజయవంతమైంది. ప్రస్తుతం ఫ్రాన్స్‌లో 16 మిలియన్ల స్మార్ట్ కార్డ్‌లు వినియోగంలో ఉన్నాయి. ఈ విధానంవల్ల ఎవరూ పబ్లిక్ ఫోన్స్ నుంచి నాణేలు దొంగిలించే అవకాశం లేదు. వినిమయదార్లకు చిల్లర సమస్యలు ఉండవు.



ఈ విధానం ద్వారా రుసుము చెల్లించకుండానే మనం ఉచితంగా పబ్లిక్ టెలిఫోన్‌ను వినియోగించుకోవచ్చునని మీరనుకుంటే నిస్సందేహంగా పప్పులో కాలేసినట్లే! ముక్కుపిండిమరీ టెలిఫోన్ ఛార్జీలు వసూలు చేస్తారు. ఎలాగంటే-'స్మార్ట్ కార్డ్' తీసుకునేటపుడే మనం డబ్బులు చెల్లించాల్సుంటుంది. ప్రభుత్వం నిర్ణయించిన ధర మేరకు కార్డులో సూచించిన యూనిట్లప్రకారం ముందుగా డబ్బు చెల్లించి 'స్మార్ట్ కార్డ్' తీసుకోవాలి. దీనిని 'ఆన్ లైన్ కార్డ్' (on-line card) అంటారు. ఈ కార్డును సొంత టెలిఫోన్ లేని వ్యక్తులకు మంజూరు చేస్తారు.

సొంత టెలిఫోన్ ఉన్నవారికి 'ఆఫ్ లైన్ కార్డ్' (off line card)ఇస్తారు. ఈ కార్డు ఉన్నవారు బయటి పబ్లిక్‌ఫోన్స్‌లో నుంచి మాట్లాడితే - ఆ ఛార్జీ వారి టెలిఫోన్ బిల్లుతో కలపబడి ఆ బిల్లుతోపాటు చెల్లించాల్సుంటుంది. ఈ 'స్మార్ట్ కార్డ్' విధానం వచ్చాక అక్కడివారు పబ్లిక్ టెలిఫోన్‌లు ఏ బాదరబందీ లేకుండా హాయిగా వినియోగించుకుంటున్నారు.

# తండ్రీ తనయులు

**చ**లనచిత్ర, రాజకీయరంగాల్లో తండ్రీపిల్లల హడావిడిని గురించి ఎక్కువగా వింటుంటాం. భారతీయ సమాజంలో తండ్రి వృత్తి కొడుక్కు సంక్రమించే సంప్రదాయం వున్నప్పటికీ ఇప్పుడు కాలం మారింది. తల్లిదండ్రుల ప్రభావంతో పిల్లలు రాజకీయాల్లోకి, సినిమాల్లోకి ప్రవేశించటం కఠిన విమర్శకులోనవుతోంది. కాని క్రీడారంగంలో మాత్రం తండ్రి అడుగుజాడల్లో ప్రవేశించిన కొడుకులు మాత్రం ప్రశంసా పాత్రులవుతున్నారు. క్రీడల్లో సామర్ధ్యం ఒక్కటే కొలమానంగా వుండటమే ఇందుకు కారణం.

భారత క్రికెట్ టీమ్ నాయకత్వానికి ఆహ్వానింపబడినపుడు ఇఫ్తికర్‌అలీ పటౌడి (సీనియర్) ఆక్స్‌ఫర్డ్ బ్లూ ప్రశస్తిని పొంది వున్నాడు. పుత్రుడు మన్సూర్ అలీఖాన్ పటౌడి కూడా ఆక్స్‌ఫర్డ్ బ్లూ ప్రశస్తి తర్వాత మన క్రికెట్ టీమ్ నాయకత్వాన్ని చేపట్టాడు. ఆ తర్వాత క్రికెట్ రంగంలో తండ్రుల తర్వాత కొడుకులు చాలామంది ప్రవేశించి ప్రఖ్యాతి పొందారు. లాలా అమరనాథ్ - మొహిందర్ అమరనాథ్, వినూ మంకడ్ - అశోక్ మంకడ్, రామ్‌సింగ్ - కృపాల్‌సింగ్, డి.కె.గైక్వాడ్ - అంశుమన్ గైక్వాడ్ మన భారత క్రికెట్ రంగంలో ప్రకాశించిన తండ్రీకొడుకులు. ఎం.యల్.జయసింహ పుత్రుడు వివేక్ జయసింహ టెస్ట్ మాచ్‌లోకి ప్రవేశిస్తున్నాడు. ఇంగ్లాండ్, పాకిస్తాన్ క్రికెట్ రంగాల్లోను పేరు పొందిన తండ్రీకొడుకులు వున్నారు. కాలిన్ కౌడ్రి - క్రిస్ కౌడ్రి, జహంగీర్‌ఖాన్ - మజీద్ ఖాన్, నజార్ మహమ్మద్ - ముదస్సర్ నాసర్, హనీఫ్ మహమ్మద్ - షోయబ్ మహమ్మద్ కొన్ని ఉదాహరణలు.

భారత హాకీరంగంలోను తండ్రీకొడుకులున్నారు. హాకీ మాంత్రికుడు ధ్యాన్‌చంద్ కుమారుడు అశోక్‌కుమార్ తండ్రి ఖ్యాతిని మరోసారి గుర్తుచేశాడు. ఒలింపియన్ అహమ్మద్ షేర్ ఖాన్ పుత్రుడు అస్లాం షేర్‌ఖాన్ రాజకీయాల్లోకి దిగేముందు హాకీ ఆటగాడిగా మంచిపేరు పొందాడు. వెస్లీ క్లాడియస్ పుత్రుడు రాబర్ట్ భారతహాకీ జట్టులోకి ప్రవేశించిన తర్వాతనే అకాలమృత్యువు పాలయ్యాడు. తండ్రి క్లాడియస్‌కు ఇది నిత్య దుఃఖంగా వుంది.

ఫుట్‌బాల్‌లోనూతండ్రీకొడుకుల సామర్థ్యానికి కొన్ని ఉదాహరణలున్నాయి. భారత ఉత్తమ కోచ్ అయిన యస్.ఎ.రహీం పుత్రుడు భారత జట్టు ఆటగాడు. ఇప్పుడితను అంపైర్‌గా పనిచేస్తున్నాడు. అతనిసహోదరుడు వసీమ్ ఆంధ్ర జట్టుకేగాక భారతీయ యువజట్టు నాయకుడయ్యాడు. ఒలంపిక్స్ క్రీడాకారుడు మొయిద్దీన్ కొడుకు లతీపుద్దీన్ భారతీయ జూనియర్, సీనియర్ జట్టుల్లో ఆడిన తర్వాతనే రిటైర్ అవుతున్నట్లు ప్రకటించాడు. ప్రసిద్ధ ఆటగాడు కిట్టు పుత్రిక ఉమాకిట్టు మహిళాజట్టులో స్థానం పొందింది. క్రీడారంగంలో తండ్రీకూతు



ళ్ళ ప్రతిభకు ఇదొక అపురూపమైన ఉదాహరణ.

టెన్నిస్ రంగంలోనూ ఇటువంటి ఉదాహరణలున్నాయి. ప్రపంచ ప్రఖ్యాత టెన్నిస్‌వీరుడు రామనాథకృష్ణన్ కుమారుడు రమేష్‌కృష్ణన్ తండ్రిపేరు నిలుపుతున్నాడు. ఇంతకీ రమేష్ చేతిలోవున్న రాకెట్ తాతగారిది అనేది మరో గమనార్హమైన విషయం. ప్రఖ్యాత టెన్నిస్ క్రీడాకారుడు వసంత్ పుత్రిక నిరుపమా వసంత్ భారత టెన్నిస్ కిరీటాన్ని ధరించింది. ఆ తర్వాత నిరుపమా అశోక్ మంకడ్‌గా మారింది. టెన్నిస్ - క్రికెట్ బాంధవ్యానికి ఇదొక అపురూపమైన ఉదాహరణ అనవచ్చు. వేరువేరు క్రీడల్లోను తండ్రీపిల్లలు తమ ప్రతిభను ప్రదర్శించారు. అథ్లెట్ హెన్రీ రెబెల్లో పుత్రుడు మార్క్‌రెబెల్లో, బికనీర్ కర్ణిసింగ్ పుత్రిక రాజశ్రీ, రవీందర్‌సింగ్ పుత్రుడు రణధీర్‌సింగ్, బాస్కెట్‌బాల్‌లో రఘురాం కుమారుడు రామ్‌కుమార్ అటువంటివారే.

స్వజన పక్షపాతం, భ్రష్టాచారం క్రీడారంగాన్నీ వదలలేదనటానికి ఒక ఉదాహరణ - అలహాబాద్‌కు చెందిన బి.పి.త్రిపాఠి అఖిల భారత వాలీబాల్ అసోసియేషన్ అధ్యక్షుడుగా వున్నపుడు కుమారుడు రజనీకాంత్ త్రిపాఠి భారతజట్టు నాయకుడుగా స్థానంపొందగా అనేకమైన వివాదాలు, విమర్శలు తలెత్తాయి.

## సర్ఫింగ్

సాగర జలాలతో ఆడుకోవటం కొత్తరకమైన అనుభూతినిస్తుంది. ఈ ఆటని 'సర్ఫింగ్' అంటారు. మనదేశంలో ఈరకం ఆట ఇంకా ప్రాచుర్యంలోకి రాలేదు. అమెరికాలో 70 శాతం ప్రజలు ఈ క్రీడలో ఆరితేరారు. ప్రత్యేకమైన కొయ్యతో చేసిన బల్లపరుపు పలకని ఈ ఆటకి ఉపయోగిస్తారు. సముద్రతరంగాలపై ఉవ్వెత్తున లేచే అలలమీద బల్లలాంటి పరికరం ఉయ్యాలలూగుతుంది. ఈ ఆట ఆడటానికి ధైర్యం ఉండాలి. క్రీడాకారులు ప్రాణాలు అరిచేతిలో పెట్టుకుని ఆడాల్సివస్తుంది. సర్ఫింగ్‌కి ఉపయోగించే సాధనాన్ని 'సర్ఫింగ్‌బోర్డ్' అంటారు. దీనిని క్రీడాకారులు కాళ్లకి కట్టుకుంటారు. కొందరు మోకాళ్లకి, పొట్టకి కట్టుకుని నీటి అలలపై నాట్యం చేసినట్లుగా



ముందుకు సాగిపోతారు. పడిపోకుండా జాగ్రత్తగా బాలెన్స్ నిలుపుకుని ఆట ఆడాలి.

సర్ఫింగ్ ఆటను పోలెండ్‌జలు ముందుగా కనుగొన్నారు. పసిఫిక్ సము ద్రంలో న్యూజిలెండ్ సమీపంలో 'త హిటీ' ద్వీపంలో నివసించే ప్రజలు ఈను హవాయి ద్వీపంలో నేర్చుకున్నారు.

బ్రిటన్‌కి చెందిన కెప్టెన్‌కుక్ హవాయ్ శాండ్‌విచ్ ద్వీపానికి సముద్రంపై ప్రయాణం చేస్తూ ఈ ఆటగాళ్లను చూశాడు. అప్పుడు ఆటను పాశ్చాత్యదేశాలలో ప్రవేశపె. 1908వ సంవత్సరం తరువాత అమెరికా, పాశ్చాత్యదేశాలలోను ఈ ఆట ప్రసిద్ధికెక్కి. హవామ్‌ద్వీపంలో సముద్రపు అలలు ఈ ఆడటానికి అనుకూలంగా వుంటాయి. ఆటలో ఆసక్తికలవారు అక్కడికి వెళ్లి ఆ రు.

సర్ఫింగ్‌బోర్డ్ 5 నుండి 9 అడుగుల పొడ 18 నుండి 22 అంగుళాల వెడల్పు, 2 లే అంగుళాల మందం గల కొయ్యతో చేస్తా దాని ముందు భాగం, వెనుకభాగం కొనల వుంటాయి. బరువు $2^1/_2$ నుండి 6 కిలోగ్రా లుంటుంది. కొయ్యముందు, వెనుక మిగ భాగం కంటే పల్చగా చెక్కివుంటుంది. దీని లన దాని గరిమనాభి మధ్యలో కేంద్రీకృత బాలెన్స్ చెయ్యటానికి అనుకూలం వుంటుంది. చెక్కపై నునుపుగా వుండటాని ఫైబర్‌గ్లాస్‌తో కోటింగ్ చేస్తారు.

మూడు నాలుగు అడుగుల ఎత్తులేచే సమ ద్రతరంగాలు సర్ఫింగ్‌కి అనుకూలం వుంటాయి. ఆటలో ఆరితేరినవారు సమ ద్రంలోకి వెళ్లి 15-20 అడుగుల ఎత్తులే అలలపై కూడా సర్ఫింగ్ చేస్తారు. అమెరికా ఈ ఆటను ప్రోత్సహించటానికి మూడు సంఘ లున్నాయి. క్రీడాకారులు ఆ సంఘాలలో సభ లుగా చేరి ఆటలపోటీలు నిర్వహిస్తారు. భా తదేశంలో ఈ ఆటను ప్రోత్సహించటానికి టూ రిజం విభాగంవారు ఆసక్తి కనబరుస్తున్నార మూడువక్కల సముద్రం వున్న మన దేశం అనేక కేంద్రాలలో ఈ ఆట ఆడటానికి అవకా లున్నాయి. విదేశీయాత్రికులను ఆకర్షించ ఈ క్రీడను ప్రోత్సహిస్తే పర్యాటకులకునో దంగా వుంటుంది.

## ఆఫ్రికార్

నవలా నాయకులు పడవలాంటి కారులో తిరుగుతున్నారని చదువుతున్నప్పుడల్లా అలాంటి కారులో షికారు కెళ్ళాలని కలలు కంటుంటారు జనం. ఆ కోరిక తీర్చుకోగలస్తోమత వున్నవారు యింపోర్టెడ్ కార్లకోసం పరుగులుపెట్టి సాధించుకుంటుంటారు కూడాను. కానీ యెంకి పెళ్ళి సుబ్బి చావు కొచ్చినట్టు- ఈ ఇంపోర్టెడ్‌కార్లమోజు మూలంగా బీదదేశాలకు విదేశీ మారక ద్రవ్యం విపరీతంగా ఖర్చవుతుంటుంది. ఇంతేకాక, ఇంటర్నల్ కంబశ్చన్ యింజన్ కనిపెట్టి 133 సంవత్సరాలైనప్పటికీ బీద దేశాల అవసరాలు తీర్చగలిగే చౌకకారు అన్నాళ్లలో తయారవ్వలేదు. ఈ విషయాలన్నీ దృష్టిలో పెట్టుకుని ఎలాంటి రోడ్లపైనైనా చెక్కు చెదరకుండా తిరిగి, ఎలాంటి వాతావరణాన్నైనా తట్టుకుని నిలబడగల కారుకు రూపకల్పన చేశాడు ఇంగ్లండుకు చెందిన టోనీ హోవర్త్.

ఇంగ్లండులోని 'ఆఫ్రికార్ ఇంటర్నేషనల్' కంపెనీవారి ఆధ్వర్యంలో తక్కువ ధర, తక్కువ ఖర్చు, ఎక్కువ మన్నికలను దృష్టిలో పెట్టుకుని, అటువంటి కారుతయారీకోసం పరిశోధనలు జరిగి, అవి ఒక కొలిక్కి వచ్చాయి. 'ప్లైవుడ్ రెయిన్ ఫోర్స్‌డ్ ప్లాస్టిక్' (పి.ఆర్.పి)తో ఈ కారు బాడీని రూపొందించారు. అంటే మామూలుగా చెప్పుకోవాలంటే యిది 'కొయ్యకారు.' పి.ఆర్.పి, స్టీల్‌కన్నా 30 శాతం, గ్లాస్‌ఫైబర్‌కన్నా 15 శాతం తేలికైనది. మరింత ధృఢమైనది, చాలా చౌకలో తయారు చేసుకోగలదీనూ. ఈ కారులోని లోహభాగాలన్నీ తుప్పు పట్టని విధంగా గేల్వానైజ్‌డ్ స్టీలుతో చేయబడినాయి. తక్కువ ఎత్తుగల గరిమనాభి కేంద్రంగావున్న దీని ఇంజన్‌వల్లా, విలక్షణమైన సస్పెన్షన్ సిస్టమ్‌వల్లా, తేలికగా వున్నప్పటికీ ఈ కారును ఎంతవేగంగా నడుపుకున్నా ప్రమాదాలు జరుగవు. బీద దేశాలను, ముఖ్యంగా ఆఫ్రికాదేశాలను దృష్టిలో పెట్టుకుని రూపొందించిన ఈ కారుకు 'ఆఫ్రికార్' అని నామకరణం చేశారు.

ఆఫ్రికార్లను విదేశాలనుండి దిగుమతి చేసుకోవటం కన్నా, ఈ కంపెనీ వారి సహకారంతో ఏ దేశానికాదేశం తమ దేశంలోనే వాటిని ఉత్పత్తి చేసుకోవటం లాభదాయకంగా వుంటుందని ఈ కార్ల కంపెనీవారు చెబుతున్నారు. అన్ని రకాల మోడల్సూ కలిసి ఏడాదికి 5 వేల కార్లు ఉత్పత్తి చేయగలిగితే, 39 కోట్ల రూపాయల విదేశీ మారక ద్రవ్యం ఆదా చేసుకోవచ్చును. బడుగు దేశాలలో ఉత్పత్తి చేసుకునే ఆఫ్రికార్లకు పాశ్చాత్య దేశాలలో గిరాకీని చూపించేందుకై ఈ కంపెనీ వారు ఒక సంస్థను ఏర్పాటు చేశారు కూడా. విడిగా ఈ కారు ధర సుమారుగా 80 వేల రూపాయలకు మించదు. ఐతే ఈ కార్లను ఉత్పత్తి చేసే ప్లాంట్ స్థాపనకు మాత్రం 26 కోట్ల రూపాయలదాకా అవుతుంది. బీద దేశాలకు యిది కొంచెం పెద్దమొత్తమే అయినా దీర్ఘకాలంలో ఆ ప్రభావం ఎక్కువగా కనిపించకపోవచ్చు. అయితే దురదృష్టమేమంటే ఇన్ని రకాల ఆకర్షణలు వున్నప్పటికీ ఈ కార్లు కొనుక్కోవటానికి ఎవ్వరూ అంతగా ముందుకు రావటంలేదు.

కెన్యా దేశంలో వున్న మూడు విదేశీ కార్ల
కలు, అక్కడి కార్ల అమ్మకాల్లో 95 శాతం
న్నం చేసుకున్నాయి. "విప్లవాత్మకమైన
ష్మలున్నాయని ప్రచారం చేస్తున్నందున,
దీలిక వాడుకలో ఆఫ్రికార్ ఎంత మన్నికగా
ఘుందో వేచి చూడాలని ప్రజలు భావిస్తా
రుందుకే వీటి అమ్మకాలు మందకొడిగా
ణయి" అని జాన్ మేచిన్ అనే నిపుణుడు
ఫ్నాడు. "ఒక కారు నిలువగల సామాజిక
దాను అది అందించలేకపోతే, ఆ కారు
త గొప్పదైనాసరే, ప్రజలు దానిపట్ల మోజు
రు. ఆఫ్రికారు అవసరమైనదే అయినప్ప
ఈ కారు ఆఫ్రికావారు కోరుకునేది కాదు"
వివరించాడు కెన్యాలోని ఓ పత్రికా సంపా
డైన గేవిన్ బెన్నెట్. ఈ కారుకు ఉపయో
చిన పి.ఆర్.పి మూలంగా 'కొయ్యకారు ఓ
నా' అని అనిపించటమూ, బీద దేశాలను
ష్టిలో పెట్టుకుని రూపొందించినందున
పట్ల చులకన భావం కలుగటంవల్ల
తా ఆఫ్రికారు తగినంత ఆకర్షణను కలి
చలేకపోతున్నది. అయితే మొట్టమొద
ఆఫ్రికారు డీలర్‌షిప్ తీసుకున్న ఘనా
నికిచెందిన ఓ వాణిజ్యవేత్త- "నగరాల్లో
లే వారికోసం పనికొచ్చే కార్లు కాదు కావల
చి, రైతులకు యిలాంటి దిట్టమైన కార్లే
కలి" అని దాన్ని ప్రశంసించాడు.




# ఉద్యోగస్థులే భాగస్వాములు

కేపిటలిస్ట్ దేశంగా పేరుతెచ్చుకున్న అమెరికాలో దాదాపు 8 వేల కంపెనీలలో పనిచేసే కార్మికులే ఆయాకంపెనీలలో భాగస్వాములంటే ఆశ్చర్యం కలగకమానదు.

అమెరికాలో త్వరితంగా అభివృద్ధిచెందుతున్న పీపుల్ ఎక్స్‌ప్రెస్ ఎయిర్‌లైన్స్‌లోని ఉద్యోగస్థులందరికీ ఆ కంపెనీలో భాగస్వామ్యంఉంది. అక్కడ వర్కర్స్‌ని 'మేనేజర్స్'గా వ్యవహరిస్తారు. అలాగే క్వాడ్ గ్రాఫిక్స్ అనే ప్రింటింగ్ కంపెనీలోని వర్కర్స్‌ని 'పార్టనర్స్‌గా' వ్యవహరిస్తే, డబ్ల్యుఎల్‌గేర్ అసోసియేట్స్ అనే 4000 మంది పనిచేసే ఎలక్ట్రానిక్ కంపెనీలోని వర్కర్స్‌ని 'అసోసియేట్స్'గా పిలుస్తారు. ఆ 8 వేల కంపెనీలలోను దాదాపు వెయ్యి కంపెనీలలో వర్కర్లకి కంపెనీ పెట్టుబడిలో వాటాలున్నాయి.

వర్కర్లే పెట్టుబడుదారులుగా నడిచే అనేక సంస్థలు అమెరికాలోని ప్రతిమూలా ఉన్నాయి. రెస్టారెంట్స్, దినపత్రికలు, రవాణా, సూపర్‌మార్కెట్స్, [illegible], కంప్యూటర్స్... ఇలా ఏమిటి? అన్నిరంగాలలో 'ఇ.ఎస్.ఒ-పి' కంపెనీలే అనేకంవున్నాయి.

ఇ.ఎస్.ఒ-పి అంటే ఎంప్లాయీ స్టాక్ ఓనర్‌షిప్ ప్లాన్. పదేళ్ళక్రితం ఎవరూ ఊహించనయినా ఊహించని ఈ పథకాన్ని అమెరికన్ ప్రభుత్వమే అనేకచట్టాలద్వారా ప్రవేశపెట్టి ప్రోత్సహిస్తోంది.

ఇ.ఎస్.ఒ-పి కంపెనీగా పరిగణింపబడే సంస్థలలోని ఉద్యోగస్థులకి పెట్టుబడిలో, తద్వారా లాభాల్లోకూడా వాటాఉంటుంది. అయితే ఆ కారణంగా ఆయాకంపెనీలు ఇన్‌కమ్ టాక్స్‌వంటి అనేకరాయితీల్ని ప్రభుత్వం నుంచి పొందుతాయి. మరోలాభం ఆ కంపెనీలకు సమ్మెలు, బాయ్‌కాట్‌లవంటి లేబర్ సమస్యలుండవు. కంపెనీ ఎంతలాభం గడిస్తే, అంతగా ఉద్యోగస్థులూ ఆ కంపెనీలో తమకు గల షేర్లనుబట్టి అదనంగా డబ్బుగడిస్తారు. అంతేగాక జీతాలు పెంచమనీ ఆందోళనచేయకపోగా ఉత్పత్తిని పెంచడానికి అంతా కృషిచేస్తారు. ఇలాంటి సౌకర్యాలున్నందున

చాలా కంపెనీలు ఇ.ఎస్.ఓ.-పి కంపెనీలుగా మారడానికి ఉత్సాహం చూపిస్తున్నాయి.

1974 నుంచీ ఇప్పటివరకూ అమెరికన్ ప్రభుత్వం పన్నెండు చట్టాల్ని ఈ రకం కంపెనీల అభివృద్ధికి ప్రవేశపెట్టింది.

ఈ తరహా కంపెనీల్లో పనిచేసే ఉద్యోగస్థుల్ని ఇంటర్వ్యూచేస్తే, వాళ్లు వెలిబుచ్చిన అభిప్రాయాలు ఇలావున్నాయి.

"నేను పనిచేసే కంపెనీలో నాకు భాగస్వామ్యం ఉండటంతో కంపెనీ అధికంగా లాభాల్ని గడించాలని కృషిచేయబుద్ధిపుడుతుంది"

"నేను పనిచేసే కంపెనీలో నాకు షేర్లు ఉండటం నాకెంతో గర్వంగాఉంది"

"ఈ కంపెనీ షేర్లు నాకు ఉండటంతో ఈ ఉద్యోగం మానేసి మరో ఉద్యోగానికి పోబుద్ధికాదు"

"నేను రోజూ చేసేపనిలో ఇదివరకటికన్నా ఈ పద్ధతివల్ల నాకెంతో ఉల్లాసంగా ఉంది. ఇంకా ఇంకా పనిచేయబుద్ధిపుడుతుంది"

"ఇదివరకటికన్నా కష్టించి పనిచేస్తున్నాను"

ఈరకం కంపెనీలలో లాభాలశాతం 75 శాతందాకా పెరుగుతోంది. ఆఫీసు స్టేషనరీ వృధాచేయడం, కాలక్షేపంకోసం పనిలేని పూట జెమ్ క్లిప్స్ విప్పి పాడుచేస్తుండటం, స్నేహితులకి ఫోన్స్‌చేసి బిల్లుపెంచడంలాంటి ఉద్యోగస్థుల వృధా ఖర్చులు గణనీయంగా తగ్గాయి.

ఉద్యోగస్థులు రిటైరయ్యాక ఆషేర్లని అధిక ధరకి బయటవాళ్లకి అమ్ముకోగల్గుతున్నారు. 10 డాలర్ల షేరు, లాభాల పెరుగుదలవల్ల 150 డాలర్లదాకా అమ్ముడుపోతోంది. రిటైరయ్యాక ఈ విధంగా అధికమొత్తాన్ని ఉద్యోగస్థులు కళ్ళ జూడకలుగుతున్నారు.



Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

పురాణకాలపు మేనక అందానికి,
నవీనకాలపు మేనక ఆకర్షణానికి,
ఆధారము ఒక్కటే... ఆయుర్వేద ఆధారము.








ఆ రహస్యమును తెలుసుకున్నది
కేవలం చంద్రిక మాత్రమే.

అందువల్లనే, మీకు
చంద్రిక అందాన్ని,
యౌవ్వనాన్ని,
ఆకర్షణాన్ని ఇస్తుంది.




# చంద్రిక

ఆయుర్వేద టాయ్‌లెట్ సబ్బు.

మీ దేహానికి తగిన మిత్రుడు

MGP/CP/001 89

